| | | |
|---|---|---|
| వైకల్పికము | = | వచ్చుట, రాకపోవుట |
| సంధి | = | మొదటి పదాలు చివరి అచ్చు రెండవ పదము మొదటి అచ్చులు కలియుది. |
| సంయుక్తము | = | వేర్వేరు హల్లు కూడిక |
| సంశ్లేషము | = | వేర్వేరు హల్లుల కూడిక |
| సమాసము | = | పెక్కుపదములు కూడిక ఒక్క పదమగుట |
| సరళములు | = | తేలికగా పలుకబడునవి |
| సవర్ణం | = | ఒకేరకమైన అక్షరం |
| సర్వనామం | = | నామవాచకమునకు బదులుగా వాడునది. |
| స్వరములు | = | అచ్చులు/ప్రాణములు |
| స్పర్శములు | = | ముఖమందలి ఏదేని ఒక అవయవమును తాకి వచ్చునవి. |
| సాధ్యం | = | వ్యాకరణంచేత సాధించినవి. |
| సిద్ధం | = | సహజముగా ఏర్పడినది. |
| స్థిరములు | = | నిలుకడగా నుండునవి. |
| స్త్రీలింగము | = | స్త్రీలను తెలుపునది |
| హ్రస్వములు | = | పొట్టివి/కురుచులు |

## విభక్తి ప్రత్యయాలు

| | | |
|---|---|---|
| డు ము వు లు | = | ప్రథమావిభక్తి |
| ఓ ఓయి ఓసి ఓరి ఆ, ఆర | = | సంబోధన ప్రథమా విభక్తి |
| నిన్ నున్ లన్ కూర్చి గురించి | = | ద్వితయావిభక్తి |
| చేతన్‌చేన్ తోడన్‌తోన్ | = | తృతీయా విభక్తి |
| కై, కొరకు | = | చతుర్థవిభక్తి |
| వలనన్, కంటెన్, పట్టి, పర్యంతము | = | పంచమీ విభక్తి |
| నిన్,కున్, యొక్క, లోన్, లోపలన్ | = | షష్ఠీ విభక్తి |
| అందున్, నన్ | = | సప్తమీ విభక్తి |

తినడమంత సులువు కాదు అరగడం - చెప్పడమంత సులువు కాదు చేయడం.

## కొన్ని వ్యాకరణ సూత్రములు

1. ఇ ఈ ఎ ఏ లంగూడిన చజలు తాలవ్యములు

2. అఆ ఉఊ ఒఓఔ లంగూడిన చజలు దంత్యములు

3. పూర్వపరస్వరంబులకు పరస్వరంబేకాదేశమగుట సంధి.

4. సంధిరానిచో స్వరంబుకంటె పరంబగుస్వరమునకు యడాగమంబగు.

5. అత్తునకు సంధి బహుళము

6. ఇత్తునకు సంధి వైకల్పికము

7. ఉత్తునకు సంధి నిత్యము

8. అచ్చున కామ్రేడితము పరమగునపుడు సంధి తరచుగనగు.

9. దీర్ఘాక్షరములకు, ఎ ఒ లకును సంధిలేదు.

10. ప్రథమ మీది పరుషములకు గసడదవలు బహుళముగానగు

11. ద్రుత ప్రకృతికము మీది పరుషములకు సరళములగు

12. ఉకారాంత శబ్దములకు ఆలు శబ్దము పరమగుచో రుగాగమము

13. ప్రాతాదుల తొలియచ్చు మీదివర్ణంబులకెల్ల లోపము బహుళము

14. ఆమ్రేడితమ్ము పరమగునపుడు విభక్తి లోపమ్ము బహుళము.

15. సవర్ణదీర్ఘ సంధి: సమా సమైన అచ్చుకు సంధి పొసగునపుడు దీర్ఘమాదేశమగును.

16. వర్గాక్షరములకు అనునాసికము పరమగుచో వర్గాంత్యాక్షరమగు.

17. భాషాభేదము వలన సమాసమ్ము త్రివిధంబు

18. కేవల సంస్కృత శబ్దముల సమాసము సాంస్కృతికము.

19. తెలుగు పదముల సమాసము ఆచ్ఛికము.

20. తత్సమాంధ్ర శబ్దముల సమాసము మిశ్రమము.

21. అర్థ భేదము చేత సమాసము చతుర్విధము.

22. పూర్వ పదార్థ ప్రధానము అవ్యయీభావము

23. ఉత్తర పదార్థ ప్రధానము తత్పురుషము

24. ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము.

25. అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి.

# వృత్తులు

చక్రం గిరగిర తిప్పేవాడు
మట్టితో కుండలు చేసేవాడు
కుమ్మరీ - కుమ్మరీ ...





ఇనుప ముక్కలను కాల్చేవాడు
పలుగు పారలను చేసేవాడు
కమ్మరీ - కమ్మరీ ...

ఇసుక - సిమెంటును కలగలిపి
ఇటుకను రాళ్ళను పేర్చేవాడు
మేడలు, మిద్దెలు కట్టేవాడు
మేస్త్రీ - మేస్త్రీ ...

రంపం, బాడిస ఉపయోగించి
ఇంపుగ తలుపులు చేసేవాడు
ఇంటిని బాగా తీర్చేవాడు
వడ్రంగీ - వడ్రంగీ ...



పగ్గం మగ్గం చేతను పట్టి
పడుగు పేకలను వేసేవాడు
గుడ్డలు మనకందించేవాడు
సాలీడు - సాలీడు ...



ఎండవానలను లక్ష్యపెట్టక
కండలన్ని కరిగించేవాడు
నేలదున్ని పండించేవాడు
రైతన్నా - రైతన్నా ...

బంగారము కుంపట్లో వేసి
సింగారాల నగలను చేసి
స్త్రీలకు అందం తెచ్చేవాడు
కంసాలీ - కంసాలీ ...



తల్లి                మిన్ను నెరుగు - మిన్ను నెరుగు వాడు తన్ను తానెరుగు.

## సంస్కృత భాషకు అక్షరములు ఏబది 50

### स्वर

अ आ इ ई उ ऊ ऋ ॠ

ए ऐ ओ औ अं अः

### व्यंजन

क ख ग घ ङ
च छ ज झ ञ
ट ठ ड ढ ण
त थ द ध न
प फ ब भ म
य र ल व

श ष स ह

## అచ్చ తెనుగు భాషకు అక్షరములు ముప్పది యేడు 37

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ

ఒ ఓ ఔ (ం ం)

క గ చ చ జ జ

ట డ ణ త ద న ప బ మ

య ర ఱ ల ళ

వ స హ ॥

## ఆంధ్రభాషకు అక్షరములు ఏబదియారు 56

**అచ్చులు : 16**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

**ఉభయాక్షరాలు - 3**

ఁ ం ః

**హల్లులు : 37**

క ఖ గ ఘ ఙ

చ చ ఛ జ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ఱ ల ళ వ

శ ష స హ ॥

## హిందీ అక్షరములు

### स्वर

अ आ इ ई उ ऊ ऋ ए ऐ ओ औ अं अ :

### व्यंजन

क ख ग घ ङ

च छ ज झ ञ

ट ठ ड ढ ण

त थ द ध न

प फ ब भ म

य र ल व

श ष स ह क्ष त्र ज्ञ

## మరాఠీ అక్షరములు

### स्वर

अ आ इ ई उ ऊ ऋ ए ऐ ओ औ अं अ :

### व्यंजन

क ख ग घ ङ

च छ ज झ ञ

ट ठ ड ढ ण

त थ द ध न

प फ ब भ म

य र ल व

श ष स ह क क्ष

## కన్నడ అక్షరములు

ಅ ಆ ಇ ಈ ಉ ಊ

ಋ ೠ ಎ ಏ ಐ ಒ ಓ ಔ ಅಂ ಅಃ

ಕ ಖ ಗ ಘ ಙ

ಚ ಛ ಜ ಝ ಞ

ಟ ಠ ಡ ಢ ಣ

ತ ಥ ದ ಧ ನ

ಪ ಫ ಬ ಭ ಮ

ಯ ರ ಲ ವ ಶ ಷ ಹ ಳ ಕ್ಷ

## తమిళ అక్షరములు

அ ஆ இ ஈ உ ஊ எ ஏ

ஐ ஒ ஓ ஔ ஃ

க ங ச ஞ

ட ண த ந

ப ம ய ர

ல வ ழ ள

ற ன

అన్ని గుణాలలో వినమ్రత ఉత్తమం - అదిలేక ఎన్ని ఉన్నా నిరుపయోగం.

## ఇంగ్లీషు అక్షరములు 26

| | | | |
|---|---|---|---|
| A | B | C | D |
| E | F | G | H |
| I | J | K | L |
| M | N | O | P |
| Q | R | S | T |
| U | V | W | X |
| | Y | Z | |

## సామెతలు

పుట్టమీద అలుకటం, మట్టిమీద ఉతుకుటం

పనిపాతర పెట్టి మనం జాతర పోయిందట.

మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె.

గుర్రం గుడ్డిదైనా దానా తినడం మానదు.

గుడ్డెద్దు చేలో పడ్డట్టు

ఇంటిపేరు కస్తూరి ఇంట్లో గబ్బిలాల కంపు.

పిచ్చి కుదిరింది - రోకలి తలకు చుట్టుమన్నాడట.

పాతోడు లేకుండా ఏతులు కొట్టాలి.

వ్రేళ్ళకు మట్టి అంటినా - చెట్టుకు మట్టి ఉండదు.

ముళ్ళు గట్టిగున్నా పువ్వు గట్టిది కాదు.

చేతిలో బెల్లం ఉంటేనే ఈగలు.

ఏరు దాటి తెప్పకాల్చడం.

దిగితేగాని లోతు తెలియదు.

దూరపు కొండలు నునుపు.

నోరు మంచిదైతే ఊరు మంచిది.

అదిగో పులి అంటే ఇదిగో తోక

తీగ లాగితే డొంక కదిలింది.

మోసేవాడికి గాని బరువు తెలియదు.

తలలు బోడులైన తలపులు బోడులా.

మాటలు కోటలు దాటినా - కాళ్ళు గడప దాటవు.

రెక్కాడితేకాని డొక్కాడదు.

అద్దం అబద్ధం ఆడుతుందా ?

ముంజేతి కంకణమునకు అద్దమెందుకు.

శంఖంలో పోస్తేనే తీర్థం.

ముద్దుపెట్టుకొంటే ముక్కుపట్టుకున్నట్టు.

ఆడలేక మద్దెల ఓడు అన్నట్టు

రోలుపోయి మద్దెలతో మొరపెట్టుకున్నట్లు.

మెత్తనివానిని చూస్తే మొత్తబుద్ధి అవుతుంది.

దున్నపోతు ఈనిందంటే - దూడను కట్టేయమన్నట్టు

తిన్నింటి వాసాలు లెక్కపెట్టుట.

తలపాగా చుట్టరాక - తలవంకర అన్నట్టు.

ఎద్దుపుండు - కాకికి ముద్దా ?

అడుసుతొక్కనేల - కాలు కడగనేల.

ఎక్కడవేసిన గొంగళి అక్కడే ఉన్నట్టు.

పిట్ట కొంచెం - కూత ఘనం

గోరు చుట్టుమీద - రోకటి పోటు

కుక్కతోక పట్టుకొని - గోదావరి ఈదినట్టు.

కూసే గాడిద వచ్చి - మేసే గాడిదను చెడగొట్టింది.

అద్దాలలో బిడ్డలుగాని - గడ్డాలలో బిడ్డలా

తంతే బూరెల బుట్టలో పడ్డట్టు

అత్తలేని కోడలు ఉత్తమురాలు - కోడల్లేని అత్త గుణవంతురాలు.

పేనుకు పెత్తనం ఇస్తే - తలంతా తెగ కొరికింది.

పిండికొద్ది రొట్టె - కుండకొద్ది నీళ్ళు.

అడిగితే తప్ప అమ్మయినా పెట్టదు.

ఎవరి అంతరాత్మ వారికే సాక్షి

పాముని లేక పొగపెట్టినట్టు

పిల్లికి చెలగాటం - ఎలుకకు ప్రాణ సంకటం.

పిల్లికి ఎలుక సాక్ష్యం.

అందితే జుట్టు - అందకపోతే కాళ్ళు.

తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళు.

అల్లుడొచ్చేదాకా అమావాస్య ఆగుతుందా.

ఊళ్లోపెళ్లికి కుక్కల హడావుడి.

తుమ్మితే ఊడిపోయే ముక్కు ఎన్నాళ్లుంటుంది.

దున్నబోతే దూడల్లోను - మేయబోతే ఎడ్లల్లోను.

ఇల్లు అలుకగానే - పండుగ కాదు.

నీరు పల్లమెరుగు - నిజము దేవుడెరుగు.

# ట్రింగ్ ట్రింగ్



ట్రింగ్ ట్రింగ్ ట్రింగ్ ట్రింగ్ సైకిల్ రా
రెండే చక్రాల్ రయమున తిరిగి ర్రైర్రై ర్రైర్రై పోతుంది
ఎద్దుగిద్దూ గుర్రం గిర్రం
ఏమియు లేకనె పోతుంది
పాదముతోను పెడల్ త్రొక్కితే
పరుగున పరుగున పోతుంది
ఈ సైకిల్ ఈ సైకిల్
బడికి వేగమే పోవాలంటే
భలే తమాషా సైకిల్ రా
సందులు గొందులు అన్నిటిగుండా
సర పర సర పర పోవుమరా
ఈ సైకిల్ ఈ సైకిల్

శ్రీ న్యాయపతి రాఘవరావు.

# ప్రొద్దున్నే

ప్రొద్దూ ప్రొద్దున్నె లేద్దామా
తోటకు మనము పోదామా
అందుగల పువ్వులు కోద్దామా
కోసినవి రాసులుగ పోద్దామా



సాలింటికాడ సన్నదారం తెద్దామా
దాసరింటి కాడ సన్నసూది కొందామా
అన్నింటిని దండలుగ గుచ్చుదామా
దేవుడి గుళ్ళోకి పోదామా
కిర కిర తలుపులు తీద్దామా
దేవుడి మెడలో వేద్దామా

*( శ్రీమతి సోమన గుంటూరురాఘవమ్మ వినిపించినది)*

ఆదివారము నాడు అమ్మక్కపుట్టె
సోమవారము నాడు చురుకుగా నడిచె
మంగళవారము నాడు మాటలు నేర్చె
బుధవారము నాడు బుద్ధులు నేర్చె
గురు వారము నాడు పరిణయం బాయె
శుక్రవారము నాడు సూడిదెలందె
శనివారము నాడు చనె అత్తయింటికి

*( గోదావరి జిల్లా దేసివీడు సింహాచలం వినిపించినది.)*

# చిటికెన వ్రేలు

చిటికెన వ్రేలు చెల్లాయి
ఉంగరపు వ్రేలు బంగారం
నడుమన వ్రేలు నాయన్న
చూపుడు వ్రేలు చూపిస్తే
బొటన వ్రేలు బొట్టిస్తే
అరచేయరచేయి జోడిస్తే
దేవునికి దండం పెట్టొచ్చు

*( శ్రీమతి యస్. నిర్మల, మెట్టుపల్లి వినిపించిది)*

**అవివేకి ఎదుటి వాడి తప్పులు లెక్కిస్తూంటాడు - వివేకి తన తప్పులు ఎదుటివాడిని చూసి సరిదిద్దుకుంటాడు.**

# ఒకటి రెండు - పన్నెండు

ఒకటి ఒక్క
రెండు రోకలి బండ
మూడు ముత్యాల చెండు
నాలుగు నర్సిమ్ములు
ఐదు హనుమంతరాయుడు
ఆరు అరుచుకుంటూ
ఏడు ఎగురుకుంటూ
ఎనిమిది ఎలుగ్గొడ్డు
తొమ్మిది తోలుతిత్తి
పది పందికొక్కు
పదకొండు పార్వతీదేవి
పన్నెండు పరమేశ్వరుడు

( శ్రీ అంగడి వేల్పుమడుగు లక్ష్మన్న వినిపించినది)

# ఏమి కలువ

నల్ల నల్ల
ఏమినల్ల
బొగ్గునల్ల
ఏమిబొగ్గు
కట్టెబొగ్గు
ఏమికట్టె
మామిడికట్టె
ఏమి మామిడి
అంటు మామిడి
ఏమి అంటు
మల్లె అంటు
ఏమి మల్లె



రాజకీయ నాయకుడి జీవితమంతా అధికారపు సొత్తు - ఒక నిజాయితీపరుడైన ఓటుతో అతని బ్రతుకు చిత్తు.

బొడ్డుమల్లె
ఏమి బొడ్డు
కలువబొడ్డు
ఏమి కలువ
**చెంగలువ**

*( తాడేపల్లి బుల్లివెంకయ్య , మంగము సుబ్బన్న వినిపించినది)*

# ఎందుకు

దున్నపోతు దున్నపోతు దుక్కెందుకు దున్నవ్
పసులోడు గాయంది నన్నేమంటావ్
ఏమిరా పసులోడ ఎందుకుగాయవ్
జీతమియ్యంది నన్నేమంటావ్
పటేల పటేల జీతమెందుకియ్యవ్
సోలదొరుకంది నన్నేమంటావ్
ఏమేసోల ఎందుకు దొరకవ్
వడ్లతను చెక్కంది నన్నేమంటావ్
ఏమిరా వడ్లోడ ఎందుకు చెక్కవ్
బాడిశె తెగంది నన్నేమంటావ్
ఏమే బాడిశె ఎందుకు తెగవ్
కమ్మరయ్య చరువంది నన్నేమంటావ్
ఏమిరా కమ్మరయ్య ఎందుకు చరువవ్
తిత్తి ఊదంది నన్నేమంటావ్
ఏమేతిత్తి ఎందుకు ఊదవ్
బక్కగొడ్డు చావంది నన్నేమంటావ్
ఏమే బక్కగొడ్డు ఎందుకు చావవ్
ఆయుస్సు మూడంది నన్నేమంటావ్

- దేవుమారు

విత్తనం భూమిని చేరి మొక్కై చిగురిస్తుంది - స్నేహం మంచి మనిషితో చేస్తే జీవితం మహా వృక్షం అవుతుంది.

# వేమన పద్యాలు

అజ్ఞానమె శూద్రత్వము
మజ్ఞానమెబ్రహ్మమౌట శ్రుతులనువినరా
యజ్ఞానముడిగి వాల్మికి
మజ్ఞాన బ్రహ్మమందె జూడర వేమా!



గురువు శిక్ష లేక గురుతెట్లు కల్గును
అజునకైన వాని యబ్బకైన
తాళపు చెవిలేక తలుపెట్టులూడురా
విశ్వదాభిరామ! వినురవేమ!



ఉర్వివారి కెల్ల నొక్కకంచము బెట్టి
పొత్తుకుడిపి కులము పొలయజేసి
తలనుచేయి బెట్టి తగనమ్మజెప్పరా!
విశ్వదాభిరామ! వినురవేమ!



అక్షరాలు కూర్చున్న స్థానం బట్టి అర్థాలు మారుతాయి - వ్యక్తులు సంచరించే ప్రదేశాన్ని బట్టి విలువలు ఉంటాయి.

చాకికోక ఉదికి చీకాకు పడజేసి
మైలదీసి లెస్స మడిచివట్టు
బుద్ధి చెప్పువాడు గ్రుద్దివవేమయా
విశ్వదాభిరామ! వినురవేమ!



ఒరులకొఅకు భూమి నొరపెడివారలు
అవనిపతికి వశ్యులైనవారు
పాలవంటి కులము పన్ను పెట్టివ వారు
విశ్వదాభిరామ! వినురవేమ!



చెమట కారునట్లు శ్రమపెట్టి దేహంబు
గడవ చేసి కూడు గుడువవలయు
తల్లిదండ్రి సొమ్ము తాదింట గారాదు
విశ్వదాభిరామ! వినురవేమ!



భూమి నాది యనిన భూమి ఫక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు
కదన భీతి జూచి కాలుడు నవ్వురా
విశ్వదాభిరామ! వినురవేమ!



అన్ని దానములను అన్నదానమే మిన్న
కన్న తల్లి కంటె ఘనత లేదు
ఎన్న గురువికన్న నెక్కువ లేరయా
విశ్వదాభిరామ! వినురవేమ!



పాలసాగరమున పవ్వళించిన సామి
గొల్లయిండ్ల పాలు కోరనేల?
ఎదుటి వారి సొమ్ములెల్లవారికి తీపి
విశ్వదాభిరామ! వినురవేమ!



కల్లు(దావు వాడు కల్లు (మ్రుచ్చనుగాడు
కల్లలాడు వాడు కల్లు(మ్రుచ్చు
కల్లు (దావుకన్న కల్లలాడుట కీడు
విశ్వదాభిరామ! వినురవేమ!



# నీతి పద్యాలు

ఆరంభించరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై,
ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగించరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

తెలివి యొకింత లేనియెడ తృప్తుడనై కరిభంగి సర్వమున్,
దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి, యిప్పుడు
జ్జులమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాడనై మెలగితిన్, గతమయ్యె నితాంత గర్వమున్.

చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుక లేక యున్ననా;
చదువు నిరర్థకంబు బుధ సత్తము లెవ్వరు మెచ్చరెచ్చటన్
పదునుగ మంచికూరనలపాకము చేసిననైననందు నిం
పొదవెడు నుప్పులేక రుచిపుట్టగ నేర్చు నటయ్య ? భాస్కరా !

పండితులైనవారు దిగువందగ నుండగ, నల్పుడొక్కడు
ద్దండత బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యెగ్గగున్ ?
కొండొక కోతి చెట్టు కొనకొమ్మల నుండగ, గ్రిందగండభే
రుండ మదేభ సింహ నికురుంబము లుండవె చేరి భాస్కరా !

ఘనుడగు నట్టివాడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనిపడి యల్పమానవుని పాదముబట్టుట తప్పుగాదుగా,
యనఘత గృష్ణజన్మమున నావసుదేవుడె మీదుటెత్తుగా
గనుగొని గాలిగాని కడకాళ్ళకు మ్రొక్కడె చేరి ? భాస్కరా !

దేవుడు దేవుండనగా
దేవుండే దీవి నుండి దిగివచ్చేనా ?
యీవిగల దొరయె దేవుడు
కావంగను కుందవరపు కవి చౌడప్పా !

అడుగదగువారి నడుగక
బడుగుల నడుగంగ లేమి బాపంగలరా ?
వడగళ్ళ గట్టుపడునా
గుడి రాళ్ళను గట్టకున్న గువ్వల చెన్నా !

కనకపు సింహాసనమున
శునకము గూర్చుండ బెట్టి. శుభలగ్నమునం
దొనరగ బట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను - వినురా సుమతీ !

వినదగు నెవ్వరు జెప్పిన
వినినంతనె వేగ పడక - వివరింపదగున్,
కనికల్ల నిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు - మహిలో సుమతీ.

ఎప్పుడు సంపద కలిగిన
నప్పుడె బంధువులు వత్తు రది యెట్లన్నన్,
తెప్పలుగ చెరువు నిండిన
కప్పలు పదివేలు చేరు - గదరా సుమతీ !

సిరిదావచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్.
సిరిదా బోయిన బోవును
కరిమ్రింగిన వెలగపండు - గదరా సుమతీ

పొంగని, కుంగని తత్వాన్ని అభివృద్ధి చేసుకో - లొంగని వంగని జీవితాన్ని కుదుర్చుకో.

# రంగ లింగ పద్యాలు

రచన : 'మధురకవి డా॥ బి. అచ్యుతరాజు

శ్రీనివాసయిపుడు కానికాలమువచ్చె
మానమన్నదేమొమంటగలిసె
జ్ఞానబోధకులుగ హీనులు వెలసిరి
రంగరంగ మారభంగ లింగ.

రంగడన్నొకటె లింగడన్న నొకటె
అంతరంగమొకటె అందరికి - గ
రం గరంగ పద్య గంగ పారించెదు .... రంగ॥

అట వెలది బట్టి ఆడించె వేమన
నాడు; నేడు జాడనార్లవారు
అటులెనేనుగూడ 'అచ్యుతరాజు'ను రంగ॥

నాకు ముందునున్న నవకవి యువకవి
గణపతులకు ముందు ప్రణుతిజేసి
రంగ మందు పద్యరంగము పరచెద రంగ॥

సుమతి వేమ చౌడ సురుచిరసూక్తులు
జనులనాల్కలందుసంచలింప
చెప్పిరటులనేను జెప్పప్రయత్నింతు రంగ॥

అనుభవించి పలుకు అక్షరాక్షరమును
నీతితోడనిజమునిగ్గుదేరు
గుండెమీద చాచి గుద్దిన చందాన రంగ॥

**ఇష్టంగాని పనిని కష్టంగా చేసేవాడు మనిషి - కష్టమైన పనిని ఇష్టంగా మార్చుకునేవాడు మనీషి.**

కవితనువినగానె కలతలు తొలగాలె
తిట్టువలన మనసు తేలికపడు
తిట్టు కవితలో నె స్థిరనీతియుండును రంగ॥

అచ్చిరానిచోటు అరబిగమెందుకు?
అచ్చివచ్చుచోటు అడుగుచాలు
గంగ, గోవుపాలు గంటెడు చాలవా? రంగ॥

ఊరుపందికూడ ఉత్తరానతలాపి
పెట్టబోదటంద్రుపృథ్విలోన
మానవులము మనము మరచిపోవదగునె ? రంగ॥

ఇల్లుకన్నమించియిలను స్వర్గము లేదు
తల్లికన్నమించి దైవమెద్ది?
భార్య కన్నమించి బాధ్యులెవ్వారయా ! రంగ॥

ఔషధగుణమింతహస్తగుణమ్మంత
నమ్మకమ్మకొంతనయమొనర్చు
అమృతమైన విషమెయౌను నమ్మికలేక రంగ॥

ఆయనంతవాడు అగుటకు హేతువు
అయ్యగారె యమట కియ్య కొనను
ఏకలవ్యులెందరెందరో త్యాగ్యాణ రంగ॥

తాముకాలుచుండి తనచుట్టు ప్రక్కల
వెలుగునింపు దీపకళికవోలె
బ్రతుకునట్టివారి భాగ్యమే భాగ్యము రంగ॥

చెత్త రెండు రకాలు - ఒకటి చెత్త కుండీలో ఉంటుంది, మరి ఒకటి కొందరి మనసులో దాగుంటుంది.

రోజుకింత మరియు రోజురోజు కింత
కరుగుచుండి గూడ గంధమలదు
సబ్బువంటి వారిజన్మమే జన్మము రంగ॥

నేను నేనటంచు జ్ఞాను లాడనౌనె?
నేను నష్టపోవనిండు వెలుగు
విత్తుమట్టిగలిసి వృక్షమ్మయినతీరు
రంగ రంగ మారభంగ లింగ . . .

# దశపుత్ర సమం వృక్షం



పది బావులు - ఒక చెరువుతో సమానం
పది చెరువులు - ఒక సరస్సుతో సమానం
పది సరస్సులు - ఒక పుత్రునితో సమానం
పదిమంది పుత్రులు - ఒక చెట్టుతో సమానం

మత్స్య పురాణం

## పదిరకాల ప్రయోజనాలు

1. ప్రాణవాయువు
2. నీరు (వర్షం)
3. భూసార పరిరక్షణ
4. ఆహారం (పళ్ళు తేనె)
5. వస్త్రం (గుజ్జు)
6. మందులు
7. పశుగ్రాసం
8. నీడ
9. కలప
10. వంట చెఱుకు

దేశంలో కనిపించే మురికి తక్కువ - కనిపించని కులమతాల మురికే ఎక్కువ.

ఫలపుష్పభరితమైన వృక్షములు నరికినవాడు నీచాతిచీనమైన జన్మకు పోవును. 36 వ అధ్యాయము గరుడ పురాణము

# ఏ దేశ మేగినా ?

ఏదేశ మేగినా ఎందు కాలిడినా
ఏ పీఠ మెక్కినా, ఎవ్వరేమనినా
పొగడరా ! నీ తల్లి భూమి భారతిని
నిలుపరా! నీ జాతి నిండు గౌరవము.

ఏ పూర్వ పుణ్యమో, ఏ యోగబలమో
జనియించినాడ వీ స్వర్గఖండమున,
ఏ మంచి పూవులన్ ప్రేమించినావో?
నినుమోసె నీతల్లి కనక గర్భమున.

లేదురా! ఇటువంటి భూదేవి యెందు,
లేరురా! మనవంటి పౌరులింకెందు,
సూర్యుని వెలుతురుల్ సోకునందాక !
ఓడల జెండాలు ఆడునందాక!

అందాకగల ఈ అనంత భూస్థలిని
మన భూమి వంటి చల్లని తల్లి లేదు
పాడరా! నీ తెల్గు బాలగీతములు
పాడరా! నీ వీర భావి భారతము.

**సిగరెట్ వెలిగించుకోవడానికి నిప్పు ఎక్కడైనా పుడుతుంది - జీవితాన్ని వెలిగించుకోవడానికి దీపం తమ శ్రమలోంచే పుడుతుంది.**

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ,
శౌర్యహారము రాజచంద్రులర్పింప,
భావ సూత్రము కవి ప్రభువు లల్లంగ,
రాగ దుగ్ధము భక్తరత్నముల్ పిదుక,

దిక్కుల కెగదన్ను తేజమ్ము వెలుగ,
రాళ్ళ తేనియలూరు రాగాలు సాగ,
జగముల నూగించు మగతనం బెగయ,
సౌందర్యమెగబోయు సాహిత్యమలర,

వెలిగినదీ దివ్యవిశ్వంబు పుత్ర!
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర!
పొలముల రత్నాలు మొలచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట!

పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు !
అవమానమేలరా ? అనుమానమేల?
భారతీయుడనంచు భక్తితో పాడ !

- రాయప్రోలు సుబ్బారావు.

కాళ్ళున్న ప్రతివాడూ పరుగెత్తగలడు - చేతులున్న ప్రతి వాడు వ్రాయలేడు.

# నీతి శాస్త్రము (సంస్కృతం)

శ్లో॥ సత్యం మాతాపితాజ్ఞానం
ధర్మోభ్రాతాదయాసఖా
శాంతి: పత్నీ క్షమాపుత్ర:
షడేతేమమబాంధవా:

శ్లో॥ ప్రాణంవాపిపరిత్యజ్య
మానమేవాభిరక్షతు
అనిత్యోభవతి ప్రాణో
మానమాచంద్రతారకం.

శ్లో॥ అనిత్యానిశరీరాని
విభవోనైవశాశ్వత:
నిత్యం సన్నిహితోమృత్యు:
కర్తవ్యోధర్మ సంగ్రహ:

శ్లో॥ భూప్రదక్షిణషట్కేన
కాశీయాత్రాయుతేనచ
సేతుస్నానశతైర్యచ్చ
తత్ఫలం మాతృ వందనే

శ్లో॥ సబంధుర్యోహితేషుస్యాత్
సపితా యస్తుపోషక:
ససఖాయత్ర విశ్వాస:
సాభార్యాయత్రనిర్వృతి:

శ్లో॥ ఏకో పిగుణవాన్పుత్రో
నిర్గణేనశతైరపి
ఏక చంద్రప్రకాశేన
నక్షత్రై: కింప్రయోజనం

నిన్ను చూసి ఇతరులు జాలి పడ్తున్నారంటే నీవు ఎదగలేదని - నిన్ను చూసి అసూయపడుతున్నారంటే నీవు ఎదిగావని.

# నీతి శాస్త్రము (తెలుగు)

ఆ.వె. సత్యమగును తల్లి సద్జ్ఞానమగుతండ్రి
ధర్మమగునుభ్రాత దయసఖుండు
శాంతి భార్యయౌను క్షమపుత్రుడగును;నా
కార్గురాత్మబంధులగు దురిలను.

ఆ.వె. ప్రాణమైనవిడిచిమానముకాపాడు
కొవగవలయు, నదియవినుముస్థిరము
సూర్యచంద్రులున్ను చుక్కలుండే దాక
ప్రాణమస్థిరమ్ము పలువిధాల.

ఆ.వె. దేహమెపుడు భువిని స్థిరముగానుండదు
సంపదలును గావు శాశ్వతములు
నిత్యనిత్యమెపుడుమృత్యువు వెంటాడు
ధర్మసంగ్రహమ్మెతలమదాల్తు

ఆ.మె. భూప్రదక్షిణమ్ము పూనియార్తడవల
సంద్రములనువందసార్లమునుగు
పదియువేల మార్లబరగుకాశీయాత్ర
ఫలము తల్లి కొక్కవందనమ్ము

ఆ.వె. బుద్ధిమంతుడైనపుత్రుడొకడుచాలు
బుద్ధి లేని వారు వద్దునూర్గు
రొక్కచందమామ దిక్కులువెలిగించు
చుక్కలెన్నియున్న లెక్క లేదు.

కృషి చేసినట్లు వినేది అదృష్టం - సోమరితనం చెప్పుచేతుల్లో ఉండేది దురదృష్టం.

# నీతి శాస్త్రము (సంస్కృతం)

శ్లో॥ రాజవత్పంచవర్షాణి
దశవర్షాణిదాసవత్
ప్రాప్తేతు షోడశేవర్షే
పుత్రం మిత్రవదాచరేత్.

శ్లో॥ పుస్తకేషు చయావిద్యా
పరహస్తేచయద్ధనం
సమయేవపరిప్రాప్తే
వసావిద్యావతద్ధనం.

శ్లో॥ ఋణానుబంధరూపేణ
పశుఃపత్నీ సుతా లయాః
ఋణక్షయే క్ష యంయాంతి
కాతత్రపరివేదనా ?

శ్లో॥ మూత్రోచ్చారసముత్సర్గం
దివాకుర్యాదుదఙ్ముఖః
దక్షిణాభిముఖోరాత్రౌ
సంధ్యయోశ్చయథాదివా.

శ్లో॥ సత్యంబ్రూయాత్ ప్రియ బ్రూయాత్
నబ్రూయాత్ సత్యమ ప్రియం
ప్రియంచనానృతంబ్రూయాత్
ఏషధర్మస్సనాతనః

గొప్ప కుటుంబంలో నీవు పుట్టడం గొప్పే అవుతుంది - నీ గొప్ప తనానికి అదే కారణమైతే తప్పవుతుంది.

# నీతి శాస్త్రము (తెలుగు)

ఆ.వె. ప్రభువువోలె పంచవర్షాలవరకును
దాసువోలె చూడు దశవసంత
ములు, పదారు యేండ్లపుత్రుడైనంతనె
మిత్రువోలె చూడమేలు గల్గు

ఆ.వె. గ్రంథమంధువిద్య గలిగినచాలునె?
ధనముపరులవద్దదాచదగునె?
అవసరానికెపుడు ఆదుకోజాలవు,
నాల్క చేతులందు వలగకున్న.

ఆ.వె. ఋణముగల్గు వరకు గుణవతి భార్యయు
సుతులు, పసులు, యిల్లు చుట్టములును
ఋణముతీరినంతక్షణమైనవిలువరు
ఇంతమాత్రమునకె యేడ్వనేల?

ఆ.వె. ఉత్తరముఖలయ్యు ఉదయసాయంసంధ్య
లందు, పగలురాత్రులందు దక్షి
ణము - ముఖమ్ముగల్గితమిదీరమలమూత్ర
ములను - విడువలయునిలను యెపుడు.

ఆ.వె. నిజము చెప్పవలయు - నిష్ఠురసత్యము
ప్రియముగూర్చదేని విడువవలయు;
అనృతమాడరాదు అప్రియమైన - వ
పాతనమ్ము ధర్మ న్యాయమెరిగి.

(అట వెలది పద్యాలలో)

అనువాదకులు : "మధురకవి" డా॥ బి అచ్యుతరాజు, హైదరాబాదు.

చెడ్డ వాని చేత పొగిడించుకోవడం కన్నా - బుద్ధిమంతునిచేత తిట్టించుకోవడం మిన్న.

# తెలుగు సంవత్సరములు

| | | | |
|---|---|---|---|
| 1. ప్రభవ | 16. చిత్రభాను | 31. హేవిళంబి | 46. పరీధావి |
| 2. విభవ | 17. స్వభాను | 32. విళంబి | 47. ప్రమాదీచ |
| 3. శుక్ల | 18. తారణ | 33. వికారి | 48. ఆనంద |
| 4. ప్రమోదూత | 19. పార్థివ | 34. శార్వరి | 49. రాక్షస |
| 5. ప్రజోత్పత్తి | 20. వ్యయ | 35. ప్లవ | 50. నల |
| 6. అంగీరస | 21. సర్వజిత్తు | 36. శుభకృత్తు | 51. పింగళ |
| 7. శ్రీముఖ | 22. సర్వధారి | 37. శోభకృత్తు | 52. కాలయుక్తి |
| 8. భవ | 23. విరోధి | 38. క్రోధి | 53. సిద్ధార్థి |
| 9. యువ | 24. వికృతి | 39. విశ్వావసు | 54. రౌద్రి |
| 10. ధాత | 25. ఖర | 40. పరాభవ | 55. దుర్మతి |
| 11. ఈశ్వర | 26. నందన | 41. ప్లవంగ | 56. దుందుభి |
| 12. బహుధాన్య | 27. విజయ | 42. కీలక | 57. రుధిరోద్గారి |
| 13. ప్రమాధి | 28. జయ | 43. సౌమ్య | 58. రక్తాక్షి |
| 14. విక్రమ | 29. మన్మథ | 44. సాధారణ | 59. క్రోధన |
| 15. విషు | 30. దుర్ముఖి | 45. విరోధికృతు | 60. అక్షయ |

# వారములు

| వారములు | పర్యాయనామములు |
|---|---|
| ఆదివారం | భానువారం |
| సోమవారం | ఇందు వారం |
| మంగళవారం | భౌమ వారం |
| బుధవారం | సౌమ్య వారం |
| గురువారం | బృహస్పతి వారం |
| శుక్రవారం | భృగు వారం |
| శనివారం | మంద వారం |

# తిథులు

| | |
|---|---|
| 1. పాడ్యమి (శుద్ధ/బహుళ) | 9. నవమి (శుద్ధ/బహుళ) |
| 2. విదియ (శుద్ధ/బహుళ) | 10. దశమి (శుద్ధ/బహుళ) |
| 3. తదియ (శుద్ధ/బహుళ) | 11. ఏకాదశి (శుద్ధ/బహుళ) |
| 4. చవితి (శుద్ధ/బహుళ) | 12. ద్వాదశి (శుద్ధ/బహుళ) |
| 5. పంచమి (శుద్ధ/బహుళ) | 13. త్రయోదశి (శుద్ధ/బహుళ) |
| 6. షష్ఠి (శుద్ధ/బహుళ) | 14. చతుర్దశి (శుద్ధ/బహుళ) |
| 7. సప్తమి (శుద్ధ/బహుళ) | 15. శుద్ధ పున్నమి |
| 8. అష్టమి (శుద్ధ/బహుళ) | 15. బహుళ అమావాస్య. |

## తెలుగు నెలలు

| | | | |
|---|---|---|---|
| ౧ | చైత్రం | ౭ | ఆశ్వయుజం |
| ౨ | వైశాఖం | ౮ | కార్తీకం |
| ౩ | జ్యేష్ఠం | ౯ | మార్గశిరం |
| ౪ | ఆషాఢం | ౧౦ | పుష్యం |
| ౫ | శ్రావణం | ౧౧ | మాఘం |
| ౬ | భాద్రపదం | ౧౨ | ఫాల్గుణం |

తల్లి దండ్రులను గౌరవించనివాడు - తన పిల్లల నుండి గౌరవాన్ని పొందలేడు.

## ఇంగ్లీషు నెలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | జనవరి | 31 రోజులు | 7 | జూలై | 31 రోజులు |
| 2 | ఫిబ్రవరి | 28, 29 రోజులు | 8 | ఆగష్టు | 31 రోజులు |
| 3 | మార్చి | 31 రోజులు | 9 | సెప్టెంబర్ | 30 రోజులు |
| 4 | ఏప్రిల్ | 30 రోజులు | 10 | అక్టోబర్ | 31 రోజులు |
| 5 | మే | 31 రోజులు | 11 | నవంబర్ | 90 రోజులు |
| 6 | జూన్ | 30 రోజులు | 12 | డిసెంబర్ | 31 రోజులు |

| హిజ్రీ నెలలు | ఫసిలీ నెలలు | హిందీ నెలలు |
|---|---|---|
| మొహర్రం | ఆజూర్ | చైత్ |
| సఫర్ | దై | బైశాఖ్ |
| రబ్బీలవ్వల్ | బహమన్ | జ్యేష్ఠ్ |
| రబ్బీయుస్సాని | ఇస్పందార్ | ఆషాఢ్ |
| జమాదిలవ్వల్ | ఫర్వర్ది | శ్రావణ్ |
| జమాదియుస్సానీ | అర్దిబెహెష్త్ | భాదోపద్ |
| రజబ్ | ఖుర్దాద్ | ఆశ్విన్ |
| షాబాన్ | తీర్ | కార్తిక్ |
| రంజాన్ | అమర్దాద్ | షాగున్ |
| షవ్వాల్ | షహరేవర్ | పుష్ |
| జీఖాద్ | మెహర్ | మాఘ్ |
| జిలహజ్ | ఆబాన్ | ఫాగున్ |

ఆలోచనలు నీలో వున్నప్పుడే నీవి - బయట పడితే అవి ఇతరులవి.

# అంకెల పుట్టుక

ఈ ప్రపంచంలో ప్రతి పనికీ, ప్రతి వ్యక్తికీ అంకెల అవసరం ఎంతగానో వుంది. నూటికి తొంబై పనులు అంకెల ద్వారానే పూర్తవుతున్నాయి. కాబట్టే "నూతనంగా అన్వేషించే విజ్ఞానం ఏదైనా గణిత రూపంలో వుంటుంది." అన్నాడు డార్విన్.

ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా వున్న అంకెలను " ఇండో అరబిక్ " అంకెలంటారు. ఎందుకనగా 0 నుండి 9 వరకు అంకెలు మన భారతదేశంలో పుట్టి విదేశాలకు వలస వెళ్ళాయి కాబట్టి. మనకు తెలుసు 0 నుండి 9 వరకు గల అంకెలతో ఎంత పెద్ద సంఖ్యలనైనా చేయవచ్చునని అయితే అందులో అత్యంత విలువ గలిగిన సున్నాను కనుగొన్నది మన భారతీయుడైన గొప్ప శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టు.

ఈ 1 నుండి 9 వరకు గల రోమన్ అంకెలు ఎలా పుట్టాయని ఆలోచిస్తే అవి కోణాల ఆధారంగా పుట్టినట్లు వెల్లడవుతుంది. అంటే ఒక రూపానికి ఎన్ని కోణాలు వస్తే అది అంత విలువ గల అంకెగా రూపొందించ బడింది. ఆ విధంగా చూసినప్పుడు అంకెలలోనే ఆ అంకె విలువగల కోణాలు ఉంటాయి. పరిశీలించండి.



## తెలుగు అంకెలు

౧ ౨ ౩ ౪ ౫ ౬

౭ ౮ ౯ ౧౦

## హిందీ అంకెలు

१ २ ३ ४ ५ ६

७ ८ ९ १०

## ఇంగ్లీషు అంకెలు

1 2 3 4 5 6

7 8 9 10

## కన్నడ అంకెలు

೧ ೨ ೩ ೪ ೫ ೬

೭ ೮ ೯ ೧೦

కీర్తివంతుడు ప్రతిభావంతుడు కాకపోవచ్చు - ప్రతిభావంతుడు మాత్రం కీర్తివంతుడు కావచ్చు.

## కూడికలు

ఏవైనా కొన్ని అంకెలను కలివి, అనగా కూడి చెప్పు దానిని కూడిక అందురు.

దీని గుర్తు + (ప్లస్) దీనినే కూడిక అని కూడా అంటారు

1 + 1 = 2

ఆ విధంగానే

4 + 1 = 5 6 + 3 = 9 3 + 3 = 6 9 + 1 = 10

4 మామిడి పండ్లు + 5 మామిడి పండ్లు కలిపి ఎన్ని ?

= 9

ఉదాహరణ లెక్కలు

| 9 | 6 | 5 | 4 |
|---|---|---|---|
| 6 | 3 | 9 | 9 |
| 3 | 4 | 3 | 7 |
| 18 | 13 | 17 | 20 |

### తీసివేత

**దీని గుర్తు - (మైనస్)** దీనినే తీసివేత అని కూడా అంటారు.

ఒక చెట్టుకుపూసిన నాలుగు పువ్వులలో రెండు పువ్వులు కోసుకుంటే ఎన్ని పువ్వులు ఉంటాయి.

= 2

4 - 2 = 2

ఎదగాలనుకొనే జీవి గొప్పవారితో పోల్చుకుంటాడు - చేతగాని సోమరి తక్కువ వారితో సరిచూసుకుంటాడు.

9 బంతులలో 3 బంతులు మిత్రునకు ఇచ్చినట్లైతే ఎన్ని బంతులు ఉంటాయి ?

= 6

9 - 3 = 6

ఉదాహరణ లెక్కలు

| 9 | 8 | 7 | 6 |
|---|---|---|---|
| 2 | 3 | 4 | 5 |
| **7** | **5** | **3** | **1** |

**గుణకారము**

దీనిగుర్తు × (ఇంటు)

దీనినే హెచ్చవేత అని కూడా అంటారు.

X X X = 16

ఎన్ని రెళ్ళు కొవ్వొత్తులు కలవు ? మొత్తము కొవ్వొత్తులు ఎన్ని ?

కొవ్వొత్తుల రెళ్ళు = 4

జతకు కొవ్వొ త్తులు = 2

అనగా

$2 \times 2 \times 2 \times 2 = 16$

X =

$4 \times 2 = 8$



ఇందులో ఎన్ని పుస్తకములు ఉన్నవి ? **6** ఉన్నవి
ఎన్ని మూళ్లు ఉన్నవి ? **2** ఉన్నవి

ఒక జతలో ఎన్ని పుస్తకములు ఉన్నవి ? **6** ఉన్నవి
మూడు పుస్తకములు.
అనగా 3 × 3 = 9

**ఉదాహరణ లెక్కలు :**

| | | | |
|---|---|---|---|
| 6 × 3 = | 18 | 2 × 4 = | 8 |
| 7 × 2 = | 14 | 5 × 2 = | 10 |
| 4 × 3 = | 12 | 4 × 4 = | 16 |

## భాగహారము

దీనిగుర్తు ÷ (డివైడెడ్‌బై)

దీనినే భాగహారము అని కూడా అంటారు.

పది పెన్సిళ్ళను ఐదుగురుకి పంచితే ఒక్కరికి ఎన్ని పెన్సిల్లు వస్తాయి.



10 పెన్సిళ్ళలో ఒకరికి రెండు ఇచ్చిన
8 మిగులును. తిరిగి ఒకరికి 2 ఇచ్చిన
6 మిగులును. తిరిగి ఒకరికి 2 ఇచ్చిన
4 మిగులును. తిరిగి ఒకరికి 2 ఇచ్చిన

2 మిగులును. తిరిగి ఒకరికి 2 ఇచ్చిన పెన్సిల్లు అన్నీ సమంగా పంచబడును. అనగా $10 \div 5 = 2$
ఆ విధంగా ఒక్కొక్కరికి రెండు చొప్పున 5గురికి 10 పెన్సిల్లు పంచవచ్చును.

**ఉదాహరణ లెక్కలు :**

1)9 ÷ 3 =    2) 6 ÷ 3 =    3) 8 ÷ 2 =    3) 12 ÷ 4 =

## గుణకారం ఎక్కములు

| | | | |
|---|---|---|---|
| 1 x 1 = 1 | 2 x 1 = 2 | 3 x 1 = 3 | 4 x 1 = 4 |
| 1 x 2 = 2 | 2 x 2 = 4 | 3 x 2 = 6 | 4 x 2 = 8 |
| 1 x 3 = 3 | 2 x 3 = 6 | 3 x 3 = 9 | 4 x 3 = 12 |
| 1 x 4 = 4 | 2 x 4 = 8 | 3 x 4 = 12 | 4 x 4 = 16 |
| 1 x 5 = 5 | 2 x 5 = 10 | 3 x 5 = 15 | 4 x 5 = 20 |
| 1 x 6 = 6 | 2 x 6 = 12 | 3 x 6 = 18 | 4 x 6 = 24 |
| 1 x 7 = 7 | 2 x 7 = 14 | 3 x 7 = 21 | 4 x 7 = 28 |
| 1 x 8 = 8 | 2 x 8 = 16 | 3 x 8 = 24 | 4 x 8 = 32 |
| 1 x 9 = 9 | 2 x 9 = 18 | 3 x 9 = 27 | 4 x 9 = 36 |
| 1 x 10 = 10 | 2 x 10 = 20 | 3 x 10 = 30 | 4 x 10 = 40 |
| 1 x 11 = 11 | 2 x 11 = 22 | 3 x 11 = 33 | 4 x 11 = 44 |
| 1 x 12 = 12 | 2 x 12 = 24 | 3 x 12 = 36 | 4 x 12 = 48 |
| 1 x 13 = 13 | 2 x 13 = 26 | 3 x 13 = 39 | 4 x 13 = 52 |
| 1 x 14 = 14 | 2 x 14 = 28 | 3 x 14 = 42 | 4 x 14 = 56 |
| 1 x 15 = 15 | 2 x 15 = 30 | 3 x 15 = 45 | 4 x 15 = 60 |
| 1 x 16 = 16 | 2 x 16 = 32 | 3 x 16 = 48 | 4 x 16 = 64 |
| 1 x 17 = 17 | 2 x 17 = 34 | 3 x 17 = 51 | 4 x 17 = 68 |
| 1 x 18 = 18 | 2 x 18 = 36 | 3 x 18 = 54 | 4 x 18 = 72 |
| 1 x 19 = 19 | 2 x 19 = 38 | 3 x 19 = 57 | 4 x 19 = 76 |
| 1 x 20 = 20 | 2 x 20 = 40 | 3 x 20 = 60 | 4 x 20 = 80 |

| | | | | |
|---|---|---|---|---|
| 5 | x | 1 | = | 5 |
| 5 | x | 2 | = | 10 |
| 5 | x | 3 | = | 15 |
| 5 | x | 4 | = | 20 |
| 5 | x | 5 | = | 25 |
| 5 | x | 6 | = | 30 |
| 5 | x | 7 | = | 35 |
| 5 | x | 8 | = | 40 |
| 5 | x | 9 | = | 45 |
| 5 | x | 10 | = | 50 |
| 5 | x | 11 | = | 55 |
| 5 | x | 12 | = | 60 |
| 5 | x | 13 | = | 65 |
| 5 | x | 14 | = | 70 |
| 5 | x | 15 | = | 75 |
| 5 | x | 16 | = | 80 |
| 5 | x | 17 | = | 85 |
| 5 | x | 18 | = | 90 |
| 5 | x | 19 | = | 95 |
| 5 | x | 20 | = | 100 |

| | | | | |
|---|---|---|---|---|
| 6 | x | 1 | = | 6 |
| 6 | x | 2 | = | 12 |
| 6 | x | 3 | = | 18 |
| 6 | x | 4 | = | 24 |
| 6 | x | 5 | = | 30 |
| 6 | x | 6 | = | 36 |
| 6 | x | 7 | = | 42 |
| 6 | x | 8 | = | 48 |
| 6 | x | 9 | = | 54 |
| 6 | x | 10 | = | 60 |
| 6 | x | 11 | = | 66 |
| 6 | x | 12 | = | 72 |
| 6 | x | 13 | = | 78 |
| 6 | x | 14 | = | 84 |
| 6 | x | 15 | = | 90 |
| 6 | x | 16 | = | 96 |
| 6 | x | 17 | = | 102 |
| 6 | x | 18 | = | 108 |
| 6 | x | 19 | = | 114 |
| 6 | x | 20 | = | 120 |

| | | | | |
|---|---|---|---|---|
| 7 | x | 1 | = | 7 |
| 7 | x | 2 | = | 14 |
| 7 | x | 3 | = | 21 |
| 7 | x | 4 | = | 28 |
| 7 | x | 5 | = | 35 |
| 7 | x | 6 | = | 42 |
| 7 | x | 7 | = | 49 |
| 7 | x | 8 | = | 56 |
| 7 | x | 9 | = | 63 |
| 7 | x | 10 | = | 70 |
| 7 | x | 11 | = | 77 |
| 7 | x | 12 | = | 84 |
| 7 | x | 13 | = | 91 |
| 7 | x | 14 | = | 98 |
| 7 | x | 15 | = | 105 |
| 7 | x | 16 | = | 112 |
| 7 | x | 17 | = | 119 |
| 7 | x | 18 | = | 126 |
| 7 | x | 19 | = | 133 |
| 7 | x | 20 | = | 140 |

| | | | | |
|---|---|---|---|---|
| 8 | x | 1 | = | 8 |
| 8 | x | 2 | = | 16 |
| 8 | x | 3 | = | 24 |
| 8 | x | 4 | = | 32 |
| 8 | x | 5 | = | 40 |
| 8 | x | 6 | = | 48 |
| 8 | x | 7 | = | 56 |
| 8 | x | 8 | = | 64 |
| 8 | x | 9 | = | 72 |
| 8 | x | 10 | = | 80 |
| 8 | x | 11 | = | 88 |
| 8 | x | 12 | = | 96 |
| 8 | x | 13 | = | 104 |
| 8 | x | 14 | = | 112 |
| 8 | x | 15 | = | 120 |
| 8 | x | 16 | = | 128 |
| 8 | x | 17 | = | 136 |
| 8 | x | 18 | = | 144 |
| 8 | x | 19 | = | 152 |
| 8 | x | 20 | = | 160 |

| | | | | |
|---|---|---|---|---|
| 9 | x | 1 | = | 9 |
| 9 | x | 2 | = | 18 |
| 9 | x | 3 | = | 27 |
| 9 | x | 4 | = | 36 |
| 9 | x | 5 | = | 45 |
| 9 | x | 6 | = | 54 |
| 9 | x | 7 | = | 63 |
| 9 | x | 8 | = | 72 |
| 9 | x | 9 | = | 81 |
| 9 | x | 10 | = | 90 |
| 9 | x | 11 | = | 99 |
| 9 | x | 12 | = | 108 |
| 9 | x | 13 | = | 117 |
| 9 | x | 14 | = | 126 |
| 9 | x | 15 | = | 135 |
| 9 | x | 16 | = | 144 |
| 9 | x | 17 | = | 153 |
| 9 | x | 18 | = | 162 |
| 9 | x | 19 | = | 171 |
| 9 | x | 20 | = | 180 |

| | | | | |
|---|---|---|---|---|
| 10 | x | 1 | = | 10 |
| 10 | x | 2 | = | 20 |
| 10 | x | 3 | = | 30 |
| 10 | x | 4 | = | 40 |
| 10 | x | 5 | = | 50 |
| 10 | x | 6 | = | 60 |
| 10 | x | 7 | = | 70 |
| 10 | x | 8 | = | 80 |
| 10 | x | 9 | = | 90 |
| 10 | x | 10 | = | 100 |
| 10 | x | 11 | = | 110 |
| 10 | x | 12 | = | 120 |
| 10 | x | 13 | = | 130 |
| 10 | x | 14 | = | 140 |
| 10 | x | 15 | = | 150 |
| 10 | x | 16 | = | 160 |
| 10 | x | 17 | = | 170 |
| 10 | x | 18 | = | 180 |
| 10 | x | 19 | = | 190 |
| 10 | x | 20 | = | 200 |

నీ పొరపాట్లు నిన్ను ఎప్పుడూ వెంటాడుతుంటాయి -నీ మంచిపనులు నిన్ను ఎల్లవేళలా రక్షిస్తుంటాయి.

| | | |
|---|---|---|
| 11 x 1 = 11 | 12 x 1 = 12 | 13 x 1 = 13 |
| 11 x 2 = 22 | 12 x 2 = 24 | 13 x 2 = 26 |
| 11 x 3 = 33 | 12 x 3 = 36 | 13 x 3 = 39 |
| 11 x 4 = 44 | 12 x 4 = 48 | 13 x 4 = 52 |
| 11 x 5 = 55 | 12 x 5 = 60 | 13 x 5 = 65 |
| 11 x 6 = 66 | 12 x 6 = 72 | 13 x 6 = 78 |
| 11 x 7 = 77 | 12 x 7 = 84 | 13 x 7 = 91 |
| 11 x 8 = 88 | 12 x 8 = 96 | 13 x 8 = 104 |
| 11 x 9 = 99 | 12 x 9 = 108 | 13 x 9 = 117 |
| 11 x 10 = 110 | 12 x 10 = 120 | 13 x 10 = 130 |
| 11 x 11 = 121 | 12 x 11 = 132 | 13 x 11 = 143 |
| 11 x 12 = 132 | 12 x 12 = 144 | 13 x 12 = 156 |
| 11 x 13 = 143 | 12 x 13 = 156 | 13 x 13 = 169 |
| 11 x 14 = 154 | 12 x 14 = 168 | 13 x 14 = 182 |
| 11 x 15 = 165 | 12 x 15 = 180 | 13 x 15 = 195 |
| 11 x 16 = 176 | 12 x 16 = 192 | 13 x 16 = 208 |
| 11 x 17 = 187 | 12 x 17 = 204 | 13 x 17 = 221 |
| 11 x 18 = 198 | 12 x 18 = 216 | 13 x 18 = 234 |
| 11 x 19 = 209 | 12 x 19 = 228 | 13 x 19 = 247 |
| 11 x 20 = 220 | 12 x 20 = 240 | 13 x 20 = 260 |

| | | |
|---|---|---|
| 14 x 1 = 14 | 15 x 1 = 15 | 16 x 1 = 16 |
| 14 x 2 = 28 | 15 x 2 = 30 | 16 x 2 = 32 |
| 14 x 3 = 42 | 15 x 3 = 45 | 16 x 3 = 48 |
| 14 x 4 = 56 | 15 x 4 = 60 | 16 x 4 = 64 |
| 14 x 5 = 70 | 15 x 5 = 75 | 16 x 5 = 80 |
| 14 x 6 = 84 | 15 x 6 = 90 | 16 x 6 = 96 |
| 14 x 7 = 98 | 15 x 7 = 105 | 16 x 7 = 112 |
| 14 x 8 = 112 | 15 x 8 = 120 | 16 x 8 = 128 |
| 14 x 9 = 126 | 15 x 9 = 135 | 16 x 9 = 144 |
| 14 x 10 = 140 | 15 x 10 = 150 | 16 x 10 = 160 |
| 14 x 11 = 154 | 15 x 11 = 165 | 16 x 11 = 176 |
| 14 x 12 = 168 | 15 x 12 = 180 | 16 x 12 = 192 |
| 14 x 13 = 182 | 15 x 13 = 195 | 16 x 13 = 208 |
| 14 x 14 = 196 | 15 x 14 = 210 | 16 x 14 = 224 |
| 14 x 15 = 210 | 15 x 15 = 225 | 16 x 15 = 240 |
| 14 x 16 = 224 | 15 x 16 = 240 | 16 x 16 = 256 |
| 14 x 17 = 238 | 15 x 17 = 255 | 16 x 17 = 272 |
| 14 x 18 = 252 | 15 x 18 = 270 | 16 x 18 = 288 |
| 14 x 19 = 266 | 15 x 19 = 285 | 16 x 19 = 304 |
| 14 = 20 = 280 | 15 x 20 = 300 | 16 x 20 = 320 |

**వినయం కలవాడు ఎప్పటికప్పుడూ సాధిస్తుంటాడు - గర్వం కలవాడు ఒక్కొక్కటి కోల్పోతుంటాడు.**

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 17 x | 1 | = | 17 | 18 x | 1 | = | 18 | 19 x | 1 | = | 19 |
| 17 x | 2 | = | 34 | 18 x | 2 | = | 36 | 19 x | 2 | = | 38 |
| 17 x | 3 | = | 51 | 18 x | 3 | = | 54 | 19 x | 3 | = | 57 |
| 17 x | 4 | = | 68 | 18 x | 4 | = | 72 | 19 x | 4 | = | 76 |
| 17 x | 5 | = | 85 | 18 x | 5 | = | 90 | 19 x | 5 | = | 95 |
| 17 x | 6 | = | 102 | 18 x | 6 | = | 108 | 19 x | 6 | = | 114 |
| 17 x | 7 | = | 119 | 18 x | 7 | = | 126 | 19 x | 7 | = | 133 |
| 17 x | 8 | = | 136 | 18 x | 8 | = | 144 | 19 x | 8 | = | 152 |
| 17 x | 9 | = | 153 | 18 x | 9 | = | 162 | 19 x | 9 | = | 171 |
| 17 x | 10 | = | 170 | 18 x | 10 | = | 180 | 19 x | 10 | = | 190 |
| 17 x | 11 | = | 187 | 18 x | 11 | = | 198 | 19 x | 11 | = | 209 |
| 17 x | 12 | = | 204 | 18 x | 12 | = | 216 | 19 x | 12 | = | 228 |
| 17 x | 13 | = | 221 | 18 x | 13 | = | 234 | 19 x | 13 | = | 247 |
| 17 x | 14 | = | 238 | 18 x | 14 | = | 252 | 19 x | 14 | = | 266 |
| 17 x | 15 | = | 255 | 18 x | 15 | = | 270 | 19 x | 15 | = | 285 |
| 17 x | 16 | = | 272 | 18 x | 16 | = | 288 | 19 x | 16 | = | 304 |
| 17 x | 17 | = | 289 | 18 x | 17 | = | 306 | 19 x | 17 | = | 323 |
| 17 x | 18 | = | 306 | 18 x | 18 | = | 324 | 19 x | 18 | = | 342 |
| 17 x | 19 | = | 323 | 18 x | 19 | = | 342 | 19 x | 19 | = | 361 |
| 17 x | 20 | = | 340 | 18 x | 20 | = | 360 | 19 x | 20 | = | 380 |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 20 x | 1 | = | 20 | 30 x | 1 | = | 30 | 40 x | 1 | = | 40 |
| 20 x | 2 | = | 40 | 30 x | 2 | = | 60 | 40 x | 2 | = | 80 |
| 20 x | 3 | = | 60 | 30 x | 3 | = | 90 | 40 x | 3 | = | 120 |
| 20 x | 4 | = | 80 | 30 x | 4 | = | 120 | 40 x | 4 | = | 160 |
| 20 x | 5 | = | 100 | 30 x | 5 | = | 150 | 40 x | 5 | = | 200 |
| 20 x | 6 | = | 120 | 30 x | 6 | = | 180 | 40 x | 6 | = | 240 |
| 20 x | 7 | = | 140 | 30 x | 7 | = | 210 | 40 x | 7 | = | 280 |
| 20 x | 8 | = | 160 | 30 x | 8 | = | 240 | 40 x | 8 | = | 320 |
| 20 x | 9 | = | 180 | 30 x | 9 | = | 270 | 40 x | 9 | = | 360 |
| 20 x | 10 | = | 200 | 30 x | 10 | = | 300 | 40 x | 10 | = | 400 |
| 20 x | 11 | = | 220 | 30 x | 11 | = | 330 | 40 x | 11 | = | 440 |
| 20 x | 12 | = | 240 | 30 x | 12 | = | 360 | 40 x | 12 | = | 480 |
| 20 x | 13 | = | 260 | 30 x | 13 | = | 390 | 40 x | 13 | = | 520 |
| 20 x | 14 | = | 280 | 30 x | 14 | = | 420 | 40 x | 14 | = | 560 |
| 20 x | 15 | = | 300 | 30 x | 15 | = | 450 | 40 x | 15 | = | 600 |
| 20 x | 16 | = | 320 | 30 x | 16 | = | 480 | 40 x | 16 | = | 640 |
| 20 x | 17 | = | 340 | 30 x | 17 | = | 510 | 40 x | 17 | = | 680 |
| 20 x | 18 | = | 360 | 30 x | 18 | = | 540 | 40 x | 18 | = | 720 |
| 20 x | 19 | = | 380 | 30 x | 19 | = | 570 | 40 x | 19 | = | 760 |
| 20 x | 20 | = | 400 | 30 x | 20 | = | 600 | 40 x | 20 | = | 800 |

కృతజ్ఞత విద్య పుష్టి తుష్టి చేస్తుంది - అసూయ విద్య అంతం చేస్తుంది

| | | |
|---|---|---|
| 50 x 1 = 50 | 60 x 1 = 60 | 70 x 1 = 70 |
| 50 x 2 = 100 | 60 x 2 = 120 | 70 x 2 = 140 |
| 50 x 3 = 150 | 60 x 3 = 180 | 70 x 3 = 210 |
| 50 x 4 = 200 | 60 x 4 = 240 | 70 x 4 = 280 |
| 50 x 5 = 250 | 60 x 5 = 300 | 70 x 5 = 350 |
| 50 x 6 = 300 | 60 x 6 = 360 | 70 x 6 = 420 |
| 50 x 7 = 350 | 60 x 7 = 420 | 70 x 7 = 490 |
| 50 x 8 = 400 | 60 x 8 = 480 | 70 x 8 = 560 |
| 50 x 9 = 450 | 60 x 9 = 540 | 70 x 9 = 630 |
| 50 x 10 = 500 | 60 x 10 = 600 | 70 x 10 = 700 |
| 50 x 11 = 550 | 60 x 11 = 660 | 70 x 11 = 770 |
| 50 x 12 = 600 | 60 x 12 = 720 | 70 x 12 = 840 |
| 50 x 13 = 650 | 60 x 13 = 780 | 70 x 13 = 910 |
| 50 x 14 = 700 | 60 x 14 = 840 | 70 x 14 = 980 |
| 50 x 15 = 750 | 60 x 15 = 900 | 70 x 15 = 1050 |
| 50 x 16 = 800 | 60 x 16 = 960 | 70 x 16 = 1120 |
| 50 x 17 = 850 | 60 x 17 = 1020 | 70 x 17 = 1190 |
| 50 x 18 = 900 | 60 x 18 = 1080 | 70 x 18 = 1260 |
| 50 x 19 = 950 | 60 x 19 = 1140 | 70 x 19 = 1330 |
| 50 x 20 = 1000 | 60 x 20 = 1200 | 70 x 20 = 1400 |

| | | |
|---|---|---|
| 80 x 1 = 80 | 90 x 1 = 90 | 100 x 1 = 100 |
| 80 x 2 = 160 | 90 x 2 = 180 | 100 x 2 = 200 |
| 80 x 3 = 240 | 90 x 3 = 270 | 100 x 3 = 300 |
| 80 x 4 = 320 | 90 x 4 = 360 | 100 x 4 = 400 |
| 80 x 5 = 400 | 90 x 5 = 450 | 100 x 5 = 500 |
| 80 x 6 = 480 | 90 x 6 = 540 | 100 x 6 = 600 |
| 80 x 7 = 560 | 90 x 7 = 630 | 100 x 7 = 700 |
| 80 x 8 = 640 | 90 x 8 = 720 | 100 x 8 = 800 |
| 80 x 9 = 720 | 90 x 9 = 810 | 100 x 9 = 900 |
| 80 x 10 = 800 | 90 x 10 = 900 | 100 x 10 = 1000 |
| 80 x 11 = 880 | 90 x 11 = 990 | 100 x 11 = 1100 |
| 80 x 12 = 960 | 90 x 12 = 1080 | 100 x 12 = 1200 |
| 80 x 13 = 1040 | 90 x 13 = 1170 | 100 x 13 = 1300 |
| 80 x 14 = 1120 | 90 x 14 = 1260 | 100 x 14 = 1400 |
| 80 x 15 = 1200 | 90 x 15 = 1350 | 100 x 15 = 1500 |
| 80 x 16 = 1280 | 90 x 16 = 1440 | 100 x 16 = 1600 |
| 80 x 17 = 1360 | 90 x 17 = 1530 | 100 x 17 = 1700 |
| 80 x 18 = 1440 | 90 x 18 = 1620 | 100 x 18 = 1800 |
| 80 x 19 = 1520 | 90 x 19 = 1710 | 100 x 19 = 1900 |
| 80 x 20 = 1600 | 90 x 20 = 1800 | 100 x 20 = 2000 |

అగ్ని పర్వతాలు సముద్రాల్లో వుంటాయి - కొన్ని వేళల్లో అంతరంగాల్లోనూ భగ్గుమంటాయి.

# అంకెలు చెప్పే సత్యాలు

1. ఒకటి = సత్యం,
2. రెండు = ఆత్మ పరమాత్మ,
3. మూడు = త్రిమూర్తులు = బ్రహ్మ, విష్ణువు మహేశ్వరుడు.
త్రికాలములు = భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమానకాలము
త్రికరణములు = మనస్సు, వాక్కు, కాయము.
త్రిగుణములు = సత్త్వగుణము, రజోగుణము, తామసగుణము.
ఆహ్నికత్రయము = పూర్వాహ్నము, మధ్యాహ్నము, అపరాహ్నము.
అవస్థాత్రయము = జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ.
ఈషణాత్రయము = దారేషణ, ధనేషణ, పుత్రేషణ.
క్రియాత్రయము = మణి, మంత్రము, ఔషధము.
శక్తి త్రయము = ప్రభుశక్తి, ఉత్సాహశక్తి, మంత్రశక్తి.
అక్షిత్రయము = కంచికామాక్షి, మధురమీనాక్షి, కాశీ విశాలాక్షి.
అంబాత్రయము = మూకాంబ, జ్ఞానాంబ, భ్రమరాంబ.
నాయికాత్రయము = స్వీయ, పరకీయ, సామాన్య.
కవిత్రయము = నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రగడ. (తెలుగు)
రీతిత్రయము = గౌడీ రీతి, వైదర్భీ రీతి, పాంచాలీ రీతి,
పాకత్రయము = ద్రాక్షాపాకము, కదళీపాకము, నారికేళ పాకము.
4. నాలుగు = చతుర్వేదములు = ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అధర్వణవేదము
చతుర్యుగములు = కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము, కలియుగము.
చతుర్విధ పురుషార్థములు = ధర్మము, అర్థము, కామము, మోక్షము.
చతుర్విధోపాయములు = సామము, భేదము, దానము, దండనము.
చతురాశ్రమములు = బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము. సన్న్యాసము.
చతుర్విధవయోవస్థలు = బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము.
చతుర్విధాంతః కరణములు = మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.
కావ్య వృత్తి చతుష్టయము = కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి.
పురుషజాతి చతుష్టయము = భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు.
స్త్రీ జాతి చతుష్టయము = పద్మిని, హస్తిని, చిత్తిని ; శంఖిని.
భారతములోని దుష్ట చతుష్టయము = దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని.
5. ఐదు = పంచభూతములు = భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశము.
పంచాంగములు = తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము.
పంచ గంగలు = కృష్ణ, గోదావరి, గంగ, తుంగభద్ర, కావేరి.
పంచామృతములు = పాలు, పెరుగు, నెయ్యి, తేనె, నీరు.

పంచగవ్యములు =గోమూత్రము, గోమయము, గోఘృతము, గోక్షీరము, గోదధి.
పంచ కావ్యములు = (సంస్కృతము) రఘువంశము, కుమార సంభవము, మేఘ సందేశము, మాఘము; కిరాతార్జునీయము.
పంచ ప్రాణములు = ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము.
పంచ ఉపవాయువులు = నాగము, కూర్మము. కృకరము, దేవదత్తము, ధనంజయము.
పంచ మహా పాతకములు = స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము.
పంచభక్ష్యములు = భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.
పితృ పంచకము = తన్ను గన్నవాడు, తన్ను పెంచినవాడు, చదువు చెప్పిన గురువు, ఆపద నుండి రక్షించినవాడు, దేశ పాలకుడు.
మాతృ పంచకము = తన్ను గన్నతల్లి, పెంచిన తల్లి, గురువు భార్య, అన్నభార్య, భార్యను గన్నతల్లి
కర్మేంద్రియపంచకము = వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ.
జ్ఞానేంద్రియ పంచకము = ఘ్రాణేంద్రియము, రసనేంద్రియము, చక్షురింద్రియము, త్వగింద్రియము, శ్రోత్రేంద్రియము.
**6. ఆరు = షడృతువులు :** వసంత ఋతువు, గ్రీష్మ ఋతువు, వర్ష ఋతువు, శరదృతువు, హేమంత ఋతువు, శిశిర ఋతువు.
షడ్రుచులు = తీపు, కారము, పులుపు, ఉప్పు, వగరు, చేదు.
షట్కర్మలు = యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతి గ్రహ్యము.
షణ్మతములు = శైవము, వైష్ణవము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము.
షడీతిబాధలు = అతివృష్టి, అనావృష్టి మూషికములు, శుకములు, శలభములు, సమీపరాజులు.
అరిషడ్వర్గము = కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము.
షట్చక్రవర్తులు= హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్త వీర్యార్జునుడు.
షట్చక్రములు = మూలాధారచక్రము, స్వాధిష్ఠాన చక్రము, మణిపూరక చక్రము, అనాహత చక్రము, విశుద్ధ చక్రము, ఆజ్ఞా చక్రము.
శమాది షట్కము = శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము. శ్రద్ధ.
**శ్రీమద్రామాయణములోని కాండములు ఆరు :** బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండములు, ఉత్తర రామాయణము, ఉత్తరకాండము.
**7. ఏడు = సప్త ఋషులు** = గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు, అత్రి, వశిష్ఠుడు, కశ్యపుడు, జమదగ్ని.
సప్త వ్యసనములు = స్త్రీ వ్యామోహము, జూదము, మద్యపానము, వేట, వాక్పారుష్యము, కఠిన దండనము, నిరర్థక ధనవ్యయము.
సప్త సముద్రములు = లవణ సముద్రము, ఇక్షుసముద్రము, సర్పి సముద్రము, దధిసముద్రము, సుధా సముద్రము, క్షీరసముద్రము, ఉదక సముద్రము.
సప్త వారములు = ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని.

సప్త స్వరములు = షడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము : స రి గ మ ప ద ని
సప్త విభక్తులు = ప్రథమా విభక్తి, ద్వితీయావిభక్తి, తృతీయావిభక్తి, చతుర్థీ విభక్తి, పంచమీ విభక్తి, షష్ఠీ విభక్తి, సప్తమీ విభక్తి.
సప్త సంతానములు= ఔరసుడు, తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, కావ్యము.
సప్త ద్వీపములు = జంబూద్వీపము, ప్లక్ష ద్వీపము, కుశద్వీపము, క్రౌంచ ద్వీపము, శాక్యద్వీపము, శాల్మల ద్వీపము, పుష్కర ద్వీపము.
సప్త మాతృకలు=బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి.
సప్త కుల పర్వతములు = మహేంద్ర పర్వతము, మలయ పర్వతము, సహ్యా పర్వతము, శుక్తి మంత పర్వతము, గంధమాదన పర్వతము, వింధ్య పర్వతము. పారియాత్ర పర్వతము.
సభా సప్తాంగములు = కవులు, పండితులు, పౌరాణికులు, పూర్వ కథలు చెప్పువారు, స్తుతి పాఠకులు, హాస్యకారులు, గాయకులు.
**8. ఎనిమిది** = **అష్ట దిక్కులు** = తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరృతి, పడమర, వాయవ్యము, ఉత్తరము,. ఈశాన్యము.
అష్ట కష్టములు = దారిద్ర్యము, దాస్యము, భార్యా వియోగము, స్వయంకృతాపరాధము, భిక్షాటన, ప్రయత్న విఫలం, అప్పుచేత బాధపడుట, వ్యాధిచేత బాధపడుట.
అష్టసిద్దులు = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.
అష్ట భోగములు = గృహము, శయ్యు వస్త్రము, స్త్రీ పుష్పము, తాంబూలము, గంధము, గానము.
అష్టైశ్వర్యములు = దాసి, భృత్యులు, సంతానము, బంధువులు, వస్తువులు, వాహనములు, ధన సమృద్ధి, ధాన్యసమృద్ధి.
అష్ట మదములు = భోజనము, అర్థము, స్త్రీ, విద్య, కులము, రూపము, ఉద్యోగము, యౌవనము.
అష్టవసువులు = ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు.
అష్ట పాశములు = దయ, జుగుప్స, మోహము, భయము, సంశయము, కులము, శీలము, బలము.
అష్ట దిగ్గజములు = ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్ప దంతము, సార్వభౌమము, సుప్రతీకము.
అష్ట గంధములు = కర్పూరము, కస్తూరి, పునుగు, జవ్వాజి, అగరు, పన్నీరు, అత్తరు, శ్రీగంధము.
అష్టధాతువులు =బంగారం, వెండి, రాగి, తగరము, తుత్తునాగము, సీసము, పాదరసము, ఇనుము.
**9. తొమ్మిది** = **నవరత్నములు** = వజ్రము, వైఢూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, నీలము, ముత్యము, ప్రవాళము.
నవరసములు = శృంగారము, హాస్యము, వీరము, రౌద్రము, భయానకము, బీభత్సము, అద్భుతము, కరుణము, శాంతము.

**కళ్ళు చూడలేకున్నా కనురెప్పలు కదులుతుంటాయి - ప్రజలు పాలించలేకపోయినా వాళ్ళ చేతులు ప్రభుత్వాల్ని కూలుస్తుంటాయి.**

నవ విధులు = పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము.
నవ ధాన్యములు = గోధుమలు, యవలు, పెసలు, శనగలు, కందులు, అలసందలు, నువ్వులు, మినుములు, ఉలవలు.
నవ వర్షములు = భరత వర్షము, రమ్యకవర్షము, కింపురుషవర్షము, హరివర్షము, భద్రాశ్వవర్షము, కురువర్షము, హిరణ్మయ వర్షము, ఇలావృతవర్షము, కేతు మూలవర్షము.
నవబ్రహ్మలు = భృగువు, పులస్త్యుడు, పులిహుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వశిష్ఠుడు, మరీచి.
నవగ్రహములు = సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని, రాహువు, కేతువు.
**10. పది = దశదిశలు** = తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఈశాన్యము, ఆగ్నేయము, నైరృతి, వాయవ్యము, (భూమి, ఆకాశము.) ఊర్ధ్వ అధో దిశలు
దశ దానములు = గోదానము, తిలదానము, హిరణ్య దానము, ఆజ్యదానము, వస్త్ర దానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, భూదానము, లవణ దానము.
**11. పదకొండు = ఏకాదశ రుద్రులు** = అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్నుడు, త్వష్ట రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు.
**12. పన్నెండు = ద్వాదశాదిత్యులు** = ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు,అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.
ద్వాదశరాశులు = మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.
**13. పదమూడు** : త్రయోదశగుణములు=రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము,మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దర్పము, దంభము, అహంకారము.
**14. పద్నాలుగు** = చతుర్దశలోకములు = భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము, (ఈ ఏడు ఊర్ధ్వలోకములు)
అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము. (ఈ ఏడు అధోలోకములు).
చతుర్దశమనువులు = స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుడు, భౌమ్యుడు.
**15. పదిహేను** = పంచదశ యోగాంగములు = యమము, నియమము, త్యాగము, దుస్థితి, ప్రాణాయమము, అధ్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి.
**16. పదహారు = షోడశదానములు** = గోదానము, భూదానము, తిలాదానము, హిరణ్యాదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహ దానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషీదానము.

17. **పదిహేడు = సప్తదశపదార్థములు** = పంచప్రాణములు 5 చూ. పుట. 13 పంచజ్ఞానేంద్రియములు 5 చూ. 13 పంచ కర్మేంద్రియములు 5 చూ. పుట 13

18. **పద్దెనిమిది = అష్టాదశపురాణములు** = మత్స్య పురాణము, మార్కండేయ పురాణము, భాగవత పురాణము, భవిష్యత్ పురాణము, బ్రహ్మాండ పురాణము, బ్రహ్మవైవర్త పురాణము, బ్రహ్మపురాణము, వామన పురాణము, వరాహపురాణము, అగ్ని పురాణము, నారద పురాణము, పద్మపురాణము, లింగపురాణము, గరుడ పురాణము, కూర్మపురాణము, స్కాంద పురాణము.

అష్టాదశ ఉప పురాణాలు = సనత్కుమారము, నారసింహము, స్కాందము, శివధర్మము, దౌర్వాసము, నారదీయము, కపిలము, మానవము, ఔశనము, బ్రహ్మాండము, వారుణము, కౌశికము, లైంగము, సాంబము, సౌరము, పారాశరము, మారీచము, భార్గవము.

మహాభారతములోని అష్టాదశపర్వములు = ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వములు.

అష్టాదశ విద్యలు = ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము, శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము.

## సంఖ్యామానము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఒకటి | 15 | పదునైదు | 200 | రెండువందలు |
| 2 | రెండు | 16 | పదునారు | 300 | మూడువందలు |
| 3 | మూడు | 17 | పదునేడు | 400 | నాలుగువందలు |
| 4 | నాలుగు | 18 | పదునెనిమిది | 500 | ఐదువందలు |
| 5 | ఐదు | 19 | పందొమ్మిది | 600 | ఆరువందలు |
| 6 | ఆరు | 20 | ఇరవై | 700 | ఏడువందలు |
| 7 | ఏడు | 30 | ముప్పది | 800 | ఎనిమిదివందలు |
| 8 | ఎనిమిది | 40 | నలుబది | 900 | తొమ్మిదివందలు |
| 9 | తొమ్మిది | 50 | ఏబది | 1000 | వేయి |
| 10 | పది | 60 | అరువది | 10,000 | పదివేలు |
| 11 | పదకొండు | 70 | డెబ్బది | 1,00,000 | లక్ష |
| 12 | పన్నెండు | 80 | ఎనుబది | 10,00,000 | పది లక్షలు |
| 13 | పదమూడు | 90 | తొంబది | 1,00,00,000 | కోటి |
| 14 | పదునాలుగు | 100 | నూరు/వంద | 10,00,00,000 | పదికోట్లు |

అంతేకాదు, తెలుగులో పదికోట్లు సంఖ్యల తరవాత వుండే ఆ పై సంఖ్యలను కూడా పేర్లుపెట్టి వ్యవహరించేవారు. అవి ఒకటి క్రింద 72 సున్నాల వరకూ ఉన్నాయి. అందుకొన్ని

| | | |
|---|---|---|
| 1 శతకోటి | 7 మహాపద్మము | 22 అవ్యయము (అమృతము) |
| 2 అర్బుదము | 8 క్షోణి | 23 అచింత్యము |
| 3 న్యర్బుదము | 9 మహాక్షోణి/అక్షౌహిని | 24 అమేయము |
| 4 ఖర్వము | 19 పరార్థము | 25 భూరి |
| 5 మహాఖర్వము | 20. అనంతము | 26 మహాభూరి |
| 6 పద్మము | 21 సాగరము | |

## లెక్కల గుర్తులు

| | | |
|---|---|---|
| + | ప్లస్ | కూడిక |
| - | మైనస్ | తీసివేత |
| × | ఇంటు | గుణకారము |
| ÷ | డివైడెడ్‌బై | భాగహారము |
| = | ఇజీక్వల్టు అనగా | (సమానము) అనేదానికి ఈ గుర్తు |
| ∴ | దేర్‌ఫర్ | (కాబట్టి అనేదానికి ఈ గుర్తు) |
| ∵ | బికాజ్ | (ఎందుచేత అనేదానికి ఈ గుర్తు) |
| % | పర్సెంటేజ్ | శాతము |
| 5° | డిగ్రీ | ఏదేని అంకెమీద చిన్నసున్నపెట్టిన అది డిగ్రీ గుర్తు |
| ( ) | | చిన్నబ్రాకెట్ |
| { } | | లార్జ్ బ్రాకెట్ |
| [ ] | | స్క్వేర్ బ్రాకెట్ |
| ——— | | డాష్ బ్రాకెట్ |

# మన పండుగలు

| | |
|---|---|
| జనవరి 1 | ఆంగ్ల సంవత్సరాది |
| జనవరి 13 | భోగి పండుగ |
| జనవరి 14 | మకర సంక్రాంతి |
| జనవరి 15 | కనుమ |
| జనవరి 26 | గణతంత్ర దినం |
| ఆగస్టు 15 | స్వాతంత్ర్యదివం |
| అక్టోబరు 2 | గాంధీజయంతి |

| | |
|---|---|
| నవంబరు 1 | ఆంధ్రప్రదేశ్ అవతరణ దినం |
| నవంబరు 14 | నెహ్రూ జయంతి |
| డిసెంబరు 25 | క్రిస్టమస్ |
| చైత్ర శుద్ధ పాడ్యమి | ఉగాది |
| చైత్ర శుద్ధ నవమి | శ్రీరామ నవమి |
| భాద్రపద శుద్ధ చవితి | వినాయక చవితి |
| శ్రావణ రెండవ శుక్రవారము | వరలక్ష్మీ వ్రతము |
| శ్రావణ శుద్ధ పూర్ణిమ | రక్షాబంధనం |
| శ్రావణ బహుళ అష్టమి | గోకులాష్టమి |
| ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి | దేవీ నవరాత్రారంభం |
| ఆశ్వయుజ శుద్ధ అష్టమి | శ్రీ దుర్గాష్టమి |
| ఆశ్వయుజ శుద్ధ నవమి | మహానవమి |
| ఆశ్వయుజ శుద్ధ దశమి | విజయదశమి |
| ఆశ్వయుజ బహుళ చతుర్దశి | నరక చతుర్దశి |
| ఆశ్వయుజ బహుళ అమావాస్య | దీపావళి (అమావాస్య), ధనలక్ష్మీ పూజ |
| కార్తీక శుద్ధ చవితి | నాగుల చవితి |
| కార్తీక పూర్ణిమ | కార్తీక పూర్ణిమ |
| మాఘ శుద్ధ పంచమి | వసంత పంచమి |
| ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ | హోళి |

## ఋతువులు

**వసంత ఋతువు :** చెట్లు చిగుర్చి పూవులు పూస్తాయి. చైత్రం, వైశాఖం

**గ్రీష్మ ఋతువు :** ఎండలు మెండుగా కాస్తాయి. జ్యేష్ఠం, ఆషాఢం

**వర్ష ఋతువు :** వర్షములు ఎక్కువగా కురుస్తాయి. శ్రావణం, భాద్రపదం

**శరదృతువు :** వెన్నెల కాలము. ఆకాశం నిర్మాలంగా వుంటుంది. ఆశ్వయుజం, కార్తీకం

**హేమంత ఋతువు :** మంచు కురియును, వాతావరణము చల్లగా ఉండును. మార్గశిరం, పుష్యం

**శిశిర ఋతువు :** చెట్లు ఆకులు రాల్చును. అడవులు మోడువారుతాయి. మాఘం, ఫాల్గుణం

కాలములు 3. అవి : వేసవి కాలము, వర్షకాలము, శీతకాలము.

**వేసవి కాలము :** చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం, ఆషాఢం.

**వర్షకాలము :** శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము
**చలికాలము :** మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గుణము.
2 మాసములు 1 ఋతువు. 6 ఋతువులు ఒక సంవత్సరం. సంవత్సరమునకు 2 అయనములు. అయనములనగా సూర్యుడు నడుచు కాలం. అవి ఉత్తరాయణం, దక్షిణాయనం. ఉత్తరాయణంలో సూర్యుడు ఉత్తరదిశ వైపుగా దక్షిణాయనంలో సూర్యుడు దక్షిణ దిశ వైపుగా పయనించును.

# జాతీయ విషయాలు

| | | |
|---|---|---|
| జాతీయ గీతం | : | జనగణమన |
| జాతీయ పతాకం | : | త్రివర్ణం :- పైన కషాయం, మధ్య తెలుపు, కింద ఆకుపచ్చ, తెలుపు రంగు పైన మధ్యలో ఆశోక చక్రం. |
| జాతీయ ముద్ర | : | సారనాథ్ స్థూపంలోని త్రిసింహ చూళిక |
| జాతీయ పక్షి | : | నెమలి |
| జాతీయ జంతువు | : | పెద్ద పులి |
| జాతీయ పుష్పం | : | తామర |
| జాతీయ వృక్షం | : | వేప |
| జాతీయ ఫలం | : | మామిడి |
| జాతీయ క్యాలెండర్ | : | శాలివాహన శకం ప్రాతివదికగా రూపొందించనది. |
| జాతీయ క్రీడ | : | హాకీ |
| జాతీయ పండుగలు | : | రిపబ్లిక్ దినోత్సవం, స్వాతంత్ర్య దినోత్సవం, గాంధీజయంతి, నెహ్రూజయంతి, ఉపాధ్యాయ దినోత్సవం |



జాతీయ భాషలు : భారత రాజ్యాంగంలోని 8వ షెడ్యూలు ప్రకారం భాషలు మొత్తం 18. తెలుగు, హిందీ,అస్సామీ, ఉర్దూ, ఒరియా, కన్నడం, కాశ్మీరీ, కొంకణీ, గుజరాతీ, తమిళం, నేపాలీ, పంజాబీ, బెంగాలీ, మణిపురీ, మరాఠీ, మళయాళం, సంస్కృతం, సింధీ.

# ఆంధ్ర ప్రదేశ రాష్ట్రీయ విషయాలు

| | | |
|---|---|---|
| రాష్ట్ర గీతం | : | మా తెలుగుతల్లికి మల్లెపూదండ |
| రాష్ట్ర చిహ్నం | : | పూర్ణకుంభం, (పూర్ణ కలశం) |
| రాష్ట్ర పక్షి | : | పాలపిట్ట |

| | | |
|---|---|---|
| రాష్ట్ర మృగం | : | కృష్ణజింక |
| రాష్ట్ర క్రీడ | : | కబడ్డీ |
| రాష్ట్ర వృక్షం | : | వేప |
| రాష్ట్ర భాష | : | తెలుగు |
| రాష్ట్ర ద్వితీయ భాష | : | హిందీ |
| రాష్ట్ర తెలుగు సంవత్సరాది | : | ఉగాది. |
| రాష్ట్రావతరణ దినం | : | నవంబర్ 1 |



# కాలమానము

కాలము భగవత్స్వరూపము. అమితమైన ఈ కాలమును సూర్యచంద్రాది నక్షత్ర గమనముల నాధారముగా భాగములు చేసి జీవులు వర్తించుచున్నారు.

| | | |
|---|---|---|
| *మనిషి 5 రెప్ప పాట్లు* | = | *1 విఘడియ* |
| *60 విఘడియలు* | = | *1 ఘడియ* |
| *7 1/2 ఘడియలు* | = | *1 జాము* |
| *8 జాములు* | = | *1 పగలు, రాత్రి (తిథి)* |
| *15 తిథులు* | = | *1 పక్షము* |
| *2 పక్షములు* | = | *1 నెల (మనుష్య మాసం)* |
| *2 నెలలు* | = | *1 ఋతువు* |
| *3 ఋతువులు* | = | *1 అయనము* |
| *2 అయనములు* | = | *1సంవత్సరము(మనుష్య సంవత్సరము)* |
| *12 సంవత్సరాలు* | = | *1 పుష్కరము* |
| *1 మనుష్య సంవత్సరము (పితృ దేవతలకు)* | = | *1 పగలు రాత్రి (శుక్ల పక్షము పగలు, కృష్ణ పక్షము రాత్రి)* |
| *1 మనుష్య సంవత్సరము (దేవతలకు) (ఉత్తరాయణము పగలు, దక్షిణాయణము రాత్రి)* | = | *1 పగలు రాత్రి* |
| *860 దేవతల దినములు* | = | *1 దేవ సంవత్సరం* |
| *12000 దేవ వత్సరాలు* | = | *1 దేవ యుగము లేక మనుష్య మహాయుగం* |
| *2000 దేవ యుగాలు* | = | *1 అహో రాత్రము బ్రహ్మకు లేక 2 మనుష్య కల్పములు, బ్రహ్మకు పగలు ఉదయ కల్పము రాత్రి క్షయ కల్పం)* |
| *71 మహా యుగములు* | = | *1 మన్వంతరం* |

| | | |
|---|---|---|
| 14 మన్వంతరాలు | = | బ్రహ్మకు 1 పగలు లేక 1 మనుష్య కల్పము |
| 60 సెకండ్లు | = | 1 నిమిషము లేక 2 1/2 విఘడియలు |
| 60 నిమిషాలు | = | 1 గంట లేక 2 1/2 ఘడియలు |
| 24 గంటలు | = | 1 రోజు |
| 7 రోజులు | = | 1 వారము |
| 30 రోజులు | = | 1 నెల |
| 12 నెలలు లేక 365 366 రోజులు | = | 1 సంవత్సరము |

సాధారణంగా ఇంగ్లీషు నెలల్లో నాలుగు సంవత్సరముల కొకసారి లీపు సంవత్సరం వస్తుంది. లీపు సంవత్సరంలో ఫిబ్రవరి నెలలో 29 రోజులు ఉంటాయి. ఏ ఇంగ్లీషు సంవత్సరం అయితే 4 చేత శేషం లేకుండా భాగించబడుతుందో అదియే లీపు సంవత్సరం.

## రాశులు

| | | | |
|---|---|---|---|
| 1. మేషం | 2. వృషభం | 3. మిథునం | 4. కర్కాటక |
| 5. సింహం | 6. కన్య | 7. తుల | 8. వృశ్చికం |
| 9. ధనుస్సు | 10. మకరం | 11. కుంభం | 12. మీనం |

## నక్షత్రములు మరియు కార్తులు

| | | | |
|---|---|---|---|
| 1. అశ్విని | 2. భరణి | 3 కృత్తిక | 4. రోహిణి |
| 5. మృగశిర | 6. ఆర్ద్ర | 7. పునర్వసు | 8. పుష్యమి |
| 9. ఆశ్లేష | 10. మఖ | 11. పుబ్బ | 12. ఉత్తర |
| 13. హస్త | 14. చిత్ర | 15. స్వాతి | 16, విశాఖ |
| 17. అనూరాధ | 18. జ్యేష్ఠ | 19. మూల | 20. పూర్వాషాఢ |
| 21. ఉత్తరాషాఢ | 22. శ్రవణం | 23. ధనిష్ఠ | 24. శతభిషం |
| 25. పూర్వాభాద్ర | 26. ఉత్తరాభాద్ర | 27. రేవతి | |

## దశాంశ పద్ధతి

మనదేశంలో ప్రస్తుతం అంతటా ఒకేవిధమైన లెక్కింపు పద్ధతి అమలులో వుంది. కొలతలు, తూనికలు, కూడికలు, హెచ్చింపులు, భాగింపులకు సర్వత్రా ఒకేవిధమైన పద్ధతి సాగుతుంది. ఇప్పుడు రూపాయికి వంద పైసలు. అయిదు పైసలు, పది పైసలు, ఇరవై పైసలు, ఇరువై అయిదు పైసలు, యాభై పైసలు, ఒక రూపాయి, లేదా రూపాయి నాణెములు అమలులో వున్నాయి.

## మెట్రిక్ విధానము

| | | | |
|---|---|---|---|
| 10 | ఒకట్లు | = | ఒక పది |
| 10 | పదులు | = | ఒక నూరు |
| 10 | నూర్లు | = | ఒక వెయ్యి |
| 100 | వేలు | = | ఒక లక్ష |
| 10 | లక్షలు | = | ఒక మిలియను |
| 10 | మిలియన్లు లేక | = | ఒక కోటి |
| 100 | లక్షలు | = | |

### ద్రవమానము

| | | |
|---|---|---|
| 10 మిల్లీ లీటర్లు | = | 1 సెంటీ లీటరు |
| 10 సెంటీ లీటర్లు | = | 1 డెసీ లీటరు |
| 10 డెసీ లీటర్లు | = | 1 లీటరు |
| 10 లీటర్లు | = | 1 డెకా లీటరు |
| 10 డెకా లీటర్లు | = | 1 హెక్టా లీటరు |
| 10 హెక్టా లీటర్లు | = | 1 కిలో లీటరు |
| పూర్వపు 1 సీసా | = | 7.6 డెసీ లీటర్లు |
| 1 గ్యాలను | = | 4.55 లీటరు |

### తులామానము

| | | |
|---|---|---|
| 10 మిల్లీ గ్రాములు | = | 1 సెంటీ గ్రాము |
| 10 సెంటీ గ్రాములు | = | 1 డెసీ గ్రాము |
| 10 డెసీ గ్రాములు | = | 1 గ్రాము |
| 10 గ్రాములు | = | 1 డెకా గ్రాము |
| 10 డెకా గ్రాములు | = | 1 హెక్టా గ్రాము |
| 10 హెక్టా గ్రాములు | = | 1 కిలో గ్రాము = 1000 గ్రాములు |
| పూర్వపు 1 ఔన్సు | = | 284 గ్రాములు |
| 1 పౌండు | = | 0.45 కిలోగ్రాములు |
| 1 తులము | = | 11.664 గ్రాములు |
| 1 వీశె | = | 1.4 గ్రాములు |
| 1 గురిగింజ | = | 111 మిల్లీ గ్రాములు |

## బంగారము - తూకము

బంగారము తూచే తూకములో 5,50, 100, 200, 500 మిల్లీ గ్రాములు. 1, 2 5 మొదలగు గ్రాముల తూకములు అమలులో వున్నవి.

| | | |
|---|---|---|
| 10 మిల్లీ గ్రాములు | = | 1 గ్రాము |
| 111 మిల్లీ గ్రాములు | = | 1 గురిగింజ ఎత్తు |
| 11.664 గ్రాములు | = | 1 (పాత) తులము |

## బంగారము - పాత తూకము

| | | |
|---|---|---|
| 2 వీసములు | = | 1 పరక |
| 2 పరకలు | = | 1 పాతిక |
| 2 పాతికలు | = | 1 అడ్డిగ |
| 2 అడ్డిగలు | = | 1 చిన్నము |
| 3 చిన్నములు | = | 1 తులము |

(తులము అనగా ఒకరూపాయి నాణెము ఎత్తు, వీసము అనగా ఒక అణా ఎత్తు)

## దూర పరిమాణము - ఆంగ్ల విధానము

| | | |
|---|---|---|
| 12 అంగుళములు | = | 1 అడుగు |
| 3 అడుగులు | = | 1 గజము |
| 12 గజములు | = | 1 రాడ్ |
| 22 గజములు | = | 1 గొలుసు |
| 220గజములు | = | 1 ఫర్లాంగు |
| 8 ఫ్లరాంగులు | = | 1 మైలు |
| 484చదరపు గజములు | = | 1 చదరపు గొలుసు |
| 4840 చదరపు గజములు | = | 1 ఎకరము |
| 40 చదరపు రాడ్‌లు | = | 1 రూడ్ |
| 4 రూడ్స్ | = | ఒక ఎకరము |

## మెట్రిక్ మానములు దైర్ఘ్యమానము

| | | |
|---|---|---|
| 10 మిల్లీ మీటర్లు | = | 1 సెంటీ మీటరు |
| 10 సెంటీ మీటర్లు | = | 1 డెసీ మీటరు |
| 10 డెసీ మీటర్లు | = | 1 మీటరు |
| 10 మీటర్లు | = | 1 డెకా మీటరు |
| 10 డెకా మీటర్లు | = | 1 హెక్టా మీటరు |
| 10 హెక్టా మీటర్లు | = | 1 కిలో మీటరు = 100 మీటర్లు |
| పూర్వపు 1 అంగుళము | = | 25.40 మిల్లీ మీటర్లు |
| 1 అడుగు | = | 80.4 సెంటి మీటర్లు |
| 1 గజం | = | 0.91 మీటర్లు |
| 1 మైలు | = | 1.61 కిలోమీటరు |

# బాల గేయాలు

## తారంగం



తారంగం తారంగం తాండవ కృష్ణాతారంగం
వేణూనాథా తారంగం వేంకటరమణా తారంగం
వెన్నల దొంగా తారంగంచిన్నీ కృష్ణా తారంగం.

## బుర్రుపిట్ట



బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది
పడమటింటి కాపురమూ చేయనన్నది
అత్త తెచ్చిన కొత్త చీర కట్టనన్నది
మామ తెచ్చిన మల్లెపూలు ముడువనన్నది
మొగని చేత మొట్టికాయ తింటనన్నది

## ఊగు ఊగూ గంగెద్దా



ఊగూ ఊగూ గంగెద్దా ఉగ్గూపాలే గంగెద్దా
సోలీ ఊగే గంగెద్దా సోలెడు పాలే గంగెద్దా
తాళీ ఊగే గంగెద్దా తవ్వెడుపాలే గంగెద్దా
మారీ ఊగే గంగెద్దా మానెడు పాలే గంగెద్దా
ఆగీ ఊగే గంగెద్దా అడ్డెడు పాలే గంగెద్దా

## గడపలలో



గడపలల్లో కెల్ల ఏ గడపమేలు
మహలక్ష్మి నివసించు మాగడపమేలు
వీధులలోకెల్ల ఏవీధి మేలు
విద్వాంసులున్నట్టి మా వీధి మేలు
అరుగులలోకెల్ల ఏ అరుగు మేలు
పండితులు కూర్చున్న మా అరుగు మేలు
తోటలలోకెల్ల ఏ తోట మేలు
మామిడి చెట్టున్న మా తోట మేలు
ఏదేశమిస్తుంది శాంతి సందేశం
భిన్న జాతులు ఉన్న మా భరతదేశం

నీవు కొన్న ప్రతి మంచి పుస్తకం నీకు ఆత్మీయుడవుతుంది - ఏకాంతంలో ఊరట నిస్తుంది.

## ఓ వాచీ



ఓ వాచీ - మా వాచీ
టిక్ టిక్ టిక్ టిక్
టిక్ టిక్ టిక్ ఓ వాచీ
టక్ టక్ టక్ మా వాచీ
అందమైన మోముపైన
అంకెలున్నాయి - అంకెలున్నాయి
ఆ అంకెలను చూపుతున్న
ముల్లులున్నాయి మూడు ముల్లులున్నాయి
పెద్దముల్లు చూపుతుంది నిమిషాలెన్నెన్నో
చిన్నముల్లు చూపుతుంది గంటలు ఎన్నెన్నో మరీ
చిన్న ముల్లు చూపుతుంది టిక్ టిక్ లెన్నెన్నో
పగలు రాత్రి యనక నీవు ఎటుల తిరిగెదవో
ఆ కిటుకు తెలిసిన లటుకులాడి చిటుకు యంత్రమా

- శ్రీ న్యాయపతి రాఘవరావు

## పరిశోధనల పాట

సైకిలు కనుగొనె మాక్ మిలన్
విమానమిచ్చిరి రైటు సోదరులు
టీ.వీ. నిచ్చెను జే.జే. బియర్డ్
అచ్చుయంత్రంను గూటెన్ ఒసెగెను.
న్యూటన్ భూమయస్కాంతం అనెను.
అలెగ్జాండరందించె పెన్సిలిన్
టెలిఫోనిచ్చెను గ్రాహం బెలు
ఎడిసన్ బల్బును తయారు చేసెను
రేడియొ కనుగొనె మార్కోని
జేమ్సు ఇచ్చెను రైలు ఇంజెను
లిఫ్ట్‌కు రూపం పోసెను ఓటిస్
జ్వరమానిని కనుగొనె ఫారన్‌హిట్
డైనమెట్ కనుగొనె ఆల్ఫ్రెడ్ నోబెల్
రేడియం కనుగొనె మేడం క్యూరీ
బ్రెయిలీ లిపిని బ్రెయిలీ ఒసగెను
లీవెక్ ఇచ్చెను స్టెతస్కోపును
పార్కెన్స్ కనుగొనె రెఫ్రిజిరేటర్











- సుద్దాల శ్రీదేవి

# పనిపాట

ప్రజలలో ఎంతో వాడుకలో వున్న మాట పనిపాట. అయితే 'పనీపాట' పనిపాటల వాళ్ళు ' పనా పాటా ' ఇలాంటి మాటల గురించి లోతుగా ఆలోచించి నపుడు పనికీ పాటకూ వున్న అద్భుతమైన సంబంధం మనకు తెలుస్తుంది.

పని పాట అనగా పనియొక్క పాట. పని చేస్తున్న కష్టజీవులు తమ తమ పనులు చేస్తూనే వారి పనిని ఒక క్రమ పద్ధతిలో సాగించడానికి, సమానమైన వేగంలో కొనసాగించడానికి, శ్రమ ద్వారా వచ్చే అలసటను తీర్చుకోవడానికి ఒక పనిముట్టులా ఉపయోగపడింది పాట. అందుకే ' పని - పాట ' అనే మాట పుట్టింది. అంతేకాదు పనిలోనే పాట కూడా పుట్టింది. ఇందుకు మనకెన్నో ఉదాహరణలు కనిపిస్తున్నాయి.



పూర్వం రాజులను, రాణులను, దొరలను, దొరసానులను, మేనాలలో, పల్లకీలలో మోసుకుంటూ ఎన్నో మైళ్ళ దూరాలకు చేరవేస్తుండేవారు అపుడు ఆ పల్లకీలను మోసే వాళ్ళు తమ భుజాలపైనున్న వాహనాలలో వున్న వారికి ఇబ్బంది కలగనంత సున్నితంగా మోస్తూనే తమకు వస్తున్న అలసటను " ఓహ్హాం ఓహ్హాం హా" అని ఒక లయలో అంటూ అదే లయలో పాడుతూ వెళ్తుండేవారు. అలాగే వడ్లు దంచుతున్న ఆడపడుచుల పనిపాటలు రోకటి పాటలుగా మారాయి. పడవలో చేపల వేటకు వెళ్ళే జాలరి తమ్ముళ్ళ గొంతుల నుండి "హైలెస్సో హైలెస్సా " లాంటి పనిపాటలు పుట్టాయి. ఇలా పనిలో, పనితో పుట్టిన పాట వినోదసాధనంగాను, భగవంతుని స్తోత్రంగాను, ఉద్యమాలకు ఊపిరిగాన్నూ విస్తరించింది. అంతేకాదు వ్యాపారస్థుల చేతులలో సినిమాపాటగాను మారింది.

# పొడుపు కథలు

పుట్టినవూరు అడవి
పెంచినతల్లి తరువు
వంటినిండా గాయాలు
కడుపునిండా గేయాలు



మురళి

దారాలతో కుట్టేస్తారు
అట్టలమధ్య బంధిస్తారు
ప్రపంచాన్ని తనలో దాచుకుంటుంది
తానుమాత్రం చేతిలో ఇమిడిపోతుంది.
మనతోపాటే వస్తుంది



పుస్తకం

టికెట్ కూడా తీసుకొంటుంది
సినిమా మాత్రం చూడనంటుంది
మూడుగంటలు మనకోసం నిల్చుంటుంది.

**వాహనము**

ముక్కుమీదికెక్కు
రెండుచెవులునొక్కు
టక్కునిక్కుల సొక్కు
జారిందంటే పటుక్కు
ఎల్లప్పుడు వెంటే వుంటుంది
అందరికీ కనబడుతుంటుంది.

**కళ్ళజోడు**

చేయి పెడితే అడ్డగిస్తుంది.
చూపును మాత్రం లోనికి రానిస్తుంది
దూరాలను దగ్గరగా తెస్తుంది
అందాలను ఇంట్లో విరబూయిస్తుంది.

**టీ.వీ.**



**ఫోన్**

పట్టుకున్న చేతిలోనే ఉంటుంది
ఎన్ని చేతులయినా మారుతుంది
ఎంతదూరమైనా వినబడుతుంది.
చెవిలో మాట్లాడుతుంది.

నోరుతప్ప చెవులు లేవు - పాముకాదు
చెపుతాడు తప్ప వినిపించుకోడు - మనిషి కాదు
సెలవు లేకుండా పనిచేస్తాడు - ఉద్యోగి కాదు
ఒక పురుషుడు కన్న బిడ్డ ఎవడు వాడు?



**రేడియో**





ప్రతి జీవి కడుపులో నేను వున్నాను
జనపురోగతికి పునాది (నేను) నయ్యాను
నా కోసమే ప్రపంచం సాగుతున్నది.
ప్రతి పనీ నా వల్లనే పూర్తవుతుంది.

**ఆకలి (ఆహారం)**

అన్నంకన్నా ముందు నేను కావాలి
అందరిలో నేనెపుడూ ఉంటు ఉండాలి
ఆకారం నాకంటూ లేనే లేదు
నేను లేనిచోటు భూమిపై లేదు.



**గాలి**




అందరూ నా బిడ్డలే
నన్నెవరు అమ్మా అని పిలవరు
ఏది పొందాలన్నా నాలోనే
ఏం చేయాలన్నా నా పైనే.

## పొడుపు పద్యాలు

అక్షరములు మూడు అడుగులరక్షలు
నడుము దీసి వేయనగును గూడు
రెండుజనులకెప్పుడుండంగవలయును
దీని భావమేమొ తెలియవలయు - పాదుక/పాక

బడిపదమ్ము మారువంటయిల్లనియొక్క
అక్షరమ్ము మార్చినంతలోనే - పాఠశాల/పాకశాల
పాపయన్న పదముపరగుమార్జాలమై
అత్తు ఇత్తు మార్చినంతలోనే - పిల్ల/పిల్లి

గుడిపదమ్ము మారి కుదురువాదాయమై
వ్యయముచేయనొక్కయక్షరమ్ము - ఆలయము/ఆయము
చుట్టమన్న పదము చూపడు గ్రద్దయై
అక్షరమ్మొకటియ అమరినంత - బందువు/రాబందువు

## మనభూమి

మనిషి నివసించే ఈ భూమి 460 కోట్ల సం॥ లకు పూర్వం ఏర్పడింది అంటారు. ఆ తరువాత ఎంతో పరిణామం చెంది, కొండలు, లోయలు, నదులు, సరస్సులు, సముద్రాలు, ఎడారులు ఇత్యాదులెన్నో ఏర్పడినవి. తరువాత సముద్రంలో ఏక కణజీవి అమీబా పుట్టింది. అది ఒకటి రెండుగా రెండు నాలుగుగా మారి జీవోత్పత్తికి మూలమైంది.



భూమి వైశాల్యం సుమారు 20 కోట్ల చదరపు మైళ్ళు ఇందులో 14 కోట్ల చదరపు మైళ్ళ ప్రదేశం నీటితో కప్పబడింది. మిగతా 6 కోట్ల చదరపు మైళ్ళ ప్రదేశంలో అమెరికా, రష్యా, చైనా, భారతదేశం లాంటి పెద్ద దేశాలెన్నో వున్నాయి.

భూమి బరువు టన్నుల్లో చెప్పాలంటే 6 అంకె పక్కన 21 సున్నాలు పెట్టాలి. అంత బరువుంటుందని తేల్చారు మన శాస్త్రజ్ఞులు. భూమి తనచుట్టు తాను ఒక గంటకు వేయి మైళ్ళ వేగంతో 23 గం. 56 ని॥ 4.09 సె॥లలో తిరుగుతూ, గంటకు 66,250 మైళ్ల వేగంతో సూర్యుని చుట్టూ 365 రో. 5గం॥.48ని. 45-51 సె॥లో తిరుగుతుంది.

భూమి సూర్యుని చుట్టూ తిరిగే పరిధి 20 కోట్ల మైళ్ళు భూమి 23 1/2$^0$ ఉత్తరాన తూర్పునకు వంగినది. భూమికి సూర్యుడు 9 కోట్ల 30 లక్షల మైళ్ల దూరములో ఉన్నాడు. ఈ దూరమే జీవులకు ప్రాణాధారమైంది.

మన భూమికి ఉపగ్రహం చంద్రుడు. భూమికి చంద్రుడు 2 లక్షల 38 వేల 840 మైళ్ళ దూరములో ఉన్నాడు. చంద్రుని మీద ఏముందో తెలుసుకోవాలనీ నీల్ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్, మైకేల్ కాలిన్స్‌లు జూలై 16 , 1969 లో (శాటర్న్) అపోలో 11 అనే నౌకలో వెళ్ళారు. అక్కడ రెండున్నర గంటలు తిరిగి దుమ్మూధూళీ ఉన్నట్లు తెలుసుకొని వచ్చారు. మనకు కనిపించే మచ్చలు అనేవి అక్కడ లోయలుగా గుర్తించారు.

తమాషా ఏమిటంటే ఈ విశాలమైన భూమి ఖగోళంలో ఒక ఇసుకరేణువంత అని విజ్ఞానశాస్త్రం చెబుతుంది.

## ఖగోళశాస్త్రం



రాత్రి సమయంలో ఆకాశంలోకి చూసినపుడు మనకు నక్షత్రాలు, చంద్రుడు వెలుగులు విరజిమ్ముతూ కనిపిస్తాయి. వీటితోపాటు మనసూర్యుడు, తోకచుక్కలు, గ్రహాలు అన్నింటిని కలిపి మనం ఖగోళం అంటున్నాం. ఈ ఖగోళంలో కనుచూపు పడేంతవరకు ఏవైపు చూసినా మనకు కనిపించే విశ్వం రెండు రకాలుగా వుంటుంది. పదార్థం, ప్రదేశం ( దీనిని మనం ఆకాశం అని పిలుస్తాము). విశాలమైన ఈ ప్రదేశంలో పదార్థం చాలా చిన్నది. అనగా బంగాళాఖాతంలో ఒక నీటి బిందువంత .

### నక్షత్రమండలం :

ఇందులో సుమారు 180 కోట్ల నక్షత్రాలు వున్నట్లు శాస్త్రజ్ఞులు తెల్పుతున్నారు. వీటిల్లో అనేకం సూర్యునికన్నా పెద్దవిగా ఉన్నాయి. సూర్యునికంటే అనేక రెట్లు దూరంగా వుండటం వల్ల అవి మిణుకు మిణుకు మంటూ కనిపిస్తున్నాయి. ఈ

నక్షత్రాలలో భూమికి దగ్గరగా వున్న నక్షత్రము పేరు "ప్రాగ్జిమా సెంట" ఇది భూమికి 25 లక్షల కోట్ల మైళ్ల దూరంలో వుంది.

రాత్రులందు మన కంటితో సుమారు 3 కోట్ల నక్షత్రాల వరకు మనం చూడగలుగుతున్నట్లు శాస్త్రజ్ఞులు వెల్లడిచేస్తున్నారు.

నక్షత్రాలన్నీ అత్యంత అధికమైన వేడి వాయువులతో కూడి వున్నాయి.

**సౌర కుటుంబం :**

సౌర కుటుంబంలో సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలు, వాటి చుట్టు తిరిగే ఉపగ్రహాలు, తోక చుక్కలు, ఉల్కలు ఉన్నాయి. అందు సూర్యుని చుట్టూ బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు తిరుగుతూ ఉన్నాయి. చంద్రుడు భూమి చుట్టూ తిరిగే ఉపగ్రహం. గ్రహాలు ఏవీ స్వయం ప్రకాశాలు కావు అనగా వెలుగును ప్రసరించేవి కావు.

**సూర్యుడు :**



సూర్యగోళం కూడా ఒక నక్షత్రమే. సూర్యుని మధ్య కొలత 13,84,000 కి.మీ.సూర్యగోళం భూమికి 9 కోట్ల 28 లక్షల మైళ్ళ దూరాన ఉన్నది. సూర్యుని ఉపరితలం నుండి జ్వాలలు ఒక సెకండుకు 200 నుండి 300 మైళ్ళ వేగంతో పైకి లేస్తుంటాయని అవి రెండు నుంచి అయిదు లక్షల మైళ్ళ పైకి పోతుంటాయని ఖగోళశాస్త్రజ్ఞుల పరిశోధనలో వెల్లడవుతుంది. సూర్యుని వెలుతురు 8ని. 16.6 సెకండ్ల కాలంలో భూమి కి చేరుతుంది. ఒక జెట్ విమానం ఆగకుండా గంటకు 1000 కి.మీ వేగంతో ప్రయాణిస్తే 17 సం॥లకు సూర్యుని చేరుకుంటాం.

**చంద్రుడు :**



చంద్రుని మధ్య కొలత 2160 మైళ్ళు. దీని కంటే భూమి 80 రెట్లు పెద్దది. భూమికి చంద్రుడు 2 లక్షల 38 వేల 8 వందల 40 మైళ్ళ దూరంలో ఉన్నాడు. చంద్రుని కాంతి 1-3 సెకండ్లలో భూమిని చేరుతుంది.

**అనంత మందిరానికి తాళం వేసి వుంటుంది - శ్రమ చిందించే చమటతోనే ఆ తాళం చెవి తయారవుతుంది.**

ఉపగ్రహం కావడం వలన చంద్రునికి రెండు గమనాలు ఉన్నాయి. (1) తనచుట్టు తాను తిరుగుతూ (2) భూమి చుట్టూ తిరుగుతూ దానితో పాటు సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉంది. కావున భూమితోపాటు చంద్రుడు కూడా సూర్యుని చుట్టూ 365 రోజులు తిరుగుతాడు.

**తోక చుక్కలు :**

గ్రహాల మాదిరిగా ఈ తోకచుక్కలు కూడా సూర్యుని చుట్టూ తిరుగుతాయి. ఇవి సూర్యునికి దగ్గరగా వచ్చినపుడు దానిలో వున్న దుమ్ము, ధూళి వాయువులన్నీ సూర్యుని వేడిమికి వ్యాకోచించి పొడవుగా సాగి తోకలా ఏర్పడుతాయి. బరువైన పెద్ద పెద్ద రాళ్ళు, కొండలు మాత్రం దూరంగా పోలేక గుండ్రంగా తలకాయలాగ ఏర్పడుతాయి.

ఒక్కోసారి తల వ్యాసం 150 వేల మైళ్ళుంటుంది. అప్పుడు తోక దాదాపు 50 లక్షల మైళ్ళ నుండి 10 కోట్ల మైళ్ళ వరకు వ్యాపించి ఉంటుంది. మనకు కనిపించేవి అనగా శాస్త్రజ్ఞుల అంచనాలకు వెయ్యి తోకచుక్కలు ఉన్నట్లు తేలింది. అయితే, ఇంకా లక్షల సంఖ్యలో ఉండి ఉంటాయని కూడా ఊహ .

# మహా సముద్రాలు

**సముద్రాలు :**

భూమిపైన 3 వంతులు నీరు ఆవరించి వుంది. ఈ భవనాలు, పట్టణాలు, దేశాలన్నీ మహా సముద్రాల ముందు చాలా చిన్నవి, ఎటువైపు చూసినా సముద్రమే కనిపిస్తున్నప్పుడు ఎవరికైనా అనిపిస్తుంది, ఈ సముద్రం ముందు మనిషి ఇసుక రేణువు లాంటి వాడని.

ఎంతో విశాలమైన ఈ సముద్రాలు భూమి పరిణామ క్రమంలో 150 కోట్ల సంవత్సరాల క్రితం ఉద్భవించాయి. సముద్రాలలో నేల ఎగుడు దిగుడుగా ఉంది. ఇందు పర్వతాలు, లోయలు ,చెట్లు, జంతువులు, ప్రవాహాలు కూడా ఉండి అపారమైన ఖనిజసంపద కలిగి వున్నాయని పరిశోధనలో వెల్లడైంది. ఒక్కోచోట సముద్రాలలో ఎవరెస్టు శిఖరాన్ని మించిన లోతు కూడా వుంటుంది.

**పసిఫిక్ మహా సముద్రం :**

దీని సగటు లోతు 2 1/2 మైళ్ళు. వైశాల్యం ఆరుకోట్ల 39 లక్షల 86వేల చదరపు మైళ్ళు. సముద్రాలలో అతి లోతైన ప్రాంతం ఫిలిప్పైన్స్ తీరంలో ఉన్న 'వినాండో' ప్రాంతం. ఇక్కడ 37 వేల 726 అడుగుల లోతు ఉంటుంది.

**అట్లాంటిక్ మహా సముద్రం :**

ఇది యూరప్ ఖండానికి ,అమెరికా ఖండానికి మధ్య వుంది. దీని వైశాల్యం ఎనిమిది కోట్ల పదహారు లక్షల అరవై రెండు వేల చ॥ కి.మీ. ఇందు మిక్కిలి లోతైన ప్రాంతం 'మిల్లినాకీ' డీప్ పోర్టరీకో గాడిలో వుంది. అక్కడ దీని లోతు ఎనిమిది వేల ఆరువందల నలభై ఎనిమిది మీటర్లు.

**హిందూ మహా సముద్రం :**

ఇది దక్షిణ ఆసియా, తూర్పు ఆఫ్రికా, 'గుడ్‌హోప్' అగ్రం నుండి లీయూనిన్ వరకు వ్యాపించి వుంది. ఇది ప్రపంచ మహా సముద్రాలలో అతి ప్రాచీనమైనది. దీని వైశాల్యం ఏడుకోట్ల యాభై తొమ్మిది లక్షల తొంభై వేల చ॥ కి. మీ. దీనిలో లోతైన ప్రాంతాలు 'సుందాగాడి' ఒకటి. దానిలోతు ఏడువేల నాలుగు వందల యాభై అయిదు మీటర్లు. మరొకటి హర్తాన్ 6,459 మీటర్లు.

## వింత జలచరాలు

**చేపలు :**

జలచరాలు అనగానే మనకు ముఖ్యంగా జ్ఞాపకానికొచ్చేవి చేపలు. వీటిల్లో సాధారణమైనవే గాకుండా మనుషుల్ని ఆశ్చర్యపరిచే ఎన్నో వింత చేపలు కలవు. వాటి గూర్చి తెలుసుకుందాం.

**బురదగిడస :**



ఈ చేపకు రొమ్ము మీది రెక్కలు బలపడిన తరువాత ఆహారం కోసం అది ఇసుకలోను, బురదలోను వెతికేటప్పుడు ఆ రెక్కలు దానికి పాదాలుగా ఉపయోగపడతాయి. చేపలన్నింటిలో ఈ ఒక్క చేపకే నేల మీద, నీటిలోనూ జీవించే అవకాశం ఉంది.

**ఎగిరే చేప :**



పక్షుల మాదిరిగా దక్షిణ అమెరికా దేశాల నదులలో ఎగిరే చేపలు ఉన్నాయి. ఇవి బలమైన రెక్కలు, తోకలు కలిగి ఉంటాయి. చేపలు పట్టే వారి నుండి ఇవి అతివేగంగా తప్పించుకుంటాయి. ఇవి గాలిలో దూసుకుపోయి తిరిగి నీటిమీద వాలుతాయి. ఆ విధంగా మూడు వందల నుండి వెయ్యి అడుగుల ఎత్తువరకు ఎగురుతూ గంటకు 40 మైళ్ల వేగంతో ప్రయాణించగలుగుతాయి.

**బుద్ధి హీనుడు చివరి దశలో ప్రయత్నం చేస్తాడు - బుద్ధి... తొలిదశలోనే ప్రయత్నం చేస్తాడు.**

**ఎగబాకుడు చేప :**

ఇది చెట్టు ఎక్కగలదు. ఒక సరస్సు నుంచి మరొక సరస్సుకు వలస పోతుంది.

**ప్రొటాప్టెరస్ అనెక్టెన్స్ :**

ఈ చేప నెలల తరబడి నీటి ముఖం చూడకుండా జీవించగలదు. ఈ చేప వేసవి కాలమందు బురదలో గొట్టం ఆకారంలో ఒక రంధ్రం చేసుకుని అందులో నివసిస్తుంది.

**బంతి చేప :**

ఏదైనా ప్రమాదం ఎదురైనపుడు ఈ చేప తన శరీరాన్ని బంతిలాగా చేసి నీటిపై శవంలాగా తేలుతూ తనని తాను రక్షించుకుంటుంది.

**విషపు చేప :**

థారన్ ఫిష్ అనే చేప చాలా విషపూరితమైంది. జపాన్ సముద్రతీరంలో జీవిస్తుంది. దీనిని తిన్న వ్యక్తి వెంటనే చనిపోతాడు. అలాగే జెల్లీ ఫిష్ ఆస్ట్రేలియా తీరంలో ఉంటుంది. ఇది కుడితే మనిషి 2, 3 నిమిషాల్లో చనిపోతాడు.

**విద్యుత్ చేపలు :**

దాదాపు 250 రకాల చేపలకు కరెంటును ప్రసరించే అవయవాలు ఉన్నాయి.



'ఈల్ 'అనే చేప బ్రెజిల్ తీర ప్రాంతంలో ఉంటుంది. 450 నుండి 650 వోల్టుల దాకా ఇది విద్యుత్తును కలిగి వుంటుంది. ముట్టుకుంటే కరెంట్ షాక్ తగిలి జంతువులు చనిపోతాయి. మనుషులు కూడా చనిపోతారు. ఇది ఒక్కోసారి 50 లక్షల నుండి 1 కోటి వరకు గుడ్లు పెడుతుంది. అవి కొద్ది సమయంలోనే పిల్లలుగా మారుతాయి.

**కాండిరూ :** ఈ చేప దక్షిణ అమెరికా బ్రెజిల్ తీర ప్రాంతంలో ఉంటుంది. నదులలో స్నానాలు చేసే మనుషుల మూత్రనాళాలలోకి ప్రవేశిస్తుంది. దీనికి మూత్రం వాసన అతి యిష్టం. దానితో మూత్ర విసర్జన అవయంలోకి చేరుతుంది. ఆ చేప చొరబడగానే వెంటనే ఆపరేషన్ చేయించుకొని తీయించుకోవాలి. బలవంతంగా బయటికి లాగితే దాని పొలుసుల గట్టిదనం ద్వారా మూత్రనాళం చీల్చుకొని పోతుంది.

**రంగులు మార్చే చేప :** ఇది సముద్రం లోతైన ప్రాంతంలో జీవిస్తుంది. నల్లని నీటి తొట్టిలో వేస్తే నల్లగాను, తెల్లని నీటి తొట్టిలో వేస్తే తెల్లగాను మారిపోతుంది. ఈ విధంగా అది పరిసరాలను బట్టి రంగులు మారుస్తుంది.

**గాలం చేప :** నీటి తలమీద ఒక గాలం దాని చివర ఒక ఎర ఉంటాయి. చేప బురదలో దాక్కొని ఉంటుంది. పైన వున్న ఎరను చూసి పట్టుబడిన ఏ జీవినైనా

ఆహారంగా తింటుంది. ఈ గాలం చేపలలో మగచేప ఆడచేప శరీరాన్ని అంటి పెట్టుకొని ఉంటుంది. ఆ రెంటికి మధ్య బొడ్డుతాడు బంధం ఉంటుంది. ఆడచేప ఆహారం సంపాదించి బొడ్డుతాడు గుండా మగచేపకు అందిస్తూ దానిని సాకుతుంది. కొన్నాళ్లకు మగచేప నోటికి పనిలేకపోవడంతో అది అంతరించిపోతుంది. అలాగే ఆడచేప మరణిస్తే అంటిపెట్టుకొని ఉన్న మగ చేప కూడా మరణిస్తుంది.

**విలుకాడు చేప :**



ఇది నీటిపైభాగాన కాని, గడ్డి మీద గాని ఏదైనా ఈగ వాలితే ఈ చేప కొంత సమీపంగా చేరి గురిచూసి తన నోటి నుంచి నీటి బిందువును తుపాకి గుండులా వదల్తుంది. అది తగిలిన మరుక్షణం ఈగ చనిపోగానే దానిని తినేస్తుంది.

**నోటిలో పొదిగే చేప :** టిలాపియా అనే రకం చేపలు నోటిలో గుడ్లను పెట్టుకొని పొదుగుతాయి. పొదుగుతున్న సమయంలో ఆ చేపలు ఏ ఆహారం తీసుకోవు. ఇది ఆడచేప మాత్రమే చేస్తుంది.

**కొపైనా ఆర్నాల్డీ :** ఇందులో ఆడచేప నీటి బయట, నీటికి పైన వాలి వున్న చెట్ల కొమ్మల ఆకుల అడుగుభాగాన గుడ్లు పెడుతుంది. ఆడచేప వెళ్లిపోగానే మగచేప నీటిపైకి వచ్చి తన తోకతో నీటి బిందువులను ఆ గుడ్లమీదకు ఎగచిమ్ముతూ వుంటుంది. ఆలా రెండు మూడు రోజులు చేసిన తరువాత ఆ గుడ్ల నుండి పిల్లలు వెలువడి నీటిలోకి చేరుతాయి.

**సాలమన్, ఈల్ చేపలు :** యూరప్ నదుల నుండి 4,800 మొదలు 6,000 కి.మీ దూరం ప్రయాణించి, అమెరికా తీరంలో గల బర్మోడా ప్రాంతం అగాథంలోకి చేరి అక్కడ గుడ్లు పెట్టి చనిపోతాయి. ఆ గుడ్లులోంచి వచ్చిన పిల్లలు తమ తల్లులు ఏ మహా సముద్రం నుంచి ఏ సరస్సు నుంచి, ఏ చెరువు నుంచి వచ్చాయో అట్టి చోటుకు చేరి జీవిస్తాయి.

**గొట్టం చేప :** గుడ్లను మగచేప కడుపునకు అతికించే వింత ఆచారం ఉంది ఈ చేపలల్లో. పొదగబడేదాకా ఆ గుడ్లు తండ్రి కడుపును అంటిపెట్టుకునే ఉంటాయి. పోతే నీటి గుర్రం అనే చేపల్లో ఆడ చేప పెట్టిన గుడ్లు మగ చేప కడుపు దగ్గర ఉండే సంచిలో ఉంటూ అక్కడే పొదగబడి వాటి నుండి పిల్లలు బయటికి వస్తాయి.

**కత్తిచేప :**



ఇది మొదట ఆడచేపగా జీవితం ప్రారంభించి చాలా చేప పిల్లల్ని కంటుంది. ఆ తరువాత కొన్నేళ్లకు అది మగచేపగా మారి ఇతర ఆడ చేపలతో తిరిగి పిల్లలని కని తండ్రిగా మారుతుంది.

**సీ ఆట్టర్స్ :** ఇది సముద్ర జీవుల్లో ఉండే అతి తెలివైన జీవి. తమ పిల్లల నుండి విడిపోకుండా ఉండడానికి రాత్రి సమయంలో నిద్రించేటప్పుడు సముద్రపు నాచుతో తల్లి, పిల్లలు అన్నీ కట్టగా కట్టేసుకొని పడుకుంటాయి. ఉదయం లేచాక ఈ కట్లు విప్పు కుంటాయి. వీటికి తమ సంతానం అంటే ఎంతో ప్రేమ.

**తిమింగిలం :**





ఇది సాధువులా జీవిస్తుంది. ఒకప్పుడు ఇది నేల మీద నివసించేది. క్రమ క్రమంగా నీటికి చేరువై నీటిజీవిగా మారింది. తిమింగిలాలు ప్రతి పది, పదిహేను నిమిషాలకు ఒకసారి సముద్రంపైకి వచ్చి గాలి పీల్చుకొని పోతుంటాయి. ఇది గాలి పీల్చుకోకుండా 75 నిమిషాలు ఉండగలదు. వీటిల్లో పళ్లు ఉన్నవి, పళ్లు లేనివి అనే రెండు రకాలు వున్నాయి.

పళ్లు లేనివి 110 అడుగుల పొడుగుతో 150 టన్నుల బరువు ఉంటాయి. అనగా ఒక ఏనుగు వీటి కడుపులో హాయిగా నిలబడగలదు. వాటి వరాల్లోంచి చిన్న పిల్లలు నడిచిపోగలరు.

పళ్లున్న వాటిలో స్పెర్మ్ తిమింగిలం ఒకటి. ఇది 60 అడుగుల పొడవు ఉంటుంది. ఇది ఆహారాన్ని సముద్రం అడుక్కు తీసుకువెళ్లి తింటుంది. దీని ఎముకలు ఒకటిన్నర టన్నుల బరువు ఉంటాయి.

తిమింగలం శరీరంలో మూడోవంతు తల వుంటుంది. అది ఒక సారి నోరు తెరిస్తే రెండు, మూడు టన్నుల నీరు లోపలికి పోతుంది. దీని తోక తెడ్డులాగా వుంటుంది. కోపం వస్తే తోకతో కొడ్తుంది. ఆ దెబ్బకు నౌకలు ముక్కలు, ముక్కలు అవుతాయి.

తిమింగిలం గంటకు 22 మైళ్ళ వేగంతో ఈదుతుంది. దీని వయస్సు 50 సంవత్సరాలు. బాగా పెరిగిన తిమింగిలం ఒక పెద్ద 10 అంతస్థుల భవనం వలె ఉంటుంది. దాని గుండె కారంత పెద్దగా ఉంటుంది. కొత్తగా పుట్టిన పిల్ల ఎనిమిదివేల పౌండ్ల బరువు ఉంటుంది. తిమింగలానికి చూపు తక్కువగా ఉంటుంది. వినికిడి శక్తి, చురుగ్గా ఉంటుంది.

**డాల్ఫిన్ :**



ఇది సముద్ర గర్భంలోని తిమింగిలం జాతికి చెందినది. ఇది అన్ని సముద్ర ప్రాణుల కన్నా అతి తెలివైనది. మనిషికంటే దీనిబలం చాలా అధికం. అనేక పార్లు సముద్రంలో పడిన

మనుషుల్ని డాల్ఫిన్ ఒడ్డుకు చేర్చిన సంఘటనలు ఉన్నాయి. వీటితో మనిషి చాలా సన్నిహితంగా స్నేహం చేయగలుగుతాడు. ఇవి తొమ్మిది మీటర్ల ఎత్తువరకు ఎగురుతుంటాయి. తోక మీద నిలబడి నాట్యం కూడా చేస్తాయి. డాల్ఫిన్‌లు పిల్లలను కని పాలిచ్చి పెంచుతాయి. ఇవి నదులలో కూడా జీవించగలవు.

**ఆక్టోపసి :** ఇది లోతైన సముద్రాలలో ఉంటుంది. దీనికి ఎనిమిది పగ్గాల్లాంటి చేతులు ఉంటాయి. ఇది దాదాపు 30 అడుగుల వరకు ఉంటుంది. దీని పాదాలకు ఉన్న గిన్నెలాంటి వాటితో పట్టుబడ్డ జంతువు రక్తాన్ని పీల్చివేస్తుంది. అమెరికా స్లాండా జలసంధిలో వున్న ఆక్టోపసిలు చిన్న పిల్లల్ని చంపివేసిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి.



**స్క్విడ్ :**



దీని పొడవు 50 అడుగులు. ఇది భయంకరమైన జంతువు. ఇది నీటిని వెనుకకు తోస్తూ జెట్ విమానంలా దూసుకుపోతుంది.

# నదులు

**కావేరినది :** ఇది దక్షిణ భారతదేశంలోని ప్రముఖమైన నదులలో ఒకటి. కర్ణాటకలోని పడమటి కనుమలలో ' తల కావేరి ' అనే చోట పుట్టి ఆగ్నేయ దిశగా ప్రయాణించి తమిళనాడు రాష్ట్రంలో ప్రవేశించి, తిరుచిరాపల్లి వద్ద శ్రీరంగం దగ్గర పాయలుగా విడిపోయి బంగాళాఖాతంలో కలుస్తుంది. దీని పొడవు 560 కి.మీ. కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలకు ఇది ప్రధానమై, పంటనీటికి మూలాధారమైనది.

**కృష్ణానది :** దక్షిణ భారతదేశంలోని పడమటి కనుమలలో సముద్ర మట్టానికి 1230 మీటర్ల ఎత్తులో మహాబలేశ్వరం వద్ద పుట్టి దక్షిణంగా మహారాష్ట్రలో పయనించి ఉపనది అయిన భీమాను కలుపుకొని తూర్పుగా పయనించి కర్ణాటక ద్వారా ఆంధ్రలో ప్రవేశించి తుంగభద్ర, మూసీ ఉపనదులను కలుపుకొని నల్లమల అడవులలో నుండి విజయవాడ వద్ద తీరమైదానమును చేరుకొని మరికొంత దూరం ప్రవహించి మూడు పాయలై బంగాళా ఖాతంలో కలుస్తుంది. దీని పొడవు 1220 కిలో మీటర్లు.

**తుంగభద్రా నది :** తుంగ - భద్ర అను రెండు నదుల కలయికే తుంగభద్రా నది. వరాహ పర్వతశ్రేణిలోను, గంగమూల అనే చోట ఈ నదులు పుట్టి ఈశాన్యం వైపుగా ప్రవహించి ఒకే నదిగా మారి కర్ణాటక దాటి కర్నూలు దగ్గరలో కృష్ణానదిలో కలుస్తుంది. దీని పొడవు 640 కి.మీ.

**గోదావరి నది :** మహారాష్ట్రలోని పడమటి కనుమలలో సముద్రమట్టానికి 650 మీటర్ల ఎత్తున " నాసికా త్రయంబకం " వద్ద చిన్న ఊటగా ఆరంభమై రాను రాను పెద్దదై నిజామాబాదు జిల్లాలో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించి పాపికొండ కనుమల (రాజమండ్రి పైన) ద్వారా మైదానంలోకి చేరి 'ధవళేశ్వరం' వద్ద రెండుగా చీలుతుంది. తరువాత తూర్పుదిశగా ప్రవహించే నీటిపాయ ' గౌతమి ' నది పేరుతోను, మరొక పాయ 'వశిష్ఠ' పేరుతోను పశ్చిమానికి ప్రవహిస్తూ విడిపోతాయి.

గౌతమీనది తిరిగి పాయలై కాకినాడ వద్ద పశ్చిమానికి మళ్ళి , కోనసీమలో ప్రవేశించి సముద్రంలో కలుస్తుంది. ' వశిష్ఠ' నది పశ్చిమంగా ప్రవహించి నరసాపురం సమీపంలో బంగాళాఖాతంలో కలుస్తుంది. నాసిక్ నుండి నరసాపురం వరకు గోదావరి నది పొడవు 1440 కి.మీ.

**గంగానది :** హిమాలయ పర్వతాలలో సముద్రమట్టానికి 3, 139 మీ. ఎత్తున ఒక హిమ గుహ (గంగోత్రి) లో పుట్టి ఆగ్నేయంగా ఉత్తర ప్రదేశ్, బీహార్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల నుండి బంగ్లాదేశ్ లోనూ ప్రవహించి సంగమ స్థానం చేరి బంగాళా ఖాతంలో కలుస్తుంది. దీని పొడవు 2, 478 కిలో మీటర్లు.

**బ్రహ్మపుత్రా నది :** ఇది భారతదేశానికి ఈశాన్య ప్రాంతంలో ప్రవహించేనది. హిమాలయాల్లో పుట్టి టిబెట్‌లో ప్రవహించి "నామ్చాబురావా ' వద్ద వంపు తిరిగి 120 ఉపనదులను కలుపుకొని గోరాకొండలు దాటి దక్షిణానికి మళ్ళి గొలుందో వద్ద గంగానదిలో కలుస్తుంది. తిరిగి 725 కిలోమీటర్లు అస్సాం రాష్ట్రంలో ప్రవహిస్తుంది. దీని పొడవు 2880 కిలో మీటర్లు.

**సింధునది :** ఇది హిమాలయాల్లో టిబెట్టులో పుట్టి కాశ్మీర్, పంజాబ్, సింధ్ రాష్ట్రాలలో ప్రవహించి పాకిస్థాన్ కరాచీ సమీపంలో అరేబియా సముద్రంలో కలుస్తుంది. సింధూనది పొడవు 2880 కిలో మీటర్లు. హరప్పా, మొహెంజొదారో ప్రాంతాల్లో ఈ సింధునదీ లోయల్లోనే గొప్ప నాగరికత వెలసింది.

**తపతీ నది :** ఇది తూర్పున సాత్పురా పర్వతశ్రేణిలో పుట్టి ' ఖాన్ ' ప్రాంతంలో గుజరాత్ రాష్ట్రంలో ప్రవేశించి సూరత్ దగ్గర అరేబియా సముద్రంలో కలుస్తుంది. దీని పొడవు 720 కిలో మీటర్లు.

**నర్మదానది :** మధ్యప్రదేశ్‌లో 'అమరకుండిక' వద్ద పుట్టి పశ్చిమంగా ప్రవహించి 'గుజరాత్ ' రాష్ట్రం చేరి బ్రోట్ వద్ద సింధుశాఖలో పడుతుంది. ' రుద్రపువ్వ', అయోనిజ ' అని పేర్లున్న ఈ నది వింధ్యా సాత్పురా పర్వతాలలోని కీకారణ్యాల గుండా ప్రవహించి చివరకు ' అరేబియా సముద్రంలో కలుస్తుంది. దీని పొడవు 1, 370 కిలో మీటర్లు.

**ఏ పరిస్థితులలో ఉన్నామనేది కాదు విషయం - ఏ దిక్కుగా సంచరిస్తున్నామనేది గొప్ప విషయం.**

# సుప్రసిద్ధ క్షేత్రాలు



**తిరుపతి :**

ఆంధ్రప్రదేశ్‌లో భక్త జనులకు ఇలవేల్పుగా శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం చిత్తూరు జిల్లాలోని తిరుపతిలో ఏడు కొండలపైన నెలకొని వుంది. స్వామిని బాలాజీ, శ్రీనివాసులు, ఏడుకొండలవాడు, వడ్డికాసులవాడు అని భక్త జనం పిలుస్తారు. ఇది సుప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రం. ఏడు కొండల పై ప్రాంతాన్ని తిరుమలగాను, క్రింది ప్రాంతాన్ని తిరుపతిగాను పిలుస్తుంటారు.

చరిత్రను బట్టి క్రీ. శ. 10వ శతాబ్దం నుండి ఈ ఆలయం అత్యంత శక్తివంతమైన పుణ్యక్షేత్రంగా విలసిల్లుతూందని తెలుస్తుంది. మరియు 16వ శతాబ్దిలో ఈ ప్రాంతాన్ని పాలించిన విజయ నగర ప్రభువు శ్రీ కృష్ణ దేవరాయలు తిరుమల దేవాలయాన్ని అభివృద్ధి పరిచినట్లుకూడా చరిత్ర పరిశోధకులు వ్రాసినారు.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తిరుమల తిరుపతి దేవస్థాన కమిటి (టి. టి. డి ) ని ఏర్పాటు చేసి దానికి తిరుపతి క్షేత్రం కార్యకలాపాలను అప్పగించింది. నిత్యం వేలాదిమంది భక్తులు తిరుపతిలోని తిరుమల పుణ్యక్షేత్రాన్ని సందర్శించి వెల్తుంటారు. తిరుమలకు సమీపంగా ఆకాశగంగ, పాపనాశనం, పాండవ తీర్థం, గోగర్భం వంటి దర్శనీయ స్థలాలు కూడా కలవు. క్రింది తిరుపతిలో గోవింద రాజ స్వామి ఆలయం, కోదండరామస్వామి, కపిలేశ్వర స్వామి ఆలయాలు కూడా పుణ్యక్షేత్రాలుగా నిలిచినవి. తిరుపతికి 4 కి.మీ దూరంలో ఉన్న తిరుచానూరునే అలివేలు మంగాపురం అని పిలుస్తుంటారు. అక్కడ పద్మావతీ దేవి గుడి కలదు.



**శ్రీ శైలం :** ఇది ఎంతో పురాతన మైనది. ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలలో ఉన్నది ఈ పుణ్యక్షేత్రం. ఈ చోట పార్వతిని, భ్రమరాంబగాను, పరమ శివున్ని, మల్లికార్జున స్వామిగాను పూజిస్తారు.

అద్వైత మత స్థాపకులు శ్రీ ఆది శంకరులు ఇక్కడ శ్రీ చక్రం ప్రతిష్ఠ చేశారు. మహారాష్ట్ర వీరుడు శ్రీ ఛత్రపతి శివాజీ ఈ దేవాలయ సంరక్షణకు పాటుపడినారు. ప్రతి సంవత్సరం మహా శివరాత్రి ఉత్సవం రోజున ఈ చోట పెద్ద ఎత్తునపూజలు నిర్వహిస్తారు. లక్షలాది మంది భక్తులు ఆ రోజు శివ పార్వతులను దర్శనం చేసుకుంటారు.

**భద్రాచలం :** దక్షిణ భారతదేశంలోని ప్రధానమైన శ్రీరామ పుణ్యక్షేత్రాలలో ఇది ప్రముఖమైనది. ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లాలో గోదావరి నదీతీరాన, ఈ క్షేత్రం ఉంది. భద్రుడనే భక్తుని కోరికపై శ్రీరాముడిచట వెలిశాడు.



చైత్రశుద్ధ నవమి రోజు ఇక్కడ శ్రీ సీతారాముల కళ్యాణం మహోత్సవంగా వైభవోపేతంగా జరుగుతుంది. దేశం పలు ప్రాంతాల నుండి లక్షలాది భక్తులు వచ్చి ఈ ఉత్సవాన్ని దర్శిస్తారు.



**శ్రీ కాళహస్తి :** ఇది సుప్రసిద్ధ శైవ క్షేత్రం తిరుపతికి సమీపంలో ఉంది. శ్రీ అనగా సాలెపురుగు. కాళం అనగా సర్పం. హస్తి అనగా ఏనుగు అని అర్థం. గతంలో ఇవి మూడూ శివుడిని పూజించేవి కైవల్యం చెందినవి. కాబట్టి వీటి మూడింటిని కలిపి శ్రీ కాళ హస్తిగా పేర్కొన్నట్లు చరిత్రకారులు చెపుతున్నారు. ఈ క్షేత్రం ముఖ్యంగా శ్రీ కాళహస్తీశ్వరుడు; శివభక్తులకు పరమదైవం. మహా శివరాత్రి రోజు ఇచ్చట వైభవోపేతంగా ఉత్సవం జరుగుతుంది.

# మంచి కథలు

## మచ్చ

ఒక కుటుంబంలో లేక లేక పుట్టిన వాని కొడుకు చెడు పనులు చేయటం మానలేదు. తల్లి, తండ్రి ఎన్నిసార్లు చెప్పినా తోటి పిల్లల్ని కొట్టడం, తిట్టడం, ఇతరుల వస్తువులను దొంగలించడం, అందరితో తగవు పడటం చేస్తున్నాడు. తండ్రి చేసేది లేక విసుగెత్తి ఆ అబ్బాయి తప్పు చేసినప్పుడల్లా ఒక మేకును వారి ఇంటి తలుపునకు కొట్టడం ప్రారంభించాడు. ఆ విధంగా ఆ అబ్బాయి ఏదో ఒక తప్పు చేయడం అతని తండ్రి తలుపునకు మేకులు కొట్టడం దాంతో తలుపు అంతా మేకులతో నిండిపోయింది.

ఒక రోజు ఆ అబ్బాయి తలుపును చూసి 'నాన్నా తలుపుకన్నీ మేకులు కొట్టావెందుకు ' అని అడిగాడు.

' నీవు తప్పుచేసినప్పుడల్లా ఒక మేకు కొడుతూ పోయాను ' అన్నాడు తండ్రి.

' అయితే నేను ఇన్ని తప్పులు చేశానా ? '

' అంతేకదా మరి '

' మరి మంచి పనులు చేస్తే '

' మంచి పనులు చేస్తే ఒక్కో మంచిపనికి ఒక్కోమేకు తొలగిస్తూ పోతాను' అన్నాడు తండ్రి.

ఆ విధంగా కొంతకాలానికి ఆ అబ్బాయిమంచి పనులు చేయడం తండ్రి తలుపునకున్న మేకులన్నీ లాగివేయడం జరిగింది.

ఒక రోజు ఉదయాన కొడుకు వచ్చి " నాన్నా నేను మంచి పనులు చేశాను, మంచిగా మారిపోయాను అని మీరే అన్నారుగా అందుకే మేకులు కూడా లాగేసారు

కదా ! మరి ఈ తలుపునకు గుంటలన్నీ అలాగే వున్నా యేమిటి " అని అడిగాడు. అప్పుడు తండ్రి ఈవిధంగా సమాధానం ఇచ్చాడు.

" చూడు బాబు ! మనిషి తప్పుచేయకుండానే వుండాలి. ఒకవేళ చేసిన తప్పును సరిదిద్దుకున్నా ఆ తప్పు తాలుకూ మచ్చ అపవాదు అనేది జీవితంలో అలాగే నిలిచిపోతుంది ". అన్నాడు.

ఆ అబ్బాయి నిశ్శబ్దంగా తలవంచుకొని నిల్చుండిపోయాడు.

# స్నేహం

హనుమయ్య సీతారామపురం అనే గ్రామంలో పేరు పొందిన ధనికుడు. అతనికి ఒక్కడే ఒక కొడుకు. పేరు రవి. స్నేహితులతో జులాయిగా తిరగడం ఇష్టమొచ్చినట్టుగా డబ్బు ఖర్చు పెట్టడం చేస్తున్నాడు. అది సహించని తండ్రి అతన్ని అనేకసార్లు మందలించాడు. ఒకరోజు భార్యను పిలిచి " వీడికి మూడు రోజులు ఇంట్లో అన్నం పెట్టకు, చిల్లిగవ్వ కూడా చేతికి ఇవ్వకు ఎంతసేపూ స్నేహితులు, సంబరాలు, అంటూ వాడు ఇష్టమొచ్చినట్లు తిరుగుతున్నాడు " అన్నాడు.

ఒకరోజు గడిచింది. ఆ అబ్బాయి ఇంట్లో వుండలేక ఊరి గుడి మెట్లపై కూర్చున్నాడు. రోజూ కలిసే స్నేహితులు వచ్చి, తన పరిస్థితిని గమనించి వెళ్ళిపోయారు. ఆవిధంగా రెండు రోజులు గడిచాయి. ఆకలితో ముఖం పీక్కుపోయింది. మాట్లాడేవారు కరువైనారు. ఆ పరిస్థితిలో తండ్రి గుడి దగ్గరకు చేరుకొని మెట్లపై పడుకున్న రవిని లేవదీసుకొని ఇంటికి వెళ్ళాడు. భార్యతో చెప్పి అన్నం తినిపించి ఆ రాత్రి పన్నెండు గంటలకు కొడుకును తీసుకొని పక్కఊరికి వెళ్లి ఒక ఇంటి తలుపు తట్టాడు. ఆ ఇల్లు అతని స్నేహితునిది. కొద్ది సేపటికి తలుపు తెరిచి లోపలికి ఆహ్వానించాడు ఒక వ్యక్తి. తండ్రీ కొడుకుల్ని కూర్చోమని చెప్పి లోపలికి వెళ్లి కొద్ది సేపట్లో ఒకచేతిలో పదివేలు నగదు, భార్య మెడలోని బంగారు గొలుసు, చేతిలో కత్తి పట్టుకొని తలపాగా చుట్టుకొని వచ్చి నిల్చున్నాడు. " ఇంత రాత్రి నీవు వచ్చినావంటే నీకు ఏ అవసరముందో ఇదిగో ఈ డబ్బుంది అదిసరిపోదంటే ఈ బంగారు గొలుసుంది. లేదా నీకు అండగా నా అవసరం వుంటే వెళదాం పదా నేను రావడానికి సిద్ధంగా ఉన్నాను. నీకే ఆపద వచ్చినా చెప్పు. నా ప్రాణాలు పోయేంతవరకు నీకు హాని కానివ్వను " అన్నాడు. దానికి అతడు ఏమీలేదు ఊరకే వచ్చాను వీడు మా అబ్బాయి అని పరిచయం చేసి ఆ రాత్రి అక్కడనే పడుకుని ఉదయాన్నే ఇల్లు చేర్చుకున్నారు. అప్పుడు అన్నాడు తండ్రి కొడుకుతో "చూశావా ! రెండు రోజులు నీవు వస్తున్నా నీ స్నేహితులు పట్టించుకోలేదు. కనీసం నీకు మంచినీళ్ళు పోసినవాడు కూడా లేడు. ఇంతవరకు నీ డబ్బుల కోసం నీ చుట్టూ చేరి తమ తమ అవసరాలు తీర్చుకున్నారు తప్ప ఏ ఒక్కడు వాళ్ళ ఇంటికి తీసుకువెళ్లలేదు. స్నేహమంటే ఎదుటివాడికున్నది

వాడుకోవడం కాదురా తనకున్నది కష్టమైనా, ఆనందమైనా తలాయింతా పంచుకోవడం, మనతప్పులను మనకు చెప్పి మన అభివృద్ధికి తోడ్పడేది స్నేహం. నా స్నేహితున్ని చూశావుగా " అన్నాడు. రవి తన తప్పును తెలుసుకున్నాడు.

## కాలం

లత అనే ఒక అమ్మాయి విచిత్రంగా అందంగా మెరిసే రాళ్ళను ఏరుకొని తన ఒడిలో పోసుకొని ఒక కొలనుపక్క కూర్చొని ఏదో ఆలోచిస్తూ ఒడిలోని ఒక్కోరాయిని కొలనులోకి విసురుతూ గుండ్రంగా లేచే అలలను చూస్తూ ఆనందిస్తుంది. అలా కొద్దిసేపు రాళ్లు విసిరి ఏదో జ్ఞాపకం వచ్చి ఇంటిదారి పట్టింది. ఒడిలో మిగిలివున్న రాళ్ళను చేతిలో పట్టుకొని ఒకచేత్తో పుస్తకాలు పట్టుకొని తాపీగా నడుస్తూవుంది. దారిలో లతకి తెలిసిన ఆవిడ కలిసింది. " ఏం లతా ఎటునుండి రాక ' అంది. "మాతోట దగ్గరికెళ్లి చదువుకొని వస్తున్నా " అంది లత.

" అవేంటి " అనడిగిందావిడ లత చేతివంక చూస్తూ

" ఇవా చాలా అందంగా వుంటేను ఏరుకున్నానులే "

" ఏదీ నన్ను చూడనీ " అంటూ చేతిలోని రాళ్లను తీసుకొని చూసింది ఆవిడ.

"అరెరె ఇవి వజ్రాలు కదా . ఎక్కడ దొరికాయి అంది."

ఆశ్చర్యపోయింది లత. అప్పటివరకు లతకు వజ్రాలు ఎలా వుంటాయో తెలియదు.

" అయ్యో! నేను చాలా ఏరుకున్నాను కానీ అవన్నీ కొలనులోకి విసిరాను' '. అని బాధపడింది లత. " సరేలే ఏం చేస్తావు. వీటినైనా తీసుకొనివెళ్లి జాగ్రత్త పరుచు " . అంది ఆవిడ.

ఇంటికెళ్లి బాధపడుతూ కూర్చుంది లత. అది చూసి తల్లి విషయం తెలుసుకొని ' చూడమ్మా అవి రత్నాలైనా, వజ్రాలైనా ప్రస్తుతం బాధపడి సమయం వృధా చేయకు నీకు జరిగిన సంఘటన నీకు మంచి పాఠం చెపుతుంది. నీవు విసిరేసినవి వజ్రాలే కాదు అవి నీ జీవితంలోని నిమిషాలు, గంటలు వాటిని వృధా చేసుకొన్నావు. ఇలాగే కాలాన్ని వృధా చేసుకొంటే రేపు బాధపడాల్సి వస్తుంది. కాబట్టి వజ్రాల కన్నా విలువైనవి కాలంలోని సెకనులు, నిమిషాలు అని ఎంచి ఇక ముందు సమయం నిరర్థకం చేయకు. చదవాల్సింది చదువు తోట దగ్గరికెళ్లి చదువుకుంటావని అనుకుంటే ఇదా నీవు చేస్తున్నవని," అని హెచ్చరించింది తల్లి.

తన జీవితంలో ఇక ఏ నిమిషాన్ని వృధా చేయకూడదని నిర్ధారించుకుంది లత.

## తండ్రి - కొడుకు

" ఒరేయ్ నీకు బుద్ధుందా ?"

" ఏంటి నాన్న నేను ఏమన్నాను ?"

" అసలు నీకు ఎందుకురా ఊరిలో గొడవలన్నీ ?"

" - - - "

" చూడు జాగ్రత్తగా ఉంటేనే మంచిది "

" ఆ ( సరేలే "

ఒక కుటుంబంలో తండ్రి కొడుకులు రోజూ ఈ విధంగా ఏదో ఒక విషయమై తీవ్రంగా సంభాషించుకోవడం జరుగుతుంది. అలా తండ్రి మందలించడం కొడుకు నిశ్శబ్దం కావడం జరుగుతూంది. దీంతో కొడుకులో తండ్రి పట్ల ఒక విధమైన అసహ్యం, హేయభావం మొదలయింది. అది కాస్తా పెరిగి పెరిగి తండ్రి అంటేనే కోపాన్ని ద్వేషాన్ని పెంచుకొన్నాడు కొడుకు.

సహజంగా వయస్సు భేదంతోపాటు సనాతన భావాలున్న తండ్రికి ఆధునిక భావాలున్న కొడుక్కు మధ్యన ప్రతి విషయంలో పొంతన కుదరకపోవడంతో వారి మధ్య ముఖ్యంగా కొడుకు ఉద్దేశంలో తండ్రి అంటేనే శత్రుభావన నాటుకు పోయింది. దాంతో ఎలాగైనా తండ్రి అడ్డు తొలగించుకోవాలని తండ్రిని చంపాడానికి నిర్ణయించుకొన్నాడు.

ఒక రోజు రాత్రి తండ్రి పడుకొని ఉన్నాడు. తల్లి అతని కాళ్లు పడుతుంది.

" అవును వాడు ఏమయ్యాడు "? అన్నాడు తండ్రి కొడుకును వుద్దేశించి.

" ఏమోనండీ తెలియదు " అంది తల్లి.

" భోజనం కూడా చేయలేదా ? "

" లేదు చెయ్యలేదు "

" వస్తాడులే నీ గారాల కొడుకు "

" అదేంటండి నీకు మాత్రం గారాల బిడ్డ కాదా "

" ఎందుకు కాదే వాడు నాకూ కన్నబిడ్డే "

" మరి ఎందుకండీ వాణ్ని చూడగానే మండిపడతారు?"

" పిచ్చిదానా ! తల్లివి కాబట్టి నీవు ఎలాగూ కొడుకుని వెనకేసుకుంటూనే వుంటావు. అలాగని నేను కూడా నెత్తిన ఎక్కించుకున్నాననుకో వాడు మాట వినడు సరి కదా మనకు అందకుండా పోతాడు. వాడు చేసే మంచి పనుల గురించి నాకు తెలుసు. అలా అని వాణ్ని మెచ్చుకుంటూ పోయామా వానిలో గర్వం మొలకెత్తుతుంది. కాబట్టి అప్పుడప్పుడు విమర్శిస్తూ ఉంటేనే వాడు ప్రయోజకుడవుతాడు. ఏ తండ్రికీ కొడుకంటే ద్వేష భావం ఉండదు. తండ్రి ఎప్పుడైనా కొడుకు ప్రగతిని గూర్చే ఆలోచిస్తాడు. వాడు మన ఇంటి వారసుడే ! వాడంటే నాకు ప్రేమ ఎందుకు వుండదు? " అన్నాడు తండ్రి.

ఆ క్షణంలోనే పైనుంచి దభీలుమంటూ వారి మంచం పక్కనే పెద్దరాయి పడింది.

తల్లి తండ్రి ఒక్కసారిగా ఎగిరిపడి నిల్చున్నారు. వెంటనే కొడుకు పై నుండి దూకి తండ్రి పాదాలు పట్టుకున్నాడు. " నాన్నా నన్ను క్షమించు నీ మనసు తెలుసుకోలేకపోయాను ". అని బావురుమని ఏడ్చాడు కొడుకు.

కొడుకును లేవనెత్తి తండ్రి అక్కున చేర్చుకొన్నాడు. ఆ కొడుకే మహాకవి భారవి.

# జరిగిన కథలు

## రక్తం చిందించిన యువతి

" చెప్పు మీ దేశ సైనికులు ఇటువైపుగానే పరుగెత్తుకొచ్చారు " అంటూ గద్దించాడు ఇటలీ సైనికాధికారి గుర్రంపై కూర్చుని.

16 సంవత్సరాల ఆ అమ్మాయి నిశ్శబ్దం వహించింది తప్ప మారు పలకలేదు.

" చెప్పు" మరొసారి అరిచాడు సైనికాధికారి.

కొందరు సైనికులు వచ్చి ఆ యువతి చేతులు వెనక్కి విరచి పట్టుకొన్నారు. మరొకడు కంఠంపై కత్తి పెట్టి అడుగుతున్నాడు.

"ఊ ( ఎటు వైపు వెళ్లారు మీ సైనికులు" అంటూ

అసహ్యంగా చూసింది వాళ్లకేసి ఆ అమ్మాయి.

మనసులో కొద్ది నిమిషాల క్రితం తమ దేశ సైనికులు వచ్చి పోయిన విషయం తెరలు తెరలుగా ఆమెకు జ్ఞాపకానికి వస్తుంది. " మేము వెళ్తున్నట్టుగా ఎవరికీ చెప్పకు. మన అబిసీనియా దేశాన్ని ఇటలీ సైన్యాలు ఆక్రమిస్తున్నాయి, తప్పని పరిస్థితులలో మేము వాళ్ళకు కనిపించకుండా వెళ్తున్నాం. ఇప్పటికే మనవాళ్లందరు సరిహద్దులలో యుద్ధాలు చేస్తున్నారు. రాజు గారి రక్షణ కోసం మేము పారిపోవాల్సి వస్తోంది. " అని తమ దేశ సైనికులు చెప్పిన విషయం జ్ఞాపకానికి వచ్చి ఆమెను మూగదాన్ని చేశాయి.

శత్రుసైనికులు ఆ అమ్మాయిని అనేక రకాలుగా హింసించారు. క్షణం క్షణం వాళ్ళు పెట్టే హింసను భరించలేకపోయింది. ఎక్కడ తన పట్టుదలను కోల్పోయి చెబుతానో అన్న భయం మొదలయింది. ఆమెలో రెప్పపాటు కాలంలో మెరిసిన ఒక ఆలోచనలతో తమ చేతులు విదిలించుకొని ఎదుటి సైనికుడి చేతిలో ఉన్న కత్తిని లాక్కుని ఒక్కసారిగా తన నాలుకను ' సిప్ ' మని కోసి వాళ్ళ ఎదుట పడేసింది. అనుకోకుండా ఆమె తీసుకున్న నిర్ణయానికి శత్రు సైనికుల కళ్ళు బైర్లు కమ్మాయి.

నాదేశ రక్షణ కోసం మీరు ఎంత హింసించినా నిజం చెప్పను, అని చెప్పకనే చెప్పిన ఆమె ధైర్యానికి అబ్బురపడి ఆ సైనికులు అక్కడ నుంచి వెళ్లిపోయారు. దాదాపు వంద సంవత్సరాల క్రితం "అబిసీనియా " లో ఒక పల్లెటూరు అమ్మాయి చేసిన ఈ త్యాగం అపూర్వమైన దేశభక్తికి తార్కాణంగా ఆ దేశ చరిత్రలో మిగిలిపోయింది.

## పరీక్ష

కడపజిల్లా వాసి పుట్టపర్తి నారాయణాచార్యుల గారి జీవితంలో ఒక మరపురాని

పరుగెత్తే కాళ్ళను చూసి మురిసిపోకు - తట్టుతగిలిందా పడిపోతావన్నది మరచిపోకు.

సంఘటన జరిగింది. ఆయన విద్వాన్ తెలుగు పరీక్ష వ్రాయడానికి పరీక్ష ఫీజు చెల్లించాడు. అందుకోసం యూనివర్సిటీ వారు పెట్టిన సిలబస్ లిస్టులో "పెనుగొండ లక్ష్మి" అనే ఒక పుస్తకం పేరు పేర్కొనబడింది. దాన్ని చూసి ఆశ్చర్యపోయాడు నారాయణాచార్యులు.

ఎందుకంటే పదవతరగతి చదువుతున్న సమయంలోనే తాను రాసిన పుస్తకం అది. తాము విద్వాన్ వ్రాయడానికి వచ్చేసరికి తన పుస్తకమే తనకు పరీక్షగా నిలబడింది కాబట్టి .

## స్వేచ్ఛ

బ్రిటిష్ కాలంలో ఒక ప్రాథమిక పాఠశాలలో జరిగిన పోటీలలో ఒక అబ్బాయికి ప్రథమ బహుమతి వచ్చింది. ఒక రోజున ఒక ఆంగ్లేయ అధికారిని పిలిచి బహుమతి ఇప్పించారు ఆ అబ్బాయికి.

ఆ అబ్బాయి తన కొచ్చిన మెడల్‌ని ఎప్పుడూ మెడలో వేసుకొని తిరిగేవాడు అది చూసి అందరూ నవ్వుకొనేవారు. ఒక రోజు మిత్రులు "వీరా ఎప్పుడూ మెడలో వేసుకొని తిరుగుతున్నావు. తీసి పడేయొచ్చు కదా !" అన్నారు. దానికి ఆ అబ్బాయి ఈ విధంగా సమధానమిచ్చాడు.

" నేను ఎందుకు ఈ మెడల్‌ని మెడలో వేసుకొని తిరుగుతున్నానో తెలుసా ! నాకు ఈ బహుమతిని ఇచ్చినవారు ఆంగ్లేయులు. వాళ్లే మన దేశాన్ని ఆక్రమించుకొన్నారు కాబట్టే మనవాళ్లందరు స్వేచ్ఛను కోల్పోయి బానిసలుగా బతుకుతున్నారు. తెల్లవాళ్లను ఎప్పటికైనా మనదేశం నుండి వెల్లగొట్టాలి. అందుకోసం నేను ఎప్పుడూ పోరాడుతాను. ఆ విషయం మరచిపోకుండా ఉండటానికే ఆ అధికారి వేసిన ఈ మెడల్‌ని నేను మెడలోంచి తీయడం లేదు" అన్నాడు.

ఇంతకీ ఆ అబ్బాయి ఎవరోకాదు మన్యం వీరుడుగా మన చరిత్రలో నిలిచిన అల్లూరి సీతారామరాజు.

# మన జాతీయ నాయకులు

## బాలగంగాధర్ తిలక్



బాల గంగాధర తిలక్ 1856లో జన్మించాడు. గొప్ప స్వాతంత్ర్య సమర యోధుడు. పూనాలోని ఫెర్గుసన్ కాలేజీలో ప్రొఫెసర్‌గా పనిచేశాడు. 1889లో భారత జాతీయ కాంగ్రెసులో చేరినాడు. అప్పటి స్వాతంత్ర్య పోరాటాలలో ప్రవేశించాడు.

బ్రిటిష ప్రభుత్వంచేత నాటి రాజద్రోహ నిరోధక చట్టం క్రింద విచారింపబడి శిక్షింపబడిన మొట్టమొదటి భారతీయుడు. వీరిని తిలక్ అని గూడా పిలిచేవారు. తిలక్ స్వాతంత్ర్య యోధుడే కాదు, గొప్ప విద్వాంసుడు కూడా, "కేసరి" "మరాఠా" అను

పత్రికలను ప్రారంభించాడు. అంతేకాక "గీతారహస్యం" "ఆర్కిటిక్ హోం ఆఫ్ వేదవ్యాస్" అను గ్రంథాలను అతడు రచించాడు. బ్రిటీషు వారి పాలనపై ప్రజలలో చైతన్యం పెంపొందించాడు. 1893లో గణపతి ఉత్సవాలను ప్రారంభించాడు. గోహత్యానిషేధ సంఘాలను స్థాపించాడు. భారతీయుల విద్యాభివృద్ధికి పాటుపడ్డాడు. "స్వాతంత్ర్యం నా జన్మహక్కు" అని చాటిన ధీరోదాత్త స్వాతంత్ర్య సమర యోధుడు. భారతీయులను రాజకీయ హక్కులకోసం పోరాడుటకు ప్రేరేపించినాడు. 1920 సం॥లో పరమపదించెను.

## గాంధీ



ఈయన పూర్తి పేరు మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ. 1869 అక్టోబర్ 2వ తేదీన జన్మించినాడు. లండన్‌లో తన 17వ యేట విద్యాభ్యాసం ముగించి స్వదేశం తిరిగి వచ్చాడు. 1893లో దక్షిణ ఆఫ్రికాలో తెల్లవాళ్ళ అణచివేతకు వ్యతిరేకంగా పోరాటం చేశాడు.

అహింసా మార్గంగా పోరాటంచేసే విధానాన్ని అక్కడనే గాంధీ ఆచరించాడు.1915లో భారత దేశానికి తిరిగివచ్చి కొద్దికాలంలోనే కాంగ్రెస్ పార్టీకి గొప్ప నాయకుడుగా మారినాడు. చరఖా తిప్పుతూ ఖద్దరు తయారు చేసే ఉద్యమాన్ని సాగించాడు. 1921లో సహాయ నిరాకరణ, 1930లో ఉప్పు సత్యాగ్రహం 1942లో క్విట్ ఇండియా ఉద్యమాలను నడిపించాడు. ఎన్నోసార్లు జైలుకు వెళ్ళాడు.

శాంతి, సత్యం, అహింస, సత్యాగ్రహాలే ఆయుధాలుగా ఆంగ్లేయుల నుండి భారతదేశాన్ని విముక్తి చేసిన మహాత్ముడు గాంధి. 1948 జనవరి 30వ తేదీనాడు నాథూరామ్ గాడ్సే తుపాకీ గుళ్ళకు బలై " హేరామ్ " అంటూ ప్రాణాలు వదిలాడు.

## పండిత జవహర్‌లాల్ నెహ్రూ



ఇతడు స్వతంత్ర భారతదేశపు తొలి ప్రధాని, 1889లో నవంబర్ 14న అలహాబాదునందు జన్మించాడు. ఇతని తండ్రి మోతీలాల్ నెహ్రూ. ప్రముఖన్యాయవాది. స్వాతంత్ర్య సమర యోధుడు.

నెహ్రూ ఇంగ్లాండులో చదువుకొని బారిష్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. కానీ న్యాయవాదవృత్తి చేపట్టలేదు. భారతదేశ స్వాతంత్ర్యంకోసం పోరాడి పలుమారులు జైలుకు వెళ్లాడు. ధనికుడై తనకున్నదంతా దేశానికై త్యాగం చేశాడు. ఇతడు జైలులో వున్న సమయంలోనే "భారత దేశ అన్వేషణ" "ప్రపంచ చరిత్ర సంగ్రహ దర్శనం" అను గ్రంథాలు రచించాడు. 1947 నుండి 1964 వరకు భారత దేశ ప్రధానిగా పనిచేశాడు. ఇతనిని "చాచా నెహ్రూ" అని అంటారు. ఎందుకంటే ఇతనికి పిల్లలంటే మిక్కిలి ప్రేమ. 1964లో స్వర్గస్థుడైనాడు.

## సర్దార్ వల్లభభాయి పటేల్

ఇతనిని "భారతదేశపు" ఉక్కుమనిషి అనేవారు. ఇతడు గొప్ప యోధుడు. గుజరాత్‌లో 1875లో జన్మించి, బ్యారిస్టరీ చదివి, న్యాయవాదిగా పనిచేసి, 1931లో భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడై క్విట్ ఇండియా మూమెంట్‌లో పాల్గొన్నాడు.



స్వతంత్ర భారతదేశానికి ఉప ప్రధానిగా హోంశాఖా మంత్రిగా పనిచేశారు. దేశంలోని అనేక చిన్నా పెద్ద 300 రాష్ట్రాలను భారతదేశంలో విలీనం చేశాడు. 1948లో హైద్రాబాద్ రాజ్యాన్ని భారత రాజ్యంలో అంతర్భాగం చేశాడు.

## భీం రావు రాంజీ అంబేద్కర్



నిమ్న జాతి కుటుంబంలో 1891లో జన్మించిన అంబా వాడేకర్‌ను అతని గురువు అంబేద్కర్ అన్నాడు. ఇతడు బరోడా రాజు ఇచ్చిన ఉపకార వేతనంతో చదివి, అమెరికా వెళ్ళి న్యాయ శాస్త్రంలో పిహెచ్.డి. డిగ్రీ పొందాడు. ఇతడునిమ్న జాతుల నాయకుడు, బహిష్కృత హితకారిణి సభను స్థాపించి వారిసేవ జేసినాడు. అస్పృశ్యుల హక్కులకై పోరాడినాడు.

భారత రాజ్యాంగ రచనలో తోడ్పడిన ఈతడు నెహ్రూ మంత్రి వర్గంలో న్యాయశాఖామాత్యుడుగా పనిచేసి 1956లో మరణించినాడు. జీవితం చివరలో బౌద్ధం స్వీకరించాడు.

## సరోజినీ నాయుడు

1878 ఫిబ్రవరి 13 వ తేదీన బెంగాల్‌లో సరోజినీ దేవి జన్మించింది. 11వ ఏటనే ఆమె ఆంగ్లంలో కవిత్వం వ్రాయడం ఆరంభించింది. సరోజినీ దేవి గాంధీజీ ప్రభావంతో స్వాతంత్ర్య సమరంలో పాల్గొని నాయకురాలుగా ఎదిగింది. ఆమె గొప్ప ఉపన్యాసకుర్రాలు. 1934లో ఆమె జైలు శిక్ష అనుభవించింది. తెలుగునాయుడిని పెళ్లి చేసుకొని సరోజినీ నాయుడుగా మారింది. ఎన్నో కవితా సంపుటాలను రచించింది.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఉత్తర ప్రదేశ్‌నకు మొదటి గవర్నర్‌గా ఎన్నికై తన పదవిని అద్భుతంగా నిర్వహించిన దేశంలో మొదటి మహిళా గవర్నర్ ఈమెయే.

"భారత కోకిల"గా పేరుపొందిన సరోజినీ నాయుడు 1949లో పరమ పదించింది.

## భగత్‌సింగ్



భారతదేశ విముక్తికోసం విప్లవ వీరునిగా మారి చివరికి ఉరికంబం ఎక్కి తన ప్రాణాలు అర్పించిన అగ్నితరంగం అమర వీరుడు భగత్‌సింగ్. ఇతడు 1909 సెప్టెంబర్ 28వ జన్మించాడు. తెల్లవారిని భారతదేశం నుండి సాగనంపడానికి విప్లవ మార్గాన్ని ఎన్నుకొన్నాడు భగత్‌సింగ్. 1929 ఏప్రిల్ 8వ తేదీన న్యూఢిల్లీలో కేంద్ర అసెంబ్లీలో బాంబులు వేసి కర పత్రాలు పంచినాడు. రాజగురు, సుఖ్‌దేవ్‌లతో పాటు ఆజాద్ చంద్రశేఖర్‌తో కలిసి తన పోరాటాన్ని కొనసాగించాడు. 1931 మార్చి 23 నాడు రాజగురు, సుఖ్‌దేవ్‌లతోపాటు భగత్‌సింగ్ ఆంగ్ల ప్రభుత్వం విధించిన ఉరిశిక్షను ఆనందంగా స్వీకరించి భారతమాత కోసం ప్రాణాలు అర్పించాడు .

## అల్లూరి సీతారామరాజు



అల్లూరి స్వాతంత్ర్యసమరయోధుడు. పశ్చిమ గోదావరి జిల్లాలోని మోగల్లు" గ్రామం లో 4-7-1897వ తేదీన జన్మించాడు. రాజమండ్రి, విశాఖపట్టణం, నర్సాపూర్‌లలో చదువుకున్నాడు. చిన్నతనం నుండే ఆంగ్లేయుల పట్ల అసహ్య భావం పెంచుకున్నాడు.

ఆ కాలంలో గూడెం కొండల మధ్య వున్న గానాలపాలెం అనే గ్రామంలో మల్లుదొర, గంటందొర అనే సోదరులు ఉండేవారు. వారి యొక్క మునసబు పదవులను, వారికి చెందిన భూమిని ఆంగ్లేయ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. పోతే అక్కడ రోడ్డు పనిచేసే కూలీలకు సరియైన కూలి చెల్లించకుండా అక్కడ వున్న తహసిల్‌ధారు 'సెబాస్టియన్' అనే ఆంగ్లేయుడు ఈ దౌర్జన్యాలన్నీ చేయించేవాడు. సరిగ్గా అపుడు సీతారామ రాజు అక్కడికి చేరుకొని ఆ మన్యం ప్రజలకు నాయకుడై ఆంగ్లేయ ప్రభుత్వ విధానాలమీద తిరుగుబాటు లేవదీశాడు.

పోలీస్ స్టేషన్‌లపై దాడులుచేసి ఆయుధాలు సేకరించి సాయుధ పోరాటాన్ని ప్రారంభించి తెల్లవారి గుండెలలో బల్లెంలాగా నిలిచాడు. కానీ ఆంగ్ల ప్రభుత్వం తన వద్ద నున్న సైనిక బలంతో తుపాకీ బలంతో ఈ పోరాటం అణచివేసింది. సీతారామరాజును కాల్చి చంపింది. దేశం కోసం ప్రాణాలు అర్పించిన అమర వీరుడు అల్లూరి సీతారామరాజు.

అల్లూరి స్వేచ్ఛకోసం సల్పిన పోరాటం, ఆయన త్యాగం చరిత్ర పుటల్లో నిలిచిపోయాయి.



## టంగుటూరు ప్రకాశం

ప్రకాశం జిల్లా కనవర్తి గ్రామంలో 1872 ఆగస్టు 23న ప్రకాశం జన్మించాడు. 1892లో మద్రాసులో న్యాయశాస్త్రం అభ్యసించాడు. 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నాడు. " స్వరాజ్య " అనే ఆంగ్ల పత్రిక స్థాపించి ఆంగ్లేయుల ప్రభుత్వాన్ని పత్రికద్వారా విశృంఖలంగా విమర్శించేవాడు.

1928లో సైమన్ కమీషన్ బహిష్కరణ సందర్భంలో కాల్పులకు గురై ఒక వ్యక్తి చనిపోయినపుడు ప్రజా సమూహంలోంచి ముందుకు ఉరికి ఎక్కుపెట్టిన తుపాకీలతో వున్న సాయుధ భటులతో " సిద్ధంగా వున్నాను కాల్చండిరా " అంటూ సింహంలా గర్జించి ముందుకెళ్ళగా భటులు వెనుకడుగు వేశారు. అపుడు అతడ్ని ప్రజలు "ఆంధ్ర కేసరి" అని కొనియాడినారు.

1953లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినాడు.

1957 మే 20వ తేదీన టంగుటూరు ప్రకాశం పంతులు చనిపోయాడు.

## పింగళి వెంకయ్య



మనం ఇపుడు ఎగురవేస్తున్న మూడు రంగులు అశోక ధర్మ చక్రం కలిగివున్న జాతీయ జెండాను తయారు చేసింది మన పింగళి వెంకయ్యయే.

మొదట ఇందు చర్ఖా యుండినది. ఇది జాతీయ కాంగ్రెస్ చిహ్నం కాగా, భారత ప్రభుత్వ చిహ్నంగా అశోక చక్ర మిందు చేర్చినారు.

ఇతడు 1876 ఆగస్టు 2వ తేదీన జన్మించాడు. 19 సంవత్సరాల వయసు వున్నప్పుడే భారత సైన్యంలో చేరి దక్షిణాఫ్రికాకు వెళ్లి బోయర్ యుద్ధంలో పాల్గొని వచ్చాడు. గాంధీజీ సలహామేరకు మన దేశానికి జాతీయ పతాకాన్ని తయారు చేయడానికి 20 రకాల జెండాలను సూచించాడు. ప్రస్తుతం మన జాతీయ జెండా వాటిల్లో నుంచి ఎన్నుకొన్నదే. 1963 జులై 4న విజయవాడలో పింగళి వెంకయ్య మరణించాడు.

## పొట్టి శ్రీరాములు



బాల్యం నుండే ఆంగ్లేయుల పట్ల ఒకరకమైన వ్యతిరేక భావాన్ని పెంచుకొని వాళ్ల విధానాల పట్ల నిరసన వ్యక్తం చేస్తూ విద్యాభ్యాస కాలంలో తెల్ల దొరల అధికార దురహంకారానికి అనేక రకాలుగా ఇబ్బందులకు గురైన పొట్టి శ్రీరాములు1901లో మద్రాసులో జన్మించాడు.

1925 నుండి కొన్ని సంవత్సరాలు ఉద్యోగం చేశాడు. ఆ తర్వాత గాంధీ అడుగుజాడల్లో నడవాలని ఉద్యోగం వదిలివేశాడు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటం కోసం 1952 అక్టోబర్ 19 నుండి 58 రోజులు కఠోర ఉపవాస దీక్ష సాగించి డిసెంబరు 15వ తేదీ ప్రాణాలు విడిచాడు. ఆయన ప్రాణ దానం తర్వాతనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.

## దుర్గాబాయి దేశ్‌ముఖ్

1909లో జులై 15న దుర్గాబాయి జన్మించింది. 1921లో గాంధీజి ఆంధ్ర ప్రదేశ్‌లో పర్యటించి నపుడు గాంధీ హిందీ ఉపన్యాసాలను తెలుగులో అనువాదం చేసి ఆయన ప్రశంసల నందుకున్నది. ఆ తరువాత ఉప్పు సత్యాగ్రహం కాలంలో మూడుసార్లు జైలుకు వెళ్లింది.

1938లో ఆంధ్ర మహిళా సభ స్థాపించింది. ఆంధ్ర మహిళా సభ ద్వారా వైద్య చికిత్సాకేంద్రాలు, మహిళా విద్యాలయాలు, శిశువిహారాలు, అక్షరాస్యతా కేంద్రాలు నెలకొల్పి ఆంధ్ర మహిళలకు ఆంధ్ర ప్రజలకు ఎంతో సేవ చేసింది. భారత ప్రభుత్వం ఆమె సేవలను గుర్తించి పద్మవిభూషణ బిరుదు నిచ్చి గౌరవించింది.

దుర్గాభాయి దేశ్‌ముఖ్ 1981 మే 9న హైదరాబాదులో కన్నుమూసింది.

ఆమె ఇచ్చిన స్ఫూర్తి ద్వారానే శ్రీమతి సుగుణమణి సమాజం పట్ల అవ్యాజమైన అనురాగాన్ని పెంచుకొని ఒక మహా శక్తిగా ఎదిగి ఆంధ్ర మహిళా సభ అధ్యక్షురాలుగా ఉంటూ నేడు ఎన్నో సమాజ కేంద్రాలను కొనసాగిస్తుంది.

## లాల్‌బహదూర్ శాస్త్రి

భారతీయ ప్రధాన మంత్రులలో మహోన్నతమైన వ్యక్తిగా భారతీయుల హృదయాలలో గొప్ప ముద్ర వేసుకొన్నవాడు లాల్‌బహదూర్ శాస్త్రి. 1904 అక్టోబర్ 2 న కాయస్థ వంశంలో శారదాప్రసాదు, రాందులారిదేవీ లకు లాల్‌బహదూర్ పుట్టిన ముద్దు బిడ్డ. వీరిది చాలా పేద కుంటుంబం. బాల్యంలోనే తండ్రి మరణించడంతో స్వశక్తితో ఎదిగి దేశభక్తి కలవాడై 1921లో గాంధీజి ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు.

కాశీ విశ్వవిద్యాలయం నుండి " శాస్త్రి " పట్టాను పొంది అప్పటి నుండి లాల్ బహదూర్ శాస్త్రిగా పిలువబడ్డాడు. 1921లో లలితా దేవిని వివాహం చేసుకొని 1930లో తొలిసారి జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు.

1964 మే 27న నెహ్రూ మరణించగానే జూన్ 11వ తేదీన శాస్త్రి ప్రధానమంత్రిగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు. శాస్త్రి ఎన్నో కేంద్ర పదవులు నిర్వహించాడు. రైల్వే

మంత్రిగా ఉన్నపుడు రైలు దుర్ఘటనకు తనదే నైతిక బాధ్యతయని మంత్రి పదవికి రాజీనామా చేసిన నిజాయితీపరుడు. ప్రధాన మంత్రిగా వుండికూడా తన సొంతానికి అంటూ ఏమీ మిగుల్చుకోలేదు. ఎంతో నిజాయితీగా, నిరాడంబరుడుగా వుండి, అందరికీ ఆదర్శప్రాయుడైనాడు. పాకిస్థాన్‌తో మన దేశానికి యుద్ధం సంభవించినప్పుడు పాకిస్థాన్ దురాక్రమణాన్ని ఉక్కు పిడికిలితో అణచివేశాడు. శాంతి స్థాపనకై రష్యా ఆహ్వానంతో తాష్కెంట్‌కు వెళ్ళి గుండెపోటుతో 1966 జనవరి 11న ఆకస్మికంగా మరణించాడు. " జై జవాన్ జై కిసాన్ " అనే ఆయన నినాదం ఎప్పుడూ భారతీయ ప్రాగంణంలో మారుమ్రోగుతూనే వుంటుంది.

## నేతాజీ సుభాష్ చంద్రబోస్



సుభాష్‌చంద్రబోస్ ఒరిస్సాలోని కటక్‌లో 1897 సం॥లో జన్మించెను. బ్రిటిష్ ప్రభుత్వం గుండెల్లో రైళ్ళు పరుగెత్తించిన భారతీయ విప్లవ సింగం సుభాష్ చంద్రబోస్. చిన్నప్పుడే దేశంకోసం పోరాడుతానని రక్తంతో కాగితం పై రాసి ప్రతిజ్ఞ చేసిన గొప్ప దేశభక్తుడు . తెల్లవారిని అణచడానికి విప్లవ మార్గాన్ని ఎంచుకొని దెబ్బకు దెబ్బ తీయాలని " అజాద్ హింద్ ఫౌజ్ " ను స్థాపించాడు. " జై హింద్ " అనే మాటను తొలిసారిగా తన నోటి నుండి పలికి నేతాజిగా పిలవబడి దేశం కోసం జన్మించి, దేశం కోసమే జీవించాడు. "నేను బానిసగా వున్నాను పెళ్లిచేసుకొని మరికొందరు బానిసలను సృష్టించలేను " అని శపథం చేసిన మహోన్నత దేశాభిమాని. దేశం కోసం ఐ.సి.యస్. పదవిని కూడా విడిచిపెట్టిన దేశ భక్తుడు. 1945 ఆగస్టులో విమానంలో ప్రయాణిస్తుండగా ఫార్మోజా దీవిలోని తైపే విమానాశ్రయం వద్ద విమానం కూలిపోయి మరణించాడు.

## అనీబిసెంటు

భారత జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన విదేశీ మహిళ అనిబిసెంట్. ఈమె భారతదేశమే తన మాతృభూమిగా చెప్పుకొన్నది. 1891లో థియోసాఫికల్ సొసైటీ కార్యకర్తగా ఈమె భారతదేశమునకు వచ్చినది. నాటి నుండి భారతజాతి ఉద్ధరణకు హిందూ ధర్మ పునః ప్రతిష్ఠాపనకు కృషి చేసినది. భారత జాతీయ నాయకులు తిలక్ మొదలగు వారితో స్వాతంత్ర్యం కోసం పోరాడి జైలు పాలైనది.

భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలైనది. కాంగ్రెస్‌లోని అతివాదుల మితవాదుల నొక్కత్రాట నడిపింప యత్నించిన తీరు శ్లాఘనీయం. ఈమెను పర్వ శుక్ల సర్వాతిగా గౌరవంగా పిలిచేవారు.

ఈమె భారతీయ మహిళవలె ఈ దేశాన్ని మిక్కిలి ప్రేమించి ఈ జాతి సంస్కృతిని త్రికరణ శుద్ధిగా ప్రేమించినది.

## దుగ్గిరాల గోపాల కృష్ణయ్య

ఇతడు స్వాతంత్ర్య సమరయోధులలో ప్రముఖ ఆంధ్రుడు. ఈతనిని ఆంధ్ర రత్న అని అందురు. 1889 సం॥లో కృష్ణా జిల్లాలోని పెనుమంచిప్రోలు అనే గ్రామంలో జన్మించాడు. ఆంగ్లేయులకు బానిసగా గుమస్తాగిరి చేయుచున్న ఉద్యోగము విడిచి పెట్టెను. రహస్యంగా ఇంగ్లండుకు వెళ్ళి ఎం. ఏ. ఆనర్సు చదివెను. ఆంధ్ర జాతీయ కళాశాల వైస్ ప్రిన్సిపాల్‌గా బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపాడు. అహింసా భావనతో ఉద్యమాన్ని పోరాటాన్ని నిర్వహించి నడిపించి, హిందూ ముస్లింల సమైక్యతకై కృషి చేశాడు.

## రాయలసీమ పులి (ఉయ్యాలవాడ నరసింహా రెడ్డి )



దేశంకోసం ఆత్మార్పణం చేసిన భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజుల కోవలో మరో రాయలసీమ వీర కిశోరం ఉయ్యాలవాడ నరసింహా రెడ్డి. రాయలసీమకు చెందిన నల్లమలలోని స్వాతంత్ర్య వీరుడు. ఈనాటి కర్నూలుజిల్లా కోవెల కుంట్ల తాలుకాలో ఉయ్యాలవాడ పరిసరాలలో నరసింహా రెడ్డి మంచి దొరగా, పేరు ప్రఖ్యాతులు పొందాడు.

గుర్రపు స్వారి , బాణ విద్యలో ఆరితేరిన వాడు. జయరామ రెడ్డికి దత్త పుత్రునిగా వెళ్ళి వారి ' నొస్సం " కోటకు వారసుడై ప్రజల మనసెరిగి పాలన చేసినాడు. ఆ విధంగా, ప్రజల మన్ననలను పొందుతూ ఒకవైపు ఆంగ్లేయుల ప్రభుత్వంపై ద్వేషాన్ని పెంచుకొని వారిని తరిమివేయాలని కంకణం కట్టుకున్నాడు.

జయరామా రెడ్డి కాలంలో ఆంగ్లేయుల కోసం కోటను వశం చేసుకొన్నందుకు ఏర్పాటు చేసిన జీవన భృతిని ఇవ్వనని మొండి కేసిన తెల్లవాడైన తహశిల్దారు తల నరకడంతో ఆంగ్లేయుల దుష్టపాలన అంతానికి నాంది పలికాడు. ఆ తరువాత నరసింహారెడ్డిని అంతమొందిచాలన్న కర్నల్ హాట్సన్ సైన్యాన్ని ఎదుర్కొని విజయం సాధించాడు.

రుద్రవరంలో ఆంగ్లేయుడైన రేంజర్ అను ఉద్యోగి చేస్తున్న అన్యాయాన్ని తెలుసుకొని వెళ్లి ఒక్క దెబ్బతో అతన్ని నేలకూల్చాడు. ఆ విధంగా విప్లవ సింహమై ప్రజల అండదండలతో ఉద్యమిస్తూ అడ్డగించిన కంభం తహసిల్దారును, ఆంగ్లేయులైన

సార్జంటులను పదుగురిని ముక్కలు ముక్కలు చేశాడు. ఈ వార్త మద్రాసులోని ఇంగ్లీషు కంపినీ సర్కారుకు తెలిసి ఇతనిపై దాడి చేయడంతో అనేక రకాలుగా పోరాటం చేసి తన దళంలో బలం సన్నగిల్లడంతో ఒంటరివాడై నల్లమల మధ్య ఎర్రమలలోని నరసింహ ఆలయంలో వుండగా ఆంగ్లేయులు అతనిపై దాడిచేసి బంధించి సైనిక బందోబస్తుతో కోవెలకుంట్లకు తీసుకువెళ్లి అచ్చట జుర్రేటి వద్ద ఉరితీసారు. తలను కోటగుమ్మానికి కట్టారు. ఇది సరిగ్గా 1848లో జరిగిన సంఘటన. ఆలా నేలకొరిగాడు ఆ స్వాతంత్ర్యసమర వీరుడు.

## కవులు - రచయితలు

రామాయణము ఆదికావ్యము - దీనిని వాల్మీకి రచించెను.

వేదపురాణేతిహాసముల వ్యాకరించిన (విడమర్చిన) వాడు వ్యాసుడు. శివుడు పార్వతికి రామాయణమును, వైశంపాయనుడు మునులకు భారతమును, శుకుడు పరీక్షిత్తునకు భాగవతమును చెప్పెను.

వేదవ్యాసమునీంద్రుడు సంస్కృతమున రచించిన మహాభారతమును తెలుగు అనువాదముగా గాక స్వతంత్ర రచన వలె చేసిన కవులు ముగ్గురు. వారిని కవిత్రయమందురు. వారు 1. నన్నయ 2. తిక్కన, 3. ఎఱ్ఱన.

**నన్నయభట్టు :** ఈ మహాకవి 11వ శతాబ్దికి చెందినవాడు. రాజమహేంద్ర వరమున పరిపాలించిన రాజరాజనరేంద్రుని ఆస్థానకవి. ఇతడు ఆంధ్ర మహాభారతమున ఆది సభా అరణ్యపర్వము నందు కొంత భాగమును మాత్రము రచించెను. తాను రచించి రెండున్నర పర్వముల భారతమును రాజ రాజ నరేంద్రునకంకితమిచ్చెను. ఆదికవి వాగను శాసనుడు అనునవి నన్నయకున్న బిరుదములు. తెలుగుభాష కొక ప్రమాణ స్వరూపము కల్పింపనెంచి సంస్కృతమున "ఆంధ్ర శబ్ద చింతామణి" అను వ్యాకరణగ్రంథమును రచించెను. పరవస్తు చిన్నయసూరి తెలుగులో రచించిన బాల వ్యాకరణమునకు "మాతృక" ఆంధ్రశబ్దచింతామణియే. ఈతని శైలి మృదుమధురము మనోహరము, ప్రసన్న కథాకలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తినిధిత్వము - ఈతని కవితలోని విశేష గుణములు. ఇతడు వైదికుడు. పూర్వకవులలో ఆరువేల నియోగులు కవులై యుండిరి. ఈ కవియొక్కడే వైదికులలో కవిగా ప్రసిద్ధికెక్కినవాడు.

**తిక్కన సోమయాజి :** ఈ మహాకవి 12వ శతాబ్దికి చెందినవాడు. మనుమసిద్ధిరాజావద్ద మంత్రిగా. ఆస్థానకవిగా ప్రసిద్ధికెక్కినవాడు. ఆంధ్ర మహాభారతమున నాల్గవ పర్వమైన విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వము వరకు గల పదునైదు పర్వములు రచించెను. భారతము రచించుటకు పూర్వమీకవి నిర్వచనోత్తర రామాయణమను కావ్యమును రచించెను. అలతి, అలతి అచ్చతెలుగు పదప్రయోగములు చేసి అనల్పార్థమునిముడించుటలో యీకవి దిట్ట. పాత్రౌచితియందును, వీర రౌద్ర, బీభత్స భయానక కరుణ రస పోషణములందును సన్నివేశములను కనులకు గట్టినట్లు చిత్రీకరించుట యందును తిక్కనకు తిక్కనయే సాటి. ఈ కవీశ్వరుడు రాజ్యతంత్రజ్ఞుడు. ఈతనికి కవిబ్రహ్మయను బిరుదము గలదు. తన సమకాలికులైన శైవులు, వైష్ణవులు పరస్పరమత్ద్వేషులైనందున వారినీసడించి శివకేశవులకైక్యమాపాదించి తాను రచించిన భారతమును హరిహరనాథునకంకితమిచ్చెను. యజ్ఞములు చేసి తిక్కన సోమయాజియయ్యెను.

**ఎఱ్ఱ ప్రెగ్గడ :** ఈ విద్వత్కవి 13వ శతాబ్దికి చెందినవాడు. ఎఱ్ఱన వేమారెడ్డి ఆస్థానకవి. నన్నయభట్టు రచించిన ఆంధ్ర భారతమునందలి అరణ్య పర్వము ఉత్తరార్ధమున చతుర్థాశ్వాసము 143వ పద్యము. "స్ఫురదరుణాంశు" అను చంపకమాల మొదలు అష్టమాశ్వాసము వరకు (శిథిలమైన భాగమును) పూరించి నన్నయ్య భట్టు రచనగానే దానిని నిరూపించి తనయుదాత్తతను చాటెను. ఇమ్మహాకవి స్వీయ రచనలు. "హరివంశము" - "నృసింహపురాణము" మిక్కిలి ప్రసిద్ధి జెందినవి. ఈతడు వినయశీలి. ఈతనికి "ఉభయకవిమిత్రుడు - ప్రబంధ పరమేశ్వరుడు", అను బిరుదములు కలవు. కన్నులకు కట్టినట్లుండు మనోహరమైన వర్ణనలతో చక్కని తెలుగునుడికారముతో ఈతని కవిత అలరారుచుండును.

**శ్రీనాథుడు :** శ్రీనాథుడు 14వ శతాబ్దివాడు. కొండవీటి పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో విద్యాధికారిగా వుండేవాడు. మహాకవిగా పేరొందాడు . కాశీఖండం, భీమఖండం, శృంగార నైషధం, హర విలాసం, శివరాత్రి మాహాత్మ్యం, పల్నాటి వీర చరిత్ర మొదలగు కావ్యాలు రచించి ఎల్లప్పటికీ నిలిచిపోయే కవిత్వాన్ని అందించాడు. పద్యరచనలో తెలుగు నుడికారాన్ని నింపి సాహిత్యానికి పరిపుష్టిని కలిగించాడు. ఎంతో సుఖజీవితం గడిపిన శ్రీనాథుడు కడుపేదగా మారి మరణించడం ఎంతో విచారకరం. ఈతని సీస పద్యం విలక్షణంగా నుండును.

**పోతవ :** ఈ మధుర మహాకవి 14వ శతాబ్దివాడు. ఈతని తల్లి లక్కమాంబ, తండ్రి కేసన ఈ మహాకవి సహజ పాండిత్యం కలవాడు. ఈతని జన్మస్థలం ఓరుగల్లు జిల్లాలో " బమ్మెర " అనే గ్రామం. మహా భాగవతాన్ని తీయతీయని తెలుగు పలుకులతో ఎంతో అపూర్వంగా అనువదించి నరాంకితముగా కాక శ్రీరామునికే అంకితం చేసిన భక్తకవి. " భోగినీ దండకం", " వీరభద్ర విజయం" అను రెండు గ్రంథాలు ఈ మహాకవి రచించినవే. ఇతనికి అంత్యానుప్రాసపై మక్కువ ఎక్కువ.

**పాల్కురికి సోమనాథుడు :** ప్రసిద్ది చెందిన ఈ కవి శైవకవి. అనేక భాషలలో పండితుడు. తెలుగులో మొట్టమొదట ద్విపద కావ్య నిర్మాణం చేసి ప్రజా కవులకు బాట వేశాడు. తెలంగాణలోని పాలకుర్తి అనే గ్రామంలో జన్మించాడు. ఈయన రచనలైన బసవపురాణం, పండితారాధ్య చరిత్ర ఈ రెండు ద్విపద కావ్యాలు ఎంతో ప్రఖ్యాతి పొందినవి. ఉదాహరణ కావ్యప్రక్రియకు తొలికావ్యం ఇతని 'బసవోదాహరణం' అనే గ్రంథం. సంస్కృతంలోను ఈయన ' సోమనాథభాష్యం ' అనే గ్రంథాన్ని రచించాడు.

**పెద్దవ :** పెద్దన కవి 1590 - 1630 శతాబ్దికి చెందినవాడు. స్వారోచిష మనుసంభవం అను మనుచరిత్ర ప్రబంధమును వ్రాసినవాడు పెద్దన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి. అష్టదిగ్గజ కవులలో ప్రథముడు. ఆంధ్ర కవితాపితామహ బిరుదు గలవాడు. 'అల్లసాని వాని అల్లిక జిగిబిగి' యని అనిపించుకున్న ఈతని కవిత చక్కని ప్రబంధ వర్ణనలతో అలరారును. వరూధినీ, ప్రవరుల శృంగారము మనోహరంగా వర్ణించినాడు. కృతి సమర్పణ వేళ కృతిభర్తయగు శ్రీకృష్ణ దేవరాయలచే కాలికి గండ పెండేరమును తొడిగించుకొనెను. [illegible] ఈతని పల్లకిని స్వహస్తములతో ఎత్తెను. [illegible] చేయూతనిచ్చి ఏనుగు నెక్కించు కొనెను. నాటకీయ సంభాషణలతో, చక్కని మృదు పదజాలంతో, ఔచిత్యంతో జటిల సమాస ఘటిత వర్ణనలతో మను చరిత్ర తెలుగు ప్రబంధములలో తలమానికమైనది.

**రామరాజ భూషణుడు :** ఈకవి రచించిన వసుచరిత్రం శ్లేష ప్రబంధం. ఇది సంస్కృతభాషలోనికి అనువదింపబడినది. ఇతనిని భట్టుమూర్తి, మరియు రామరాజభూషణుడు అని అందురు. ప్రౌఢ కావ్యమైన ఈ గ్రంథం ఆద్యంతం శ్లేష పూరితం. ఒక్కొక్క పద్యమునకు రెంటికి మించిన అర్థములు పొసగును. ఇతడు సాహిత్యంతో పాటు సంగీత విద్వాంసుడు కూడా. కావున వసుచరిత్ర పద్యములు

**గాలిమేడల్లో ఎప్పుడూ విహరించేవాడు - జీవితంలో ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేడు.**

రాగతాళ యుక్తములై శ్రావ్య గానానుకూలములై యున్నవి. ఇతడు నరసభూపాలీయం అను అలంకార లక్షణ గ్రంథమును, హరిశ్చంద్రనలోపాఖ్యానమనుద్వ్యర్థికావ్యమును రచించెను. ఈతని వసు చరిత్ర ఛాయలో తెలుగులో అనేక పిల్ల వసు చరిత్రలు బయలుదేరినవన్న ఈ ప్రబంధ వైశిష్ట్యమెంతటిదో గ్రహించవచ్చును.

**నంది తిమ్మన : (1590 -1630)** ముద్దు పలుకుల ముక్కు తిమ్మన శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని అష్ట దిగ్గజ కవులలో ఒకడు. ఇతడు తిరుమల దేవితో అరణంగా వచ్చిన కవి. రాయలు - తిరుమలదేవిల ప్రణయ కలహము దెలిసి అద్దానిని మాపుటకై పారిజాతాపహరణ కావ్యమును రచించెను. అందు కృష్ణుడు సత్యభామ పాదతాడనమును కూడా శృంగార చేష్టగా భావించి అనునయించును. దేవలోకం నుండి పారిజాత వృక్షమునే ఆమెకు తెచ్చి యిచ్చెను. తిమ్మన ఈ కావ్యమును రాయల కంకితమిచ్చెను. రాజారాణీ కలహము మాని ఏకమైరి. ఈతని కవిత సరళము, ద్రాక్షాపాకముగా నుండును. ఇందలి నాటకీయత ఉచితముగా నున్నది. సత్యభామ శృంగార లీలలను ఆంధ్రులకు మనోరంజకంగా అర్పించిన యీకవి ధన్యుడు.

**తెనాలి రామకృష్ణుడు :** తెలుగులో హాస్య కథలు, అందు తెనాలి రామలింగని దెలియని వారుండరు. పాండురంగ మాహాత్మ్యమును రచించి వేదాద్రి మంత్రి అమ్మరాయనకానికి అంకితమిచ్చెను. చతురోక్తులతో, సమయానుకూలంగా కవిత చెప్పి మెప్పించగల చాకచక్యము ఈతనికి వెన్నతో పెట్టిన విద్య. ఇతని పద్యరచన అరుదైనది. హాస్యం, వ్యంగ్యం ఈతని సొమ్ము. ఇతడు కాళికాదేవి భక్తుడని ప్రతీతి. ఈతని పాండురంగ మహాత్మ్యంలోని నిగమ శర్మోపాఖ్యానం నవరస భరితము. ప్రతిభా వంతుడగు యీతని కవిత ప్రౌఢమైనది. ఉద్భటారాధ్య చరిత్ర ఘటికాచల మహాత్మ్యం యీ కవి ఇతర రచనలు.

**పింగళి సూరన :** ప్రబంధయుగమున క్రొంగ్రొత్తపోకడలు ద్రొక్కిన కవి పింగళిసూరన. ఇతడు రాయల అనంతరం అనగా 1660 ప్రాంతమున ప్రసిద్ధికెక్కినవాడు. అకువీటి పెదవేంకటరాయల ఆస్థానకవి. తెలుగు సాహిత్యమునందేకాక యితర భాషలయందును "నభూతో నభవిష్యతి" అనదగు కల్పనా ప్రబంధము, కళాపూర్ణోదయమును రచించి నంద్యాల కృష్ణమభూపున కంకితమిచ్చెను. ఈకవివరుడు షేక్స్పియర్ అను ఆంగ్ల కవికి సమకాలికుడు. అనల్ప కల్పనాచాతురీధురీణుడు. కళాపూర్ణోదయం మొట్టమొదటి

నవలా ప్రబంధం. ఆరు ఆశ్వాసములు చదువు వరకు కథాప్రారంభ విషయం తెలియదు. కథ ఆద్యంతములు తారుమారై మధ్యభాగం ఆదిగాను, ఆదిమధ్యభాగముగను రచించెను. శైలి నారికేళ కదళీపాక సమ్మిశ్రితం. ఈకళాపూర్ణోదయమున నీకవి ఉభయభాషాకందం వ్రాసినాడు. మొదట నుండి చదివిన అచ్చతెలుగుగను కడనుండి మొదటికి చదివిన సంస్కృతంగాను రచించినాడు. దీనిని బట్టి ఈకవికిగల సంస్కృతాంధ్ర భాషాపాటవములు వెల్లడియగుచున్నవి. వేములవాడ భీమకవిచెప్పినాడను రాఘవ పాండవీయం కనుకలికి, వినుకలికి దూరమై కాలగర్భమున గలియుటచేత. రాఘవ పాండవీయమును పింగళి సూరవను రచింపుమని అకువీటి పెద వేంకటరాయలు కోరగా రచించెను. రాఘవ పాండవీయం ద్వ్యర్థి కావ్యం. రామాయణ భారతములు రెండును ఒకే కావ్యముగా రచించెను. ప్రభావతీ ప్రద్యుమ్నమను మఱియొక ప్రబంధమును రచించి తన తండ్రికంకితమిచ్చెను. తాను గరుడపురాణమును రచించినట్లు రాఘవ పాండవీయమున పింగళి సూరన చెప్పుకొన్నాడు.

**వేమన :** ప్రజాకవి తత్త్వవేత్త యోగి వున వేమన.



చిన్నప్పుడు చెడు అలవాట్లతో పెడదారిపట్టిన వేమనను వదిన సరియైన దారికి మళ్ళించింది. అమెవల్లనే వేమనకు సాహిత్యాభి రుచికూడా అలవడింది.

లంబికా శివయోగివద్ద వేమన గురూపదేశం పొంది వేమన యోగి అయినాడు. ఆతరువాత తేలికయిన పదాలతో అనుభవాలకు పద్యరూపం కల్పించి ప్రజాకవి అయినాడు.

"ఉప్పుకప్పురంబు నొక్క పోలికనుండు"

"గంగ గోవు పాలు గరిటెడైనను చాలు"

వంటి అపూర్వమైన పద్యాలు సుమారు ఐదు వేల పైన రచించాడు వేమన.

ప్రతిపద్యంలో సమాజానికి నీతిని అందించాడు వేమన. విశ్వదాభిరామ వినురవేమ అనే మకుటంతో వేమన పద్యాల్ని రచించాడు.

వేమన పద్యాలను సేకరించి వాటికి ఒక ఉన్నత స్థాయిని మొదట కల్పించినవాడు ఆంగ్లేయుడైన సర్ ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

**తాళ్ళపాక అన్నమయ్య :** శ్రీ తిరుమల తిరుపతి వెంకటేశ్వరుని కీర్తిస్తూ అనేకములగు

కీర్తనలు పాడి జన్మ సార్థకం జేసి కొనినవాడు, తాళ్ళపాక అన్నమాచార్యులు. ఈతని కీర్తనలు టి.టి.డి భాండాగారం నుండి వెలికి దీసి ప్రచురించిన కీర్తి వేటూరి ప్రభాకర శాస్త్రిది. 'జో అచ్యుతానంద జోజోముకుంద' జోల పాట తెలియని తల్లి, అదివిని బజ్జోని పాపలు తెలుగు నాట ఉండరన్న అతిశయోక్తి కాదు. తాళ్ళపాక నుండి తిరుపతికి కాలినడకన వచ్చి పరవశంతో కొండనెక్కి, అలసిపడిపోగా శ్రీపద్మావతీ దేవియే తల్లియై అన్నం పెట్టగా భుజించి నూరు పద్యాలలో తల్లిని కీర్తించి మూసిన గుడి తలుపులనుభక్తి శక్తిచే తెరిపించి దైవసాన్నిధ్యాన్ని పొందిన భక్త శిఖామణి అన్నమయ్య. ఇతని కీర్తనలు భక్తి వైరాగ్య, శృంగారముల నోలలాడించును. నారాయణుందప్ప యెంతటి నరునైనా కీర్తించని ఘనుడు; ధన్యుడు.

**క్షేత్రయ్య :** మువ్వ గ్రామంలోని గోపాల దేవునిపై చెప్పిన పదములు మువ్వగోపాల పదములు. ఇవి పదకవి క్షేత్రయ్యవి. ఈతని పదములు త్యాగరాజు కీర్తనలతో పాటు సంగీత సభలందు గానం చేయబడుచున్నవి. పదములు నాట్యమునకు అనుకూలముగా నున్నవి. నటరాజు తాండవం చేయుచుండ రాలిన మువ్వయే యిలలో క్షేత్రయ్యగా జనన మంది గోపాలుని కీర్తించి ధన్యుడయ్యెనని ఐతిహ్యం కలదు. తంజావూరు రాజుల నాటి నుండి నేటి వరకు ఈతని కీర్తనలు భక్తి శృంగార రస పూరితంలై సర్వజనాదరణను పొందుచున్నవి. భక్తుడు తానొక గోపికయై మురళీగానలోలుని స్వామిగా భావించి గానంతో తనవానిగా జేసికొనుటయే యీ పదముల తాత్పర్యము.

**రాయప్రోలు సబ్బారావు :** ఇతడు భారత స్వాతంత్ర్య సమరంలో అక్షర సమరం చేసిన ప్రథమ భావకవి. నవ్య కవితకు నన్నయ వంటివాడు. బెంగాలీ కవితా ప్రభావం ఈతనిపై మెండు, శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యా లయమున ఆచార్యులుగా పనిచేశాడు. సరళం, మధురం మరియు నిశితమైనది ఈతని కవిత, కరుణ రసపూరిత రచనకు ప్రఖ్యాతుడు.సామాజిక సమస్యల పట్ల అధిక శ్రద్ధ జూపిన కవి.

ఆంధ్రావళి, తృణకంకణం ప్రఖ్యాత రచనలు దేశభక్తిపూరితమైన 'ఏదేశమేగినా' అన్న గేయం ఆంధ్రులకు కంఠస్థం.

**దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి :**



తెలుగులో భావకవితోద్యమానికి మూలస్తంభం దేవులపల్లి కృష్ణశాస్త్రి. పిఠాపురం దగ్గర చంద్రపాలెంలో 1897 నవంబరు 15న కృష్ణశాస్త్రి జన్మించాడు.

**మూఢనమ్మకం విజ్ఞానిని కూడా అజ్ఞానిని చేస్తుంది - విశ్వాసం దొంగను కూడా నమ్మకంగా పనిచేయిస్తుంది.**

'కృష్ణపక్షం', 'ఊర్వశి, ప్రవాసము' వీరి కృతులు. ఇది కృష్ణశాస్త్రి పాట అనే ముద్ర ఈతని ప్రతిగేయంలో కనపడుతుంది. సుతిమెత్తని పదాలతో హృదయాలను సున్నితంగా స్పర్శించే కృష్ణశాస్త్రిపాట ప్రకృతిని ఆకృతిగా ధరించిఅలవోకగా సాగిపోతుంటుంది. దేశభక్తి పాటలు, ఉత్తమ చలన చిత్రాల గీతాలు వీరి కలంనుంచే జాలువారినవి.

కళా ప్రపూర్ణ, పద్మభూషణ ఇత్యాది బిరుదులు ఇతనికి లభించాయి. చక్కని కంఠంతో పాట పల్లకీని తెలుగునాట పల్లె పల్లెకు తిప్పిన ఈ కవి తన స్వర పేటికను కోల్పోయి మూగవానిలా తుది జీవితం గడిపి మనకు దూరమైనాడు.

**విశ్వనాథ సత్యనారాయణ :** ప్రతిష్ఠాకరమైన " జ్ఞాన పీఠ్ " అవార్డును అందుకున్న తొలి తెలుగు మహాకవి కవిసామ్రాట్. విశ్వనాథ సత్యనారాయణ. కవి, రచయిత, నాటకకర్త, సాహితీ విమర్శకుడు, మహావక్త, కావ్య గాయకుడు, విశ్వనాథ సత్యనారాయణ, కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో 1895 సెప్టెంబర్ 10వ తేదీన జన్మించాడు. శ్రీమద్రామాయణ కల్పవృక్షం అనే గ్రంథానికి 'జ్ఞానపీఠ్' అవార్డు లభించింది. " వేయి పడగలు " అనేది ఒక ప్రసిద్ధి పొందిన నవల. ఇంకా చెలియలి కట్ట, ఏకవీర, ఆంధ్రప్రశస్తి, కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, పురాణ వైర గ్రంథమాల ఇలా కావ్యాలు, నవలలు, చారిత్రకములు, పౌరాణికాలు, సామాజికములకు సంబంధించిన ఖండకావ్యాలతో వీరు రచనలు వందల కొలది. వెలువరించి శతాధిక గ్రంథకర్తగా పేరుపొందాడు. కొన్నాళ్ళు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవిగాను ఉన్నాడు.

**శ్రీశ్రీ :** శ్రీరంగం శ్రీనివాస రావు వీరి పూర్తిపేరు. 1910 జనవరి విశాఖపట్టణంలో జన్మించారు.



ఆధునిక కవిత్వానికి యుగకర్తగా శ్రీశ్రీ పేరుపొందారు. ప్రకృతి, పడతి, ప్రణయాలకు అంకితమైన కవితారథాన్ని సామాన్య మానవుల వైపు పీడితులు, తాడితుల వైపు నడిపించిన విప్లవకవి. " కష్టజీవి " రెండు వైపుల కవి ఉండాలని బోధించిన తొలి మార్గదర్శి మన శ్రీశ్రీ.

1950లో మొదటిసారి అచ్చయినది వీరి " మహా ప్రస్థానం " అనే గ్రంథం. "ఖడ్గసృష్టి ", " చరమరాత్రికథలు ", " మరో ప్రస్థానం " ఇతని మరికొన్ని రచనలు. సినిమా రచయితగా తన జీవితాన్ని కొనసాగిస్తూ సినీ గీతాలలో కూడా సమాజ

విలువలకు అక్షర రూపం కల్గించిన మహాకవి శ్రీశ్రీ. తెలుగు కవిత్వంలో అనేక కొత్త ప్రక్రియలు ప్రవేశపెట్టారు. కార్టూన్ కవితలు, హాస్య కవితలతో ' లిప్రాసి ' అనే పుస్తకాన్ని వెలువరించారు. ' చైతన్య స్రవంతి ' అనే రచనా పద్ధతిని మొదటిసారి తెలుగులో ప్రవేశపెట్టినవారు శ్రీశ్రీ. 1983 జూన్ 15న శ్రీశ్రీ మనకు భౌతికంగా దూరమైనారు.

**గుర్రం జాషువ :**



ఆధునిక తెలుగుకవులలో ఉత్తమ శ్రేణికి చెందిన మహాకవి జాషువ.అంటరానివాడుగా బాల్యంలో ఎన్నో అవమా నాలను భరించినవాడు. తనకు గురువుగా ఉండటానికి ఏ పండితుడూ ముందుకు రాని స్థితిలో స్వయం కృషితో ఎదిగి ఉభయభాషా ప్రవీణుడుగా మారాడు.

తన కవిత్వాన్ని మెచ్చుకొన్నవారే తన కులం తెలుసుకొని దూరంగా వెళ్లేవారట. ఫిరదౌసి, గబ్బిలం, ముంతాజ్ మహల్, కొత్తలోకం మొదలగునవి ఇతని గ్రంథాలు.

అప్పటి ఆస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రితో గండపెండేరం తొడిగించుకునే స్థాయిని స్వయం ప్రతిభతో తెచ్చుకున్న మహాకవి గుర్రం జాషువా. భారతప్రభుత్వం ఇతనికి పద్మభూషణ బిరుదునిచ్చి గౌరవించింది.



**గురజాడ అప్పారావు :** 1861లో విశాఖ పట్టణం జిల్లాలో రాయవరం గ్రామంలో జన్మించాడు. రచనలలో వ్యావహారిక భాష అనగా వాడుకభాష ఉండాలనే గిడుగు రామమూర్తి పంతులు ఉద్యమాన్ని మనసారా అభినందించి, ఆచరించి చూపిన కవి, రచయిత గురజాడ.

ఆ రోజులలో డబ్బుతీసుకొని వృద్ధులకు తమ చిన్నారి బిడ్డలను ఇచ్చే చెడు ఆచారాన్ని వ్యతిరేకిస్తూ గురజాడ రచించిన కన్యాశుల్కం అనే నాటకం ఈ నాటికీ ఒక అద్భుత మహానాటకంగా ప్రఖ్యాతి పొందుతున్నది. కాళ్ళకూరి నారాయణరావు రచించిన వరవిక్రయం ఈ కోవకు చెందిన నాటకమే చిన్నతనంలో చేసే వివాహాలను వ్యతిరేకిస్తూ రాసిన " పూర్ణమ్మకథ " ఎంతో గొప్పది. ముత్యాల సరాలు, లవణ రాజుకల, డామన్ పితియస్ అనే గేయకథలు, దిద్దుబాటు, మీపేరేమిటి అన్న కథలు కూడా గురజాడ గొప్పరచనలు. గురజాడ 1915 నవంబరు 30న మరణించాడు.

**పరవస్తు చిన్నయ సూరి :** బాలురకు సులభంగా గ్రహింప బడువట్లు చిన్నయ బాలవ్యాకరణమును రచించెను. తొమ్మిదేండ్ల వరకు అక్షరం కూడా నేర్వని యీతడు అభిమానపడి ఒక్కనాట మొత్తం అక్షరములు మరియు గుణింతమును నేర్చుకొనెను. తెలుగు, సంస్కృతం చక్కగా అభ్యసించి పండితుడై మదరాసు ప్రెడెన్సీ కళాశాల యందు తెలుగు పండితుడుగా పనిచేసెను. తెలుగునకు సలక్షణమైన వ్యాకరణం రచించి నందులకు కళాశాల ప్రిన్సిపాలు ఈతనికి బంగారు కంకణం బహూకరింపదలచి దానిపై చిన్నయపేరు చెక్కించదలచి గౌరవార్థం యేపదం చేర్చవలెననగా శర్మ, వర్మ, ఆచార్య శబ్దములు తగవని 'సూరి' శబ్దం వ్రాయించు మనెను. సూరి యనగా పండితుడు అని అర్థము ఆ కంకణముపై సీమనుండి 'చిన్నయసూరి' అని వ్రాయించి తెప్పించి స్వయంగా ప్రిన్సిపాలు ఆతని చేతికి తొడిగెను. ఇతడు అక్షరక్రమమున పదకోశం వ్రాసెను. కాని అది పూర్తి కాలేదు.

**కందుకూరి వీరేశలింగం పంతులు :**

1848 ఏప్రిల్ 16న రాజమండ్రిలో జన్మించాడు. కొంతకాలం ఉపాధ్యాయుడుగా పనిచేసిన ఈయన 1876లో ' వివేకవర్ధిని ' అనే పత్రికను పెట్టి ఆనాటి అధికార వర్గాల తప్పుడు పనులను విమర్శించేవాడు.

స్త్రీల సమస్యల గురించి ఉద్యమం ప్రారంభం చేశాడు. ఆనాడు స్త్రీకి భర్త మరణిస్తే మళ్ళీ వివాహాలు ఉండేవికావు. కాని ఆయన పునర్వివాహాలు చేసుకోవడం తప్పుకాదని బోధించేవాడు. 1881లో " చమత్కార రత్నావళి " అనే నాటకాన్ని ఆంధ్ర ప్రదేశ్‌లో మొదటిసారి ప్రదర్శింపచేశాడు. 1881 డిసెంబర్ 11న రాజమహేంద్రవరంలో మొదటి వితంతు వివాహం జరిపించాడు. ఇంకా ఎన్నెన్నో వితంతు వివాహాలు చేయించాడు. " రాజశేఖర చరిత్ర " అనే మొట్టమొదటి నవల, " ఆంధ్ర కవుల చరిత్ర' " స్వీయ చరిత్ర " కందుకూరి గొప్ప రచనలు.

**ఉన్నవ లక్ష్మీ నారాయణ :** 1873 డిసెంబర్ 4న లక్ష్మీనారాయణ జన్మించాడు. 1913లో ఐర్లండుకు పోయి డబ్లిన్ నగరంలో చదివి బారిస్టర్ పట్టం పొందాడు. ఐర్లాండ్ స్వాతంత్ర్యోద్యమ నాయకుడు డీవెలరాతో చేసిన స్నేహం లక్ష్మీనారాయణలో స్వతహాగా వున్న దేశభక్తి భావాన్ని మరింతగా ఇనుమడింపచేసింది. 1920లో గాంధీ పిలుపుతో స్వాతంత్రోద్యమంలో చేరాడు. మూడు సంవత్సరాలు జైలు శిక్ష

అనుభవించాడు. ఆయన రచించిన " మాలపల్లి " అనే నవల స్వాతంత్ర్య సాంఘిక నవలలకు ఆదర్శప్రాయంగా నిలిచింది. గొప్పదేశభక్తుడుగా, సంఘ సంస్కర్తగా ఎంతో పేరుదెచ్చుకున్నవాడు ఉన్నవ లక్ష్మీనారాయణ.

**గుడిపాటి వేంకటాచలం :**



'స్త్రీలకు స్వేచ్ఛ' అనే అంశాన్ని బలంగా రూపొందిస్తూ మరెవ్వరూ వ్రాయలేనంత గొప్పగా రచించిన రచయిత చలం. అతడే గుడిపాటి వేంకటాచలం. స్త్రీ అనే వ్యాస సంపుటి ఆనాటి పాఠకలోకానికి స్త్రీల పట్ల కొత్త వెలుగుల్ని ప్రసరింపచేసింది. మైదానం, పాపం, పావిత్రి, చిత్రాంగి మొదలైన ఆయన రచనలు సాహితీ ప్రపంచంలో ఒక కొత్త పంచలనం కలిగించాయి.

ఆనాటి భర్తలు చలం రచనలను చదవకుండా భార్యలు కట్టుదిట్టం చేశారంటే అసత్యంకాదు. రవీంద్రుని " గీతాంజలి " ని తెలుగులోకి అనువదించాడు చలం. ఇతని లేఖలు, ముందుమాటలు, అనేకమైన నాటికలు, ఎన్నెన్నో రచనలు. ఒక్కొక్క రచన ఒక్కో తుఫానులా జనంలోకి చొచ్చుకొనిపోయాయి. అవసానదశలో చలం " భగవాన్ రమణమహర్షి " శిష్యుడై అరుణాచలంలో స్థిరపడిపోయాడు.

**డా॥ సి. నారాయణ రెడ్డి :** ప్రముఖకవి, సినీ గేయ రచయిత, " జ్ఞానపీఠ్ " అవార్డును అందుకున్న రెండవ తెలుగుకవి. 1931 నవంబర్ 15న కరీంనగర్ జిల్లా హనుమాజీపేటలో జన్మించారు. నవ్వని పువ్వు, కర్పూర వసంతరాయలు, నాగార్జున సాగరం, విశ్వంభర, భూమిక, మధ్య తరగతి మందహాసం ఎన్నెన్నో కవితా గ్రంథాలను అందించారు. "ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయాలు, ప్రయోగాలు " అనే వీరి పరిశోధనా గ్రంథం ఇవాళ ప్రతి ఎం.ఏ. ఎం.ఫిల్, పిహెచ్.డి. విద్యార్థులకు అవసరమైన గ్రంథం. వేలాది సినిమాపాటలతో ఆంధ్రదేశంలోని ఆబాలగోపాలన్ని అలరించిన కవి నారాయణ రెడ్డి. 1990లో ఆయన స్వగ్రామాన్ని నారాయణ పేటగా ఆ వూరి ప్రజలు మార్చుకున్నారు.

**తిరువళ్ళువర్** క్రీ.శ.ఒకటవ శతాబ్దానికి చెందిన తమిళ మహాకవి తిరువళ్ళువర్, ఈయన రచించిన గ్రంథం ద్రవిడ వేదంగా ప్రసిద్ధిచెందిన తిరుక్కుఱళ్. 'తిరు' అంటే శ్రీ అని అర్థం. 'కుఱళ్' ఆటవెలది వలె ఒకానొక ఛందోభేదం. ఈ పద్యానికి రెండు పదాలుంటాయి. మొత్తం పద్యాలన్ని ఈ ఛందస్సుతోనే రచించినందువల్ల గ్రంథానికి ఈ పేరు స్థిరపడింది. వేమన పేరు వినని తెలుగువారివలేనే ఒక్క 'కుఱళ్' కూడా తెలియని తమిళుండడంటే అతిశయోక్తి కాదు. వేమన దర్శించిన జీవిత పత్యాలు వ్యంగ్యరూపంలో ఆటవెలదుల్లో కళ్ళెదుట నర్తిస్తాయి. ప్రజా

జీవితంలో అన్ని అంశాలు సూక్తుల రూపంలో 'తిరుక్కుఱళ్' లో కన్పిస్తాయి. వేమన పద్యాలలో చొరబడినట్లు ప్రక్షిప్తాలు 'తిరుక్కుఱళ్'లో లేవు. తిరువళ్ళువర్ శాస్త్రీయంగా ఈ గ్రంథాన్ని విభజించిన తీరు ప్రక్షిప్తాలకు అవకాశం కల్పించలేదు. చతుర్విధ పురుషార్థాలలో (ధర్మార్థకామమోక్షాలు) తొలి మూడింటివి - అంటే ధర్మార్థకామ విభాగాలు ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. ఈ గ్రంథంలోని సూక్తులు మొత్తం 1330. ప్రతి పది సూక్తులు ఒక శీర్షిక కింద అమర్చబడ్డాయి. అంటే 133 విభాగాలన్నమాట. ధర్మవర్గంలో 38 విభాగాలు, అర్థ వర్గంలో 70 విభాగాలు, కామ వర్గంలో 25 విభాగాలు వున్నాయి. కులమతాతీతంగా, సర్వకాలాలలో, సర్వజనులకు మితం కూర్చునవిగా ఈ సూక్తులు అలరారుతున్నాయి. రెండు పాదాలలో అల్పాక్షరాలతో అనల్ప విషయ ప్రస్తావన ఉన్న కారణంగా గుర్తు పెట్టుకోవడానికి అనుగుణంగా వున్నాయి. వ్యాఖ్యాతలకు తగినంత పని, ఊహలను ఉరికిస్తాయి. దైవ ప్రస్తావన మొదటి పది సూక్తులలో కన్పిస్తుంది. కాని అక్కడ 'భగవంతుడు' అన్నపదమే వుంది. ఏమత సూచకమైన భగవన్నామం ఇందులో ప్రస్తావించబడలేదు. కనుకనే సర్వమతస్థులు తిరువళ్ళువర్ తమ మతానికి చెందిన వాడుగా పేర్కొన్నారు. వాస్తవానికి మానవ సేవాధర్మాన్ని మహోన్నతంగా భావించిన వ్యక్తి తిరువళ్ళువర్. రెండువేల సంవత్సరాల క్రితం రచించిన గ్రంథమైనా ఈనాటికీ సుప్రసిద్ధ గ్రంథమై, తమిళ ప్రజలకు మార్గదర్శిగా, సాహితీ వేత్తల పాలిటి కల్పవల్లిగా వుంటున్నది. కేవలం తమిళ ప్రజలకే కాక సమస్త మానవాళికి ఆరాధ్యమైన గ్రంథంగా భావించాలి. బైబిల్ తర్వాత ఎక్కువ భాషల్లో అనువదించబడి అమ్ముడయిన గ్రంథం ఇది. ముద్రణ సౌకర్యం ఏర్పడిన తర్వాత కేవలం తమిళంలో మాత్రం రెండు కోట్ల ప్రతులు ముద్రితమై ఉండవచ్చునని పరిశోధకుల అంచనా, ఇటువంటి ప్రసిద్ధ గ్రంథాన్ని గురించి కనీస పరిచయం కలిగి వుండడం మంచిది. డాగాలి గుణశేఖర్ 'శ్రీ వాణి' అన్న పేరిట తెలుగులోకి ఈ గ్రంథాన్ని అనువదించారు. అందులో మంచి కొన్ని సూక్తులు ఈ క్రింద ఉదహరించబడినవి.

వర్ష ప్రశంస: 1. [illegible] - కరువు లరక దున్నిన కష్టఫలము. 2. పెంటి మండి చినుకు [illegible] - [illegible] మిలను కావరాదు. 3. జలము లేనిచో జీవన మిలను లేదు - వానలేక మంచి నడత కానలేము.

ధర్మ ప్రతిపాదన: 4. పల్లకిని మోయువానికి పదపడిచను - [illegible] ధర్మఫలము మాట వలదు. (పల్లకిని మోస్తున్నవాడికి, అందులో కూర్చున్న వాడికి మధ్య ధర్మాధర్మాలను గురించి ప్రస్తావించవద్దు. మోసేవాడికి ధర్మాధర్మాలు ఉంటుంది. కూర్చున్నవాడు ఎప్పుడూ పాపాత్ముడే నేటి సమసమాజ భావన ఇందులో కన్పిస్తుంది).

గృహిణీ ప్రశస్తి: 5. ఇంటియాలు మంచిదేని కావలెనేమి? - ఇంతి చెడిన దేని ఏమి మిగులు?
సంతాన సంపద: 6. వేణు వింపగు, వింపగు వీణయనును - తన శిశువు ముద్దు పలుకులు విననివాడు.
ప్రేమ
7. చెట్టెడారిలోన చిగురించిన విధమగు - ప్రేమలేని వాని పేద బ్రతుకు.
**మధుర భాషణం:**
8. మంచిమాట నడుమ మనుజాని విడిపోవు - దుఃఖదాయి లేమి దూరముగను (మధురబాషణం చేసే మనిషికి, దుఃఖం కలిగించే దరిద్రం దూరమవుతుంది)
మహిళలు అంటే ఆడవాళ్ళు, అమ్మ, అక్క, చెల్లి, భార్య, కూతురు ఇలా అందరు మహిళలే, కనిపించే ప్రతి మహిళ మన తల్లికీ, చెల్లికీ ప్రతిరూపమే.
ఆడవాళ్ళు మగవాళ్ళతో సమానం కాదు అనేది ఒక తప్పు అభిప్రాయం. జన్మనిచ్చే స్త్రీ దేవుడికన్నా గొప్పది. స్త్రీలను గౌరవించడం ఒక సభ్యత, సంస్కారం కూడా.

ఆడవాళ్ళంటే కేవలం ఇంటి చాకిరీ, వంట చాకిరీ చేసేవాళ్ళు మాత్రమే అనుకోవడం పొరపాటు. ఆనాటి సత్యభామ నుండి మొన్నటి రాణీ రుద్రమ, ఝాన్సీ లక్ష్మీభాయి, నిన్న మొన్న నైజాం పరిపాలిస్తున్న రోజులలో అరవై ఊర్ల అధిపతిని విసునూరి రామచంద్రారెడ్డిని ఎదురించిన పాలకుర్తి చాకలి అయిలమ్మ వరకు స్త్రీలు ఎంతో గొప్పవాళ్లు అని నిరూపించుకున్నారు.

ఈనాడు ఒక డాక్టరుగా, ప్రధానమంత్రిగా, ఒక సైంటిస్టుగా చంద్రమండలంలో అడుగుపెట్టిన వనితగానూ ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన స్త్రీగానూ గొప్పగా రాణిస్తున్న స్త్రీలను చూస్తూ కూడా మహిళలను తక్కువగా అంచనా వేయడం ,తక్కువగా ఆలోచించడం మూర్ఖత్వం. నిజాలను గుర్తించలేని గుడ్డితనం.

ఎక్కడ స్త్రీలను గౌరవిస్తారో అక్కడ దేవతలు విహరిస్తారన్నది నిత్యసత్యం.

## వీర వనితలు

**రుద్రమదేవి :**

ఈమె కాకతీయ సామ్రాజ్యాన్ని ఓరుగల్లు రాజధానిగా పరిపాలించిన మహారాణిగా ప్రసిద్ధి చెందిన కాకతీయ గణపతిదేవుని ఒక్కగానొక్క కూతురు. ఆ తండ్రికి మరో మగ సంతానం లేనందువలన అతడు రుద్రమదేవినే యుద్ధ విద్యల్లోనూ, రాజనీతిలోనూ సమర్థురాలుగా చేసి పెంచాడు.

1262లో గణపతిదేవుడు మరణించగానే ' రుద్రదేవ మహారాజు ' అనే పురుష నామంతో ఆమె రాజ్యాన్ని పరిపాలించింది. ఆడది అనే చులకన భావంతో ఓరుగల్లు పై దండెత్తిన మహాదేవుని , పలువురు సామంత రాజులను అణచివేసి మళ్ళీ తలెత్తకుండా ఓడించి యుద్ధభూమిలో బుద్ధి చెప్పింది.

ఈవిధంగా శత్రుసంహారం కావించి శాంతియుతంగా రాజ్యపాలన చేసి సాహిత్యం, శిల్పం, సకల లలిత కళలను పోషించి చక్కని మహారాణి అనే పేరు పొందింది. వీర వనిత రుద్రమదేవి.

**ఝాన్సీ లక్ష్మీబాయి :** భరతమాత ముద్దు బిడ్డ. స్త్రీ అంటే కేవలం వంట యింటికి పరిమితం కాదు ' తలచుకుంటే కాళిక ' అని నిరూపించిన వీరవనిత ఝాన్సీ లక్ష్మీబాయి.

1835 నవంబర్ 19న మోరో పంత్ భగీరథీ బాయికి జన్మించిన ఈమె మొదటి పేరు మనూబాయి. కత్తివిద్య, గుర్రపుస్వారి, యుద్ధరంగంలో శత్రువుల వ్యూహాలను దెబ్బతీసే నేర్పును మగపిల్లలకన్నా మిన్నగా నేర్చుకుంది.

బుందేల్ఖండ్ రాజ్యం పాలిస్తున్న గంగాధర్ రావుతో ఆమెకు వివాహం జరిగాక మనూబాయి పేరుపోయి లక్ష్మీబాయిగా మారింది. ఒక కుమారుడు జన్మించి మరణించడంతో భర్త మనోవ్యాధితో మంచంపట్టాడు. ఆ తరువాత ఐదు సంవత్సరాల వయస్సుగల ఆనందరావును దత్తత తీసుకున్నారు. ఈలోగా భర్త గంగాధర రావు మరణించాడు. ఈ సమయం కనిపెట్టి ఆంగ్లేయ డలహౌసీ ప్రభువు ఝాన్సీకోటను ఆక్రమించుకొన్నాడు. అపుడు లక్ష్మీబాయి ఆంగ్లేయుల మీద తిరుగుబాటు చేసింది.

1858 మార్చి 22న ఆంగ్లేయ సైనికులకూ లక్ష్మీభాయి సైనికులకూ మధ్య యుద్ధం ప్రారంభమైనది. 1858 జూన్లో 18 రోజుల పాటు భయంకరంగా యుద్ధం సాగింది. ఝాన్సీ లక్ష్మీబాయి ఒక్కతే సైనికులతో సంబంధం లేకుండా 15 రోజుల పాటు యుద్ధం చేసింది. ఫిరంగి దెబ్బలకు శరీరం తూట్లు పడుతున్నా ఆమె ధైర్యం కోల్పోలేదు. చివరకు దొంగచాటుగా ఒక శత్రు సైనికుడు ఆమె కుడి భుజం నరుకగా, మరొకడు ఆమె గుండెల్లో పొడిచాడు. ఒకవైపు ప్రాణం పోతున్నా ఆ ఇద్దరిని చంపిన తరువాతే ఆ వీరవనిత కన్నుమూసింది.

స్త్రీ అజేయురాలని రక్తాక్షరాలతో చరిత్రలో వ్రాయదగిన స్థానం సంపాదించుకుంది.

# లలిత కళలు

కళలు మనకు ఆనందాన్ని, ఆత్మవికాసాన్ని కలిగిస్తాయి. అసలు కళలు ఆకాశంలోంచి ఊడిపడినవి కావు. అవి ప్రజల జీవితాలు అనే గనుల నుండి తీసుకున్న బంగారు గుళికల లాంటివి. లలితకళలు ఆరు చిత్రం, శిల్పం, నాటకం, నాట్యం, సంగీతం, సాహిత్యం.





**1) చిత్రకళ :** ఇది పురాతనమైన కళ. ఆదిమానవులు గుహలలో జంతువుల వేట మొదలగు చిత్రాలు గీసేవారు. ఎంతో మనోహరమైనది చిత్రకళ. చిత్రాలు అనేవి మాటలు లేని కవితలని అంటారు. చిత్రములను గీయడమే చిత్రకళ. ఇందులో పెయింటింగ్, (వర్ణచిత్రాలు), ప్రకృతి చిత్రాలు, వ్యంగ్య చిత్రాలు (కార్టూన్స్) ముఖ్యమైనవి.

ఒక పెన్ను, పెన్సిల్ లేదా ఒక కుంచె (బ్రష్) రంగులనుపయోగించి చిత్రాలను గీస్తూంటారు.

**2) శిల్పం :** శిల్పకళ అతి ప్రాచీనమైనది. ఆది మానవులు రాళ్ళతో ఆయుధాలు తయారుచేసుకునే పరుపలోనే ఈ శిల్పకళ ప్రారంభమైనది. శిలలను అందమైన ఆకృతులుగా తీర్చడమే శిల్పకళ. అయితే ఒక శిలలనే కాదు కంచు, రాగి, బంగారం లాంటలోహములతోనూ, పింగాణి, ఏనుగు దంతములు, గాజు, కలపతోను అనేక మూర్తులు అందంగా చెక్కి శిల్పాలుగా తీర్చిదిద్దడమూ శిల్పకళయే.





**3) నాటకం :** నాటకమును రూపకం అని కూడా అంటారు. ఒక కథను తీసుకొని అందులోని పాత్రలను ధరించి నటులు నటిస్తూ ఆ కథను ప్రేక్షకుల కనులముందర జరుగుతున్నదేమోనన్న అనుభూతిని కలిగించేదే నాటకం. ఇందులో వేషం, ఉచ్చారణ, నటన ప్రధాన పాత్ర వహిస్తాయి.

బాధ్యతలను నిర్వహించలేకపోతే బ్రతుకే చిక్కుల ముడి – అవరోధాలను కృషితో అధిగమిస్తే జీవితం సుఖాలవడి.

4) **నాట్యం :** ఒక ప్రసిద్ధమైన కథలోని పాత్రలను గానం చేస్తూ సుకుమారంగా ఆడటమే నాట్యం. ఇది నృత్యం, నృత్తం అని రెండు రకాలు.

నృత్యమంటే పాడుచు రాగ తాళ, లయబద్ధంగా హావ భావాలతో అంగ విన్యాసములతో అభినయించుట.

నృత్తమంటే సంగీతం, పాట లేకుండా కేవలం ప్రక్కవాయిద్యాలతోటే అభినయించుట. ఇవి లలితమైతే లాస్యం, భయంకరమైతే తాండవం అనబడతాయి.



5) **సంగీతం :** ఆనందాన్ని, ఉత్సాహాన్ని ప్రశాంతతను కలిగించే తీయని కళ సంగీతం.

తాళం, నాదం, రాగం, శ్రుతి, లయలతో కూడినది సంగీతం. హిందుస్థానీ, కర్ణాటకసంగీతాలు మనదేశంలో ప్రధానమైనవి.

జానపద సంగీతం కూడా మనదేశంలో వివిధ ప్రాంతాలలో పుట్టి తమ తమ ప్రత్యేకతలతో ఎంతో ప్రసిద్ధి సంతరించుకుంది.

**స రి గ మ ప ద ని** అను ఏడు సంగీత స్వరాలతో శ్రోతల హృదయాలను తర తరాలుగా ఏలుతున్నది ఈ సంగీతం.



6) **సాహిత్యం :** హితము కూర్చేదే సాహిత్యం. కవిత్వం, (గేయం, పద్యం, వచనకవిత) కాల్పనిక సాహిత్యం, జీవిత చరిత్ర, కథ, నవల, డైరీ, లేఖ, వ్యాసం, అనువాదం మొదలగు విజ్ఞాన సర్వస్వం సాహిత్యమే.

ప్రజలకోసం, ప్రజాచైతన్యంకోసం అక్షరరూపం ధరించినదే అసలైన సాహిత్యం.

# శాస్త్రాలు - పరిచయాలు

## తత్త్వశాస్త్రం

తత్త్వం అవగా ప్రకృతి ప్రపంచాల పరిణామాలను తెలుపునది

' తత్త్వమసి ' అనగా ఏదైతే వున్నదో అదే నీవు అని అర్థం.

ఆంగ్లంలో దీనిని ఫిలాసఫీ అంటారు. ఫిలియా, సోఫియా అనే రెండు గ్రీకు మాటల కలయిక. ఫిలియా అంటే ప్రేమ, సోఫియా అంటే జ్ఞానం కనుక ఫిలాసఫీ అంటే ' జ్ఞానాసక్తి ' అనే అర్థంగా నిలిచిపోయింది.

తత్త్వశాస్త్రంలో నీతిశాస్త్రం, తర్కశాస్త్రం, జ్ఞాన సిద్ధాంతం, మానసిక శాస్త్రం అనే ప్రధాన భాగాలు వున్నాయి.

గొప్ప వాళ్లంతా వేకువ జామున లేచిన వారే.

## మనస్తత్వశాస్త్రం

దీనిని మనో విజ్ఞాన శాస్త్రం (సైకాలజీ) అని కూడా అంటారు. మానవుల, జంతువుల ప్రవర్తనలను అధ్యయనం చేసే శాస్త్రమే సైకాలజీ.

సైకే, లోగోస్ అనే గ్రీకు మాటల కలయికే సైకాలజీ అదే మనో విజ్ఞాన శాస్త్రం ఇందులో ప్రధానమైన భాగాలు పదకొండు.

1) అపసామాన్య మనోవిజ్ఞానశాస్త్రం
2) జంతుమనోవిజ్ఞానశాస్త్రం
3) అనుప్రయుక్త మనోవిజ్ఞానశాస్త్రం
4) శిశుమనోవిజ్ఞానశాస్త్రం
5) చికిత్సా మనోవిజ్ఞానశాస్త్రం
6) భేదాత్మకమనో విజ్ఞానశాస్త్రం
7) విద్యామనో విజ్ఞానశాస్త్రం
8) ప్రయోగాత్మక మనో విజ్ఞానశాస్త్రం
9) పారిశ్రామిక మనో విజ్ఞానశాస్త్రం
10) సాంఘిక మనో విజ్ఞానశాస్త్రం
1) వికాస మనో విజ్ఞానశాస్త్రం

## రాజకీయ నీతి శాస్త్రం

సామాజిక ప్రగతికోసం ప్రజలు జరిపే కృషిని తెలిపేదే రాజనీతి. రాజకీయ పార్టీలు, ఎన్నికలు, ప్రభుత్వ యంత్రాంగం, పరిపాలన రాజ్యాంగం, అంతర్జాతీయ సంస్థలు, దేశాల మధ్య సంబంధాలు మొదలగు అంశాలను తెలిపేదే రాజనీతి శాస్త్రం.

## అర్థశాస్త్రం

ఒక దేశంలోని ఉత్పత్తి, పంపకం, పెట్టుబడి, ద్రవ్యవ్యవస్థ, స్వదేశ విదేశాల వ్యాపార వ్యవహారాలను అధ్యయనం చేసే శాస్త్రమే అర్థశాస్త్రం.

అర్థం అంటే డబ్బు. డబ్బుతో ముడిపడి వున్న అన్ని సమస్యలను సంపూర్ణంగా చర్చించేదే అర్థశాస్త్రం.

# వాస్తు సత్యాలు - ప్రాథమిక సూత్రాలు

ప్రకృతి శక్తులుగా మనకు కనిపించే పంచభూతాలైన ఆకాశం, గాలి, నీరు, అగ్ని, భూమి అనేవి వాస్తు శాస్త్రానికి పంచ ప్రాణాలు. వీటిల్లో వెలుగును ప్రసరించే సూర్యుని కిరణాలు అతి శక్తివంతమైన స్థానాన్ని ఏర్పరుచుకున్నాయి. మనం నివసించే ఇల్లు ఈ పంచభూతాల ప్రభావాలను ఆహ్వానించేదిగా, గాలి, నీరు తదితర ప్రకృతి వనరులుఇంట్లో నిలబడేలా నిర్వచించి నిర్మాణం చేసేదే, 'వాస్తు

వేదకాలం నాటి నుంచే ఈ శాస్త్రానికి ఎంతో గుర్తింపు ఉంది. అయితే అట్టి ప్రాచీన వాస్తుశాస్త్రంలోని మూలమైన విషయాలను పరిశీలించి నాడు కులాలకు స్థలాలు , వ్యక్తులను బట్టి ఇల్లు మొదలైన పురాతన ఛాందస భావాలను తొలగించి ఆధునికులకు అవసరమైన తీరులో నూతన వాస్తు శాస్త్రాన్ని అందించడానికి నేను

(గౌరు తిరుపతి రెడ్డి) పది మంది మిత్రులతో కలిసి 1989 మేలో యావత్ భారతదేశంలోని గుళ్ళు, గోపురాలు, చారిత్రిక కట్టడాలు పరిశీలించి, పరిశోధించి అనేక శాస్త్ర సత్యాలను అనుభవపూర్వకంగా తెలుసుకున్న తరువాత ఆధునిక వాస్తు గ్రంథాన్ని " వాస్తు శాస్త్ర వాస్తవాలు " అనే పేరున మీకు అందించాము. తెలుగునాట ఏ గ్రంథం పొందని ముద్రణల్ని ఈ గ్రంథం పొంది 8 భారతీయ భాషల్లోకి అనువదించబడినది.

**స్థలం ఎంపిక :**

చతురస్రంగానైనా లేదా సమకోణ దీర్ఘచతురస్రాకారంగా నైనా ఉన్న స్థలాన్ని ఎన్నుకోవాలి. విశాలమైన స్థలం మనల్ని వున్నత దశకు చేరుస్తుంది మనం ఎంచుకున్న స్థలం తూర్పుగా, ఉత్తరంగా, పల్లంగా ఉన్న స్థలమై ఉండాలి. ఈశాన్య దిశగా పల్లంగా వున్న స్థలమైతే ఎంత డబ్బు వెచ్చించి అయినా తీసుకోవాలి.

మన స్థలం యొక్క ఎత్తు పల్లాల ప్రభావం మన జీవితాలపై వుంటుంది కాబట్టి ఉత్తరం తూర్పు దిశలకు పల్లంగా ఉండి, పడమర దక్షిణాలు ఎత్తుగా ఉంటే మంచిది. అధిక విస్తీర్ణం గల స్థలాన్ని ఎంచుకోవడం మంచిది. అప్పుడే దానిలో అవసరమైనన్ని గదులు నిర్మించుకోవచ్చు.

సమాంతర రేఖలో ఉత్తరంగా తూర్పుగా వెళ్ళే రోడ్డున్న స్థలం ఎంతో మంచిది. మన స్థలం నుంచి బయలుదేరిన రోడ్డు మనల్ని తూర్పునకు గాని, ఉత్తరానికి గాని, ఈశాన్యానికి గాని నడిపించినట్లయితే ఎన్నో మంచి ఫలితాలు ఉంటాయి. లేక అదే రోడ్డు మనల్ని తూర్పు ఆగ్నేయానికి గాని, నైరృతులకు గాని, నడిపిస్తే యిబ్బందులు ఏర్పడతాయి. పోతే త్రిభుజాకారంలో వున్న స్థలాన్ని ఎప్పుడూ ఎంచుకోరాదు.

**శంకుస్థాపనము**

మొత్తం స్థలానికి ఈశాన్యంలో లేదా ఇల్లు నిర్మించే స్థలానికి ఈశాన్యంలో పునాది తీసి వాస్తుపూజ చేయాలి. అందులోనే నవధాన్యాలు వేసి తూర్పుముఖంగా పూజచేయాలి. మొత్తం స్థలం యొక్క ఈశాన్యంలో పునాది తీయడం మంచిది. ఇది అనాదిగా వస్తున్న ఆచార నియమం. కారణం ఈశాన్యంలో మొదట పునాది తీయడం వలన నైరృతి బరువై శుభకర మవుతుంది. ఇలా ఇంటికి మరియు ఇంటివారికి శుభాలు కలుగుతాయి.

**నుయ్యి - బోరింగ్ :**

ఇంటిలో బావి యొక్క నిర్మాణం అతి ప్రధానమైనది. కాబట్టి శాస్త్రపరంగా సూచించిన స్థలంలోనే నుయ్యి త్రవ్వుకోవడం, బోరింగ్ వేయించుకోవడం చేయాలి.

బావికి ప్రధానమైనటువంటి తూర్పు ఈశాన్యం ఉత్తర ఈశాన్యం దిశలలో నుయ్యి ఉన్నట్లయితే ఎన్నో మంచి ఫలితాలు అందుతాయి. పోతే తూర్పులో బావి త్రవ్వకోవచ్చు. తూర్పు ఆగ్నేయం, దక్షిణ ఆగ్నేయం, దక్షిణం, దక్షిణ నైరృతి, పశ్చిమ నైరృతి, పశ్చిమం, పశ్చిమ వాయవ్యం, ఉత్తర వాయవ్యాలలో బావిని త్రవ్వరాదు. ఉత్తరంలో బావి వుండవచ్చును.

**ద్వారాలు :**

గృహాన్ని నిర్మించుకునే ముందు యింటి చుట్టూ ఖాళీ స్థలం వుంచాలి. అయితే తూర్పు ఉత్తరాలలో మాత్రం ఎక్కువ ఖాళీ స్థలం ఉండేలా చూసుకోవాలి.

ద్వారం ఇంటికి పితృస్థానమైన తూర్పులోనూ, మాతృస్థానమైన ఉత్తరంలోనూ మరియు ఈశాన్యాలలోనూ దక్షిణ ఆగ్నేయం, పశ్చిమ వాయవ్యంలో ఉంటే ఎంతో మంచిది. తూర్పు ఆగ్నేయంలో, దక్షిణ నైరృతిలో, మరియు పశ్చిమ నైరృతిలో ఉత్తర వాయవ్యాలలో ద్వారాలు ఉండకూడదు.

**పొయ్యి :**

ఇంటిలో పొయ్యికి ప్రధానంగా నిర్ణయించబడిన దిశలు ఆగ్నేయం, మరియు వాయవ్యం అదిశలలోనే పొయ్యి వుంటే మంచిది. ఆగ్నేయంలో వంట గది వచ్చినప్పుడు అందులో తూర్పు ముఖంగా వంట చేసుకోవాలి. వాయవ్యంలో వంట గది వచ్చినప్పుడు తూర్పు ముఖంగా గాని లేదా పశ్చిమం ముఖంగా గాని వుండి వంట చేసుకోవలెను.

**పడక గది :**

పడకగది నైరృతి గదిలోనే ఏర్పరచుకోవాలి. గదిలో తూర్పు ఉత్తరాలలో ఎక్కువ భాగం ఖాళీ స్థలం వచ్చేలా మంచాలను వేసుకోవాలి.

మన ఇంటిలోని సభ్యులు నిదురించే విషయంలో వరుసగా పెద్దవారు నైరృతిగదిలో తరువాత వారు ఆగ్నేయపు గదిలో ఆ తరువాత వారు వాయవ్యపు గదిలో పడకలు వేసుకోవచ్చును. ఈశాన్యంలో పిల్లలు మాత్రమే నిదురించాలి. భార్యా భర్తలు ఈశాన్య గదిలో పడక వేసుకొనరాదు.

అయితే నిదురించేటప్పుడు తలను ప్రధానంగా దక్షిణం వైపున ఉంచి నిదురపోవాలి. లేదా తూర్పు వైపున కూడా తల పెట్టి నిదురపోవచ్చును. పడమటివైపు తలవుంచుట మంచిది కాదు. ఎట్టి పరిస్థితులలోను ఉత్తరం వైపు తలపెట్టి ఎవ్వరూ నిదురపోరాదు.

## లెట్రిన్ (మరుగుదొడ్డి) :

ఆగ్నేయంలో గొయ్యి లేకుండా వున్నటువంటి మరుగుదొడ్డి చాలా మంచిది. మరియు తూర్పు ఆగ్నేయంలోను, దక్షిణ ఆగ్నేయంలోను, దక్షిణంలోను, నైరృతిలోను, పశ్చిమ నైరృతిలోను, పశ్చిమంలోను, పశ్చిమ వాయవ్యంలోను, ఉత్తర వాయవ్యంలోను, ప్రహరీలను అంటకుండా లెట్రిన్‌లు నిర్మించుకోవాలి. సెప్టిక్ ట్యాంక్‌లు తూర్పు, ఉత్తరాలలో పెట్టుకోవచ్చును. పోతే లెట్రిన్‌లో తూర్పు ముఖంగా కూర్చొనకూడదు. అలాగే పడమర ముఖముంచి లెట్రిన్‌లో కూర్చోకూడదు. దక్షిణ ముఖంగాను, ఉత్తర ముఖంగాను లెట్రిన్‌లో కూర్చోవచ్చును. ఈశాన్యంలో మరుగుదొడ్డి అసలు వుండకూడదు.

## కొన్ని ముఖ్య విషయాలు :

మనం నివసిస్తున్న ఇంటికి సంబంధించిన దిశల విశేషాలగురించి శాస్త్రమెప్పుడు సత్యమే చెబుతుంది. పూర్తి వాస్తుసమ్మతంగా కట్టబడిన ఇంటిలో ఎన్నో ఉత్తమ ఫలితాలు ఆయా గృహస్థులకు అందుతున్నాయి అన్నది నా అనుభవ సత్యం.

మనిషి ఎంత గొప్పవాడైనా, ఎంత ఆస్తిపరుడైనా పంచ భూతాలను కాదని మాత్రం జీవించలేడు. ఆ పంచ భూతాల ప్రభావాలను ఏర్చి కూర్చబడిందే "వాస్తుశాస్త్ర వాస్తవాలు " గ్రంథం.

ఈనాడు వస్తున్నటువంటి కులానికి స్థలాలు, ద్వారానికి మువ్వలు, గవ్వలు కట్టాలని, వాస్తు గోళాలు, యంత్రాలు ఇంటిలో నాటితే వాస్తు దోషాలు పోతాయని చెప్పే శాస్త్రజ్ఞులు కూడా వున్నారు వారు వ్రాసిన శాస్త్రాలున్నాయి. కోకొల్లలుగా వాటిని లోతుగా పరిశీలిస్తే వాటిల్లోని దోషాలు, మోసాలు మనకు తప్పకుండా తెలుస్తాయి.

**విద్యార్థులకు సూచనలు :**

మీకు తెలుసు సూర్యుడు ఎంత శక్తిమంతుడో. అతని కిరణాలలో ఎంత శక్తి దాగుందో, కాబట్టి తూర్పు ఉత్తర దిశగా కూర్చొని చదువును కొనసాగించండి. ఎల్లప్పుడు ఆయురారోగ్యాలతో విజయ శిఖరాలకు చేరుకోండి.

మరిన్ని వాస్తు విశేషాలు వివరణలు తెలుసుకోవాలనుకుంటే నా "వాస్తుశాస్త్ర వాస్తవాలు " గ్రంథాన్ని చదవండి. ఇంకా వాస్తును ఒంట బట్టించుకోవాలంటే సులభంగా అర్థమయి జ్ఞాపకంలో ఉండే విధంగా నా "వాస్తు సూక్తులు" చదివి జ్ఞాపకం ఉంచుకోండి. వాస్తుపై పరిజ్ఞానాన్ని పెంచుకోండి.

మీ

గౌరు తిరుపతి రెడ్డి

# కులం - మతం

**కులం :**

కులం అనేది ఈనాడు ఒక ప్రధానమైన సమస్య. భారతదేశంలోనే వేలకు మించిన కులాలున్నాయని ఒక అంచనా.

ఆదిమ కాలంలో కులాలు అనే విభేదాలు లేనే లేవు. మనుషులు అంతా ఒక సమూహంగా జీవించే పరిస్థితులలో ఒకే పనిని అందరు చేయడం అనేది సాధ్యం కాదు. బ్రతుకు సాగడానికి సంఘజీవులు అనేక పనులు పంచుకుని చేసుకునే అవసరం ఏర్పడింది. ఈ క్రమంలో ఆ పనులు ఆయా కుటుంబాల వృత్తులుగా మారి కులాలుగా స్థిరపడినాయి తప్ప కులం అనేది మనుషులను విడదీసే అడ్డుగోడ కారాదు.

స్వార్థం పెరిగి అధికారం, అహంకారం తోడైన మూర్ఖులు కులాల మధ్య తేడాలు కల్పించారు తప్ప కుల భేదాలు అనేవి పాటించ తగినవి కావు.

**మతం :**

భగవంతుని గురించి ఆయన గుణగణాలను గురించి, అతని దయను పొందే మార్గం గురించి అధ్యయనం చేసేదే మతం. మతమంటే మార్గమని అర్థం. ప్రపంచంలో 500 మతాలున్నా 10 మతాలు మాత్రమే ప్రధానమైనవి.

తనకు అర్థం కాని శక్తికి అపారమైన శక్తి సామార్థ్యాలు వున్నాయనే నమ్మకంలోంచే మతం పుట్టింది.

మనదేశంలో ప్రధానంగా వైదిక మతం, (హిందూమతం) ఇస్లాం మతం, బౌద్ధమతం, జైన మతం, సిక్కుమతం , క్రైస్తవ మతం ప్రధానమైనవి.

పై మతాలలో ఏ మతంగాని ఆయా మతాల పవిత్ర గ్రంథాలు (హిందూ) భగవద్గీత, (ముస్లిం) ఖురాన్, (బౌద్ధ) త్రిపిటకాలు, (సిక్కులు) గ్రంథ సాహెబ్, (క్రైస్తవులు) బైబిల్ ఇవన్నీ కూడా మనిషిని మనిషి ప్రేమించాలని మాత్రమే చెబుతాయి తప్ప మారణకాండలను ఏ మాత్రం బోధించవు.

సాటి మనిషిని ఆత్మీయుడిగా భావించమనేదే సర్వమతాల సారాంశం.

# వింత వృక్షాలు

నేటి మనిషి ఎంత గొప్పగా ఎదిగినా చెట్లపైనే ఆధారపడి వున్నాడన్నది నిజం. అడవి మనిషి నుండి నాగరిక మనిషిగా ఎదిగాడు అంటే దీనికై మనిషికి చెట్లు తమ సర్వస్వం అర్పించాయి అన్నది సత్యం.

ఎన్నో లక్షల రకాల చెట్లు భూమిపైన జీవిస్తున్నాయి. వాటిలో మనం నిత్యం చూసే వేప, మామిడి, చింత లాంటివే కాకుండ విచిత్రమైన వింత, వింత వృక్షాలు కూడా ఉన్నాయి. వాటిని గూర్చి తెలుసుకుందాం.

వృక్షాలు సాధారణంగా 100 నుండి వేల సంవత్సరాలు జీవితకాలం కలిగి వుంటాయి. అయితే కొన్ని 500 సంవత్సరాలు జీవిస్తాయి. బ్రిటన్‌లో ఒక వృక్షం ఇప్పటికీ జీవించే ఉంది. దాని వయస్సు 1,500 సంవత్సరాలు.

**మనిషిని తినే చెట్టు :** " మూపస్సు " అనే ఒక రకమైన జాతిలోని చెట్లు జావా

సముద్రతీరంలో ఉన్నాయి. ఈ చెట్ల క్రిందికి మనుషులు గాని, జంతువులుగాని ఎవరు వచ్చినా ఆ చెట్లు ముళ్లతో కూడుకున్న కొమ్మలతో చుట్టేసుకుంటాయి. కండరాలను చీల్చివేస్తాయి. తినేస్తాయి

**విషం పొలిచ్చే చెట్టు :** 'ఉపస్' అనే చెట్టు పాలలోని ఒక చుక్క శరీరం మీద పడితే చాలు వెంటనే ప్రాణం పోతుంది. మరో జాతి జిల్లేడు చెట్టు పాలు కళ్లలో పడితే కళ్ళు పోతాయి.

**నీటి చెట్లు :**



ఆకులనుంచి వర్షం కురిపినట్టుగా ఎల్లప్పుడు నీరు కురిపించే చెట్లు దక్షిణ ఆమెరికాలో ఉన్నట్లు తేలింది. పోతే జావాలో ఒక జాతి చెట్టు మీద గాటుపెడితే నీటిపంపు నీరు చిమ్మినట్లు అది నీటిని బయటకు చిమ్ముతుంది.

**రీజియా** అనే మొక్క తామర జాతికి చెందిన నీటి మొక్క. దాని ఆకులు ప్లేటు ఆకారంలో విశాలంగా ఉంటాయి. దాదాపు ఒక్కో ఆకు ఆరు నుండి ఏడు చదరపు మీటర్లు ఉంటుంది. సుమారు 50 కిలోల నుండి 60, 70 కిలోల బరువు ఆ ఆకులు ఆపగలుగుతాయి. అవి నీటిలో మునగవు.

**రఫియా** అనే చెట్టు పసిఫిక్ మహా సముద్రం దీవులలో పెరుగుతుంది. దీని ఆకులు 56నుండి 65 అడుగుల పొడవు ఉంటాయి.

**పుయారైమోండి** అనే చెట్టు బొలీవియా దేశంలో ఉన్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. అయితే ఈ చెట్టు 107 మీటర్ల ఎత్తు ఉండి ఒక పువ్వు గుత్తిని పూస్తుంది. విచిత్రం ఏమిటంటే ఈ చెట్టు పుట్టాక 152 సంవత్సరాల తర్వాతే పూస్తుంది.

అమెరికాలో వుండే ఒకరకం జాతి చెట్టు సీజన్‌లో 15 లక్షలకు పైగా పూలు పూస్తుంది.

ఈ విధంగా ప్రకృతి సృష్టించిన ఎన్నో విచిత్రమైన వింత చెట్లు విశాలమైన ఈ భూమిపైన వున్నాయి.

# మూలికలు - చికిత్సలు

## ఉత్తరేణి

**మూలశంకలకు :** ఉత్తరేణి వేరును బియ్యం కడిగిన నీళ్ళతో నూరి రసమును పిండి దానిలో కొంచెం తేనె కలిపి ప్రతిదినం తీసుకున్నట్లయితే " మూలశంకలు" (అర్శమొలలు) పోతాయి.

**చెవిలో హోరు, చెముడువకు :** ఉత్తరేణి బూడిదను కలిపిన నీటిలో నువ్వుల నూనె వేసి మరగబెట్టి మరుగు చుండగా ఉత్తరేణి ఆకుముద్ద దానిలో వేసి నూనె మిగులు వరకు వేడిచేసి ఆ నూనె రోజు రెండు చుక్కలు చెవిలో వేసిన హోరు, చెముడు పోవును.

**కలరా :** ఉత్తరేణి వేరు నీటితో మెత్తగా నూరి ఆ నీటిని వడకట్టి తాగినట్లయితే కలరా పోవును.

**వ్రణములకు :** ముత్తవపులగం ఉత్తరేణి సమముంగా కలిపి నూరి, మంచినూనె పోసి వేడిచేసి ఆ నూనెను రాసిన వ్రణములు పోవును.

**నిద్రలేమి :** కాకి దొండ ఉత్తరేణి కలిపి కషాయం పెట్టి రాత్రి సమయం రెండు టీ స్పూన్‌లు తీసుకొనిన నిద్ర వస్తుంది.

రోజు ఉత్తరేణి వేరు పుల్లతో పళ్ళుతోమిన పళ్ళు, చిగుళ్ళు గట్టిగా ఆరోగ్యంగా ఉండును.

### చిత్రమూలము

**ఉబ్బులకు :** చిత్రమూలం ఆకులు తరిగి కూరగా వండి పెట్టిన ఉబ్బులు తగ్గిపోవును.

**బోదకాలునకు :** చిత్ర మూలం వేరు ముద్దగాని, దేవదారుగాని ఈ రెండుగాని బోదకాలుపై లేపనం చేసిన చాలావరకు గుణం కన్పించును.

**కుష్ఠు రోగమునకు :** నలుపు, ఎరుపు రంగు గల చిత్ర మూలంలో ఏదాని యొక్క వేరునైనా తీసి ఆ వేరును నీడలో ఎండబెట్టి చూర్ణం చేసి ఆ చూర్ణంను గోమూత్రంతో సేవించిన అసాధ్యమగు కుష్ఠురోగం పోవును.

## గురివెంద



**బట్టతలకు :** గురివింద ఆకు మెత్తగా నూరి బట్టతలపై రాసిన కొన్ని రోజుల అనంతరం బట్టతల పైన వెంద్రుకలు మొలుచును.

**తలనొప్పికి :** గురివెంద గింజ కుంకుడు కాయల గుజ్జుతో అరగదీసి కణతలకు పట్టువేసిన తలనొప్పి పోవును.

**వాపులకు :** గురివింద ఆకు ఆముదముతో వేడిచేసి కట్టుకట్టిన వాపులు పోవును.

## కలబంద



**కండ్ల కలకలు :** కలబంద మట్టలపై పెచ్చుతీసి లోపల తెల్లగా ఉండే గుజ్జు ముక్కలు నీటితో కడిగి వాటిపై పటిక చూర్ణం చల్లి ఆ ముక్కలు తెల్లని గుడ్డలో వేసి కనులకు అద్దుకొనిన కళ్ళకలకలు పోవును.

**దెబ్బలకు :** ఉడికించిన కలబంద మట్టను మధ్యకు చీల్చి దెబ్బలపై కట్టుగా కట్టిన తగ్గిపోవును.

## పాలకొడిశ

**కుష్ఠురోగమునకు :** కొడిశ పట్ట ముద్దగా నూరి ఆ ముద్ద ఒంటికి లేపనం చేసిన కుష్ఠురోగం పోవును.

**వ్రణములకు :** పాల కొడిశ, గన్నేరు, జిల్లేడు వీని కషాయంతో వ్రణములను కడిగిన మానిపోవును.

## తులసి



**ముక్కు జబ్బులకు :** జలుబు చేసి ముక్కు వెంబడి శ్లేష్మం పడుచుండిన తులసి రసం, అడ్డసరం రసం కలిపి సేవించిన ముక్కు జబ్బులు పోవును.

**తేలుకాటుకు :** తులసి వేరుతో తేలు కుట్టిన చోట అనేక సార్లు రుద్దిన విషం పోవును.

**తామర (గజకర్ణి) :** తులసి రసమును, నిమ్మకాయ రసమును కలిపి తామరపైన మర్దన చేసిన పోవును.

**కఫం దగ్గులకు :** కృష్ణ తులసి రసంలో తేనె చేర్చి సేవించిన కఫం దగ్గులు పోవును. రోజూ నాలుగాకులు పరగడుపున తిన్నచో బి.పి. షుగరు మరియు గుండెనొప్పులు రావు.

## నేరేడు చెట్టు

**పైత్య వాంతులకు :** నేరెడు, మామిడి చిగుళ్ళ యొక్క కషాయం చల్లారిన తరువాత అందులో తేనె కొంత కలిపి తాగిన పైత్య వాంతులు తగ్గును.

**దంతాల బాధలకు :** నేరేడు ఆకులు నీడలో ఎండించి చూర్ణం చేసి అందులో కవిరి చూర్ణమును కూడా కలిపి ప్రతి రోజు పళ్ళు తోమినచో అన్ని దంత బాధలు తగ్గును.

**కంటిబాధలు, పొడిదగ్గులకు :** నేరేడు పండ్ల రసం తీసి అందులో పంచదార కలిపి [illegible] కాచి దానిని రోజూ సేవించినచో కంటిబాధలు, పొడి దగ్గులు పోవును.

**అతి మూత్ర, మధుమేహములకు :** వేయించిన నేరేడు గింజల చూర్ణం కషాయం పెట్టి అందులో తాటి కలకండం , పాలు చేర్చి కాఫీలో త్రాగినచో ఈ వ్యాధి పోవును.

## అడ్డసరం

**శరీరపు దుర్వాసనకు :** అడ్డసరపు ఆకు వేడిచేసి పిండిన రసములో శంఖ చూర్ణం

కలిపి శరీరమునకు రాచిన శరీరపు దుర్వాసన పోవును.

**శోషకు :** అడ్డసరపు పువ్వులతో కాచిన రసంలో తేనె కలిపి తాగిన శోష తగ్గును.

**ఉసిరిక**



**విషమ జ్వరమునకు :** ఉసిరిక పండ్ల రసమును నేతితో కలిపి సేవించిన విషమ జ్వరం పోవును.

**ఆగని ఎక్కిళ్ళకు :** ఉసిరిక పండ్ల రసమును, వెలగకాయ రసమును కలిపి దానిలో కొంచెం తేనె పిప్పళ్ళ చూర్ణం కలిపి తాగించిన ఎక్కిళ్ళు పోవును.

**దగ్గులకు :** ఉసిరిక చూర్ణంను పాలతో కాచి కొంచెం నెయ్యి కలిపి తీసుకున్న దగ్గులు పోవును.

**మూత్రం రాకుండినచో :** ఉసిరిక పండ్లు మెత్తగా నూరి పొత్తి కడుపునకు పట్టుగా వేసిన మూత్రం జారీ అగును.

**వెత్తి దెబ్బలకు :** ఉసిరిక పండ్లు నేతితోను పంచదారతోను కలిపి నూరి తలదెబ్బలపై పట్టు వేసిన మానును.

**నేలవేము**

**కలరా, అజీర్ణ విరేచవాలకు :** శుద్ధిచేసిన రస కర్పూరం తాటి మట్ట రసంతో నూరి కర్పూరమునకు రెండు రెట్లు నేలవేము చూర్ణం కలిపి శనగలవలె మాత్రలు చేసి పూటకు ఒకటి చొప్పున జీలకర్ర రసంతో ఇచ్చిన అజీర్ణం, కలరా విరేచనములు తగ్గును.

**విషమ జ్వరములకు :** నేలవేము తులసి రసంతో నూరి కందులవలె మాత్రలు చేసి రెండు గంటలకు ఒక మాత్ర చొప్పున తమలపాకు రసంతో సేవించిన జ్వరం తగ్గును.

**ములక**



**జ్వరితునకు నిద్రపట్టుటకు :** ఉదయమున ములక పండ్లు ఉడికించి సాయంత్ర సమయంలో ఆ పండ్లను తేనెతో భుజించిన చిరకాలం నుండి నిద్రలేకున్నను నిద్రను పొందగలరు.

**పిల్లల వాంతులకు :** త్రాగిన పాలు వెంటనే కక్కివేయుచున్న పిల్లలకు ములకపండ్ల రసమును తేనె మరియు నెయ్యితోనూ లేహ్యంగా చేసి నాకించిన వాంతులు కట్టును.

**పేమకొరుకునకు :** చిన్న ములక రసంలో తేనె కలిపి సేవించిన పేమకొరుకుడు తగ్గి వెంట్రుకలు మొలుచును.

**జ్వరమునకు :** ములక్కాకు కూర వండి పెట్టిన జ్వరం తగ్గును.

### వేప



**దంతరోగమునకు :** వేప వేరు కషాయమును రోజు రెండు స్పూనులు పుక్కిలించవలయును. ఒక స్పూన్ తీసుకున్నా కూడా దంత వ్యాధులన్నీ పోవును.

**చర్మ వ్యాధులకు :** వేప చిగుళ్ళను నూరి ఉసిరిక రసమును కలిపి సేవించిన చర్మరోగాలు పోవును.

**తాప జ్వరం** (దాహంతో కూడుకున్న జ్వరం) **:** వేప కషాయమును ఒకటి, (లేదా) రెండు స్పూనులు తాగించిన వాంతియై తాప జ్వరం పోవును.

**పిల్లల జ్వరమునకు :** వేపాకు, తేనె, నెయ్యి ఒకటిగా చేర్చి శిశువులకు పొగవేసిన జ్వరం పోవును.

ఈ విధంగా చెట్లు ఎంతో మహత్తర గుణాల్ని కలిగి వున్నాయని ఆయుర్వేద వైద్యశాస్త్రం చెప్తోంది. అయితే, అవసరాన్ని బట్టి పై విధానాలను పాటించే సమయంలో వైద్య [illegible] మర్చిపోవద్దు.

## పోషక పదార్థాలు

అమ్మకడుపులోంచి వచ్చిన మనం కొంత వయస్సువరకే అమ్మపాలతో పెరుగుతాం. ఆ తరువాత మన శరీరాన్ని పోషించుకోవడానికి ఆహారం కావాలి. అంతేకాదు, అందులో పోషక పదార్థాలు కూడా ఉండాలి. అవి ప్రోటీన్లు, విటమిన్లు ఖనిజలవణాలు, కార్బోహైడ్రేట్లు.

మన శరీరంలో ప్రతి అవయవం వృద్ధిపొందాలంటే ప్రొటీన్ మన ఆహారంలో ఉండాలి. మాంసం, కోళ్ళు, చేపలు, గుడ్లు, పాలల్లో ఈ ప్రొటీన్స్ ఉంటాయి. మాంసంలోనే గాక, పొట్టుతీయని పప్పులు, బాదం, చిక్కుడు, బఠానీలలో కూడా ఉంటాయి.

పోతే శరీర నిర్మాణంలో ఖనిజాల పాత్ర కూడా అధికం. వీనివల్ల ఎముకలు, పళ్ళు, గట్టిగా బలంగా ఉంటాయి. ఇవి పండ్లు, కూరగాయలు, పప్పుధాన్యాలు, గుడ్లు, పాలు, మాంసంలో ఉంటాయి.

ఇకపోతే విటమిన్లు ఎ.బి.సి.డి. ల గురించి తెలుసుకుందాం.

**విటమిన్ ఎ. :** ఇది పేగులు మూత్రనాళం లోని సన్ననిపొరలను కళ్ళ లోని భాగాలను బలంగా ఆరోగ్యంగా ఉంచు తుంది. ఇది లేకున్న పేగులలో వ్యాధులతోను జలుబుతోను ఎక్కువగా బాధపడతారు. ఇది పాలల్లో ఉండే కొవ్వులోను, గుడ్లలోను, ఆకుపచ్చ, పసుపుపచ్చ కూరగాయల్లోను, చేప నూనెల్లోను ఎక్కువగాను ఉంటుంది.



**విటమిన్ బి :** ఇందులో అనేక రకాలున్నవి. ఈ విటమిన్ పప్పు ధాన్యాలలోను, పాలు, గుడ్లు, కార్జం, మాంసం, కూరగాయల్లోను బాగా ఉంటుంది. దీని లోపం వల్ల నోరు, పేగులు, చర్మం, నోటిలో పగులుడు కంటి వ్యాధులు వస్తాయి.



**విటమిన్ సి :** నారింజ, కమల, నిమ్మ, ద్రాక్ష టొమాటో, క్యాబేజీలలో ఎక్కువగా ఉంటుంది. ఇది పళ్ళు, ఎముకలు, రక్త నాళాలు, నరాల అభివృద్ధికి ఉపయోగ



పడుతుంది. దీనిలోపం వల్ల చిగుళ్ళు వాచి రక్తం వస్తుంది.

**విటమిన్ డి :** ఇది ఎముకలు, పళ్ళు పెరగడానికి, ఆహారం జీర్ణం కావడానికి ఉపయోగపడుతుంది. అయితే సాధారణ ఆహార పదార్థాలలో ఈ విటమిన్ ఉండదు. శరీరంలో ఉండే క్రొవ్వుకు సూర్యుని అల్ట్రా వైలెట్ కాంతి తగలడం వల్ల ఇది తయారవుతుంది. ఉదయపు, సాయంత్రపు ఎండద్వారా కూడా ఇది తయారవుతుంది.



డి విటమిన్ లభించకపోతే తల ఎముకలు మెత్తబడతాయి. కాళ్ళు వంకరయి దొడ్డికాళ్ళు ఏర్పడతాయి. ఛాతి వికృతమై పొట్టపెద్దదై కండరాల్లో శక్తి తగ్గుతుంది.

కాబట్టి ఈవిధమైన అన్నిరకాల విటమిన్లు మనకు అవసరం. వీటిని సమపాళ్లలో ఆహారం ద్వారా తీసుకుంటూ మన శరీరాన్ని రక్షించుకోవాలి.

## పక్షులు - పాములు

**పక్షులు :**



ఆకాశంలో హాయిగా అందంగా ఎగిరే పక్షులను చూస్తే ఎవరికయినా ఆనందం కలుగుతుంది. ఒక్కసారి ఈపక్షులను పరిశీలిస్తే ఎన్నెన్నో విచిత్ర విషయాలు మనకు తెలుస్తాయి.

పక్షులు చాలా తేలికగా వుండి ఎముకలు గుల్లగా వుంటాయి. పక్షి ఎగిరినప్పుడు దాని రెక్కల కిందికి, శరీరం కిందికి గాలి చేరడంతో పక్షివి క్రిందకు పడనీయదు. దాంతో అది గాలిలో ప్రయాణించగలుగుతుంది. ఈ పక్షిని చూసే మానవుడు విమానాన్ని సృష్టించగలిగాడు.

పక్షులలో శాకాహారం, మాంసాహారం భుజించేవి ఉన్నాయి. మామూలుగా

ఒక్కో పక్షి అయిదు నుండి 21 వరకు గుడ్లు పెడుతాయి. పక్షులు వారం రోజుల్లో గూడును నిర్మించుకుంటాయి. ఈగల్ అనే పక్షి తన గూడును ప్రతి సంవత్సరం తిరిగి బాగు చేసుకుంటుంది.

పక్షులు సాధారణంగా కొమ్మల మీద కూడా నిద్రపోతుంటాయి. అవి కొమ్మల మీద వాలగానే వాటి కాలి గోళ్ళు కొమ్మచుట్టు బిగుసుకుంటాయి. అలా అవి రాత్రి క్రింద పడిపోకుండా నిద్రించగలుగుతున్నాయి.

**పెద్ద పక్షి : ఉష్ట్రపక్షి**



ఆఫ్రికాలో జీవించే ఉష్ట్ర పక్షి అతి పెద్ద పక్షి. 8 అడుగులకు మించిన ఎత్తు ఉంటుంది. దాదాపు 135 కిలోల బరువు వుండి ఇది 50 కి.మీ వేగంతో పరుగుపెడుతుంది. దీనిపై ఒక వ్యక్తి కూడా ఎక్కిపోవచ్చు. పోతే ఇది ఎగురలేదు. ఇది 50 సంవత్సరాలు జీవిస్తుంది.

**చిన్న పక్షి : హమ్మింగ్ బర్డ్**

ఇది క్యూబాలో నివసిస్తుంది. బరువు 2 గ్రాములు. పొడవు 2 అంగుళాలు. ఇది ఆగకుండా 600 మైళ్ల వరకు ప్రయాణం చేస్తుందని శాస్త్రజ్ఞుల పరిశోధనలు తెలుపుతున్నాయి.

**స్విఫ్ట్ పక్షి :**

దీనికి వేడి అధికం దాదాపు 112 ఫారన్ హీట్ డిగ్రీల హెచ్చు వేడి కలిగి వుంటుంది. ఇంతవేడి మనిషికి ఉంటే చనిపోగలడు. అయితే ఈ పక్షి ఎల్లప్పుడు ఎగురుతూనే ఉంటుంది. ఏదైనా దెబ్బ తగిలితే తప్ప ఇది క్రిందకు దిగదు. అలా జీవితమంతా ఎగురుతూనే ఉంటుంది. రెండు మైళ్ల దూరం ఎగరడానికి వీటికి 36 సెకన్ల నుండి 42 సెకన్ల వరకు పడుతుంది.

**హనీ గైడు :**



ఇది చాలా విచిత్రమైనది. దీని ఆహారం మైనం. ఈ మైనం సంపాదించుకోవడానికి ఇది ఏ జంతువుతోనో, మనిషితోనో స్నేహం చేస్తుంది. ఈ హనీగైడులలో 11 తెగలు ఉన్నాయి.

ఆఫ్రికా, బర్మా, మనదేశంలోని హిమాలయాల్లోనూ ఇవి నివసిస్తాయి. ఎక్కువగా అడవి ప్రాంతం వీటికి నివాస స్థలం.

ఇది అడవిలో తేనెపట్టును తెలుసుకొని ఆటవిక జాతికి చెందిన మనిషి వద్దకు వచ్చి రక రకాలుగా అరుస్తూ చిత్ర, విచిత్ర విన్యాసాలు చేసి అతనిని ఆకర్షిస్తుంది తరువాత తేనెపట్టు ఉన్న దిశగా కొంచెం ప్రయాణించి ఆగుతుంది. తన వెంట ఆ వ్యక్తి వస్తున్నాడా లేదా అని చూస్తుంది. రాకున్నట్లయితే తిరిగి వెళ్లి అలాగే మళ్లీ అరుస్తుంది. అలా తేనెపట్టు ఉన్న చోటికి దాదాపు 25 నిమిషాలలో తీసుకు వెళ్తుంది. తేనె పట్టున్న కొమ్మమీద వాలి తేనెపట్టును గుర్తించేలా చేస్తుంది. ఆ ఆటవికుడు దానిని చూసి తుట్టెను కొట్టి తేనెను తీసుకొని తుట్టెను కిందపడవేసి పోగానే నేల మీద వాలి ఆ తుట్టెలోని మైనాన్ని తింటుంది. ఈవిధంగా తన ఆహారం సంపాదించుకోవడానికి జంతువును లేదా మనిషిని ఉపయోగించుకుంటుంది.

ఆడపిట్టలు గుడ్లు పెట్టు సమయంలో వడ్రంగిపిట్టల గూళ్ళను వెదుకుతూ వెళ్ళి ఆ పిట్ట గూడులోంచి వెళ్ళేదాకా వుండి అందులో గుడ్లు పెట్టి వెళ్తుంది. వేరు వేరు వడ్రంగి పిట్ట గూళ్ళలో మూడు నాలుగు గుడ్లు పెట్టి పిల్లలు అయ్యేలా చూస్తుంది. ఆ పిల్లలు పుట్టాక వాటికి ముక్కు పక్కన ఉన్న పదును కొక్కాలతో మిగతా పక్షులను పొడిచి చంపుతాయి. అలా అవి పెరిగిన తరువాత ఆ కొక్కాలు రాలిపోతాయి.

**గ్రద్ద :**

ఇది గొప్ప శక్తివంతమైనది. మెక్సికో, బ్రెజిల్‌లో వుండే గ్రద్ద 3 అడుగుల ఎత్తువరకు ఉంటుంది. దక్షిణాఫ్రికాకు చెందిన హార్పి-ఈగల్ అనే గద్ద 27 పౌన్ల బరువు వుంటుంది. దీని రెక్కలు 3 మీటర్ల పొడవు వుంటాయి.



# పక్షులు - పొదగడం



పక్షులు సాధారణంగా గుడ్లమీద కూర్చుని పొదిగి పిల్లలు చేస్తుంటాయి. వీటిల్లో ఆడపక్షులే ఈపనిచేస్తాయన్నది అందరికీ తెలుసు. కానీ కొన్ని జాతులలో ఆడ, మగ పక్షులు వంతుల వారిగా పొదిగి పిల్లలు చేస్తాయి.

" పిలోరూవ్ " అనే పక్షులలో పొదగడం పూర్తిగా మగపక్షి మాత్రమే చేస్తుంది. మగపిట్ట కట్టిన గూట్లో ఆడపక్షి గుడ్లు పెట్టి వెళ్లిపోతుంది. మగపక్షి మాత్రమే పిల్లల పెంపకంతో సహా పూర్తి పనులన్నీ చేస్తుంది. 'పారడైజు ' అనే జాతి పక్షులలో గూడు కట్టడం, గుడ్లని పొదగడం పిల్లలను పెంచడం అన్ని పనులు ఆడపక్షి చేస్తుంది.

# పక్షులు - వలస

వాతావరణ పరిస్థితులు బట్టి పక్షులు అనేకం తమ తమ ప్రదేశాలను ఎంచుకొని అచ్చటికి ప్రయాణం చేస్తాయి. ఆవిధంగా అవి ఎంతో దూరం ప్రయాణం చేస్తున్నాయి. ప్రపంచంలో ఉండే పక్షుల సంతతిలో దాదాపు మూడో వంతు పక్షులు ప్రతి సంవత్సరం వలస పోతున్నాయి.



**గోల్డెన్ ప్లోవర్ :**

ఈ పక్షులు ఆర్కిటిక్ వలయంలో మంచు ప్రాంతంలో జీవిస్తాయి. జూన్ నెలలో ఆగ్నేయ దిశగా ఉత్తర అమెరికా మీదుగా కెనాడాకు ఆగ్నేయంగా ఉన్న తీర ప్రదేశం 'నొవాస్కోటియాకు' చేరుతాయి. తిరిగి అక్కడి నుండి అట్లాంటిక్ మహా సముద్రం మీదుగా దక్షిణ అమెరికాలో ఉత్తర మధ్య అర్జెంటినా పంపాస్ గడ్డి మైదానాలలో ప్రవేశిస్తాయి. ఒక నెల తరువాత వీటి పిల్లలు ఆర్కిటిక్ వలయం నుండి మరో మార్గంలో పయనించి ఏమాత్రం అనుభవం లేకున్నా వేల మైళ్ల కొద్దీ ఎగిరి ఈ గడ్డి మైదానం చేరి తల్లి దండ్రులను కలుసుకుంటాయి. ఇవన్నీ తిరిగి

శీతాకాలం రాగానే తిరుగు ప్రయాణం చేసి సొంత గూడుకు చేరుకుంటాయి.

'ష్రైఫ్' అనే పక్షి ఎక్కడ కాలు పెట్టకుండా ఉండి మూడు వేల మైళ్ళు ప్రయాణం చేసి తూర్పు ఆస్ట్రేలియాలో చలికాలమంతా గడుపుతుంది.

'టైరవ్' అనే ఆర్కిటిక్ ప్రాంతానికి చెందిన పక్షి పన్నెండు వేల మైళ్ళు ప్రయాణం చేసి వెచ్చదనం కొరకు దక్షిణ ధ్రువం చేరుతుంది. వాతావరణం మారగానే తిరిగి స్వంత ప్రాంతం చేరుకుంటుంది.

'వార్‌బర్గ్' అనే చిన్న పక్షి కెనడా నుండి 4 వేల మైళ్ళు ప్రయాణం చేసి బ్రెజిల్ చేరుకుంటుంది.

**మచ్చిక పక్షులు**

**1. పావురము :**

మనిషి మచ్చిక చేసుకున్న పక్షులలో పావురాలు ప్రధానమైనవి. ఒకనాడు అవి వార్తలు చేరవేసే పనిలో ప్రసిద్ధికెక్కినవి.

**2. నెమలి :**



అందంగా వుండే పక్షి. దీని జన్మస్థలం ఇండియా. వీటిల్లో మగ నెమలి నాట్యం చేస్తుంది. నెమలిని మన జాతీయ పక్షిగా ప్రభుత్వం గుర్తించింది.

**3. చిలుకలు :**



ఇవి కూడా మనిషితో కలిసి జీవించి ఎంతో ప్రాముఖ్యత పొందినవి. సరైన ప్రత్యేక శిక్షణ ఇచ్చినట్లైతే మనిషిలా కొన్ని మాటలు మాట్లాడగలుగుతాయి.

**4. మైనా :**

కోయిల, భరత పక్షులు అందంగా కూస్తాయి. అయితే పక్షులకు రుచి, వాసన తెలియవని శాస్త్రజ్ఞులు తేల్చారు. కొన్ని పక్షులు సముద్రంలోపలికి కూడా దూసుకుపోగలిగే శక్తివంతమైనవి ఉన్నాయి.

**పక్షులు - జీవితకాలాలు**

| | | | |
|---|---|---|---|
| నెమలి | - 20 సంవత్సరాలు | పావురం | - 20 సంవత్సరాలు |
| కోకి | - 20 సంవత్సరాలు | పిచ్చుక | - 10 సంవత్సరాలు |
| చిలుక | - 50 నుండి 100 సంవత్సరాలు | గుడ్లగూబ | - 50 సంవత్సరాలు |
| హంస | - 50 సంవత్సరాలు | రాబందు | - 100 సంవత్సరాలు |
| గద్ద | - 100 సంవత్సరాలు | | |



## పాములు

పాములలోని 2,500 జాతులలో 412 జాతులు మాత్రమే విషం కలిగి వున్నాయి. పాముకు చెవులు వుండవు. కానీ గాలి ద్వారా వచ్చే శబ్ద తరంగాలను తల వద్ద గల ఒక పలుచని చర్మపు పొరద్వారా పసిగట్ట గలుగుతుంది.

పాము కళ్లకు రెప్పలుండవు. కనుపాపలు గుండ్రంగా కాక నిలువుగా చీలి వుంటాయి. నాలుక కూడా చీలి వుంటుంది. అది నిరంతరం గాలిలో తేలివచ్చే పదార్థాల కణాలను గ్రహిస్తుంది కాబట్టే నాలుకను తరచు లోపలికి, బయటకు ఆడిస్తుంది. అని పరిశోధనలో తేలింది.

అది పాత చర్మాన్ని (కుబుసం) వదిలించుకొని కొత్త చర్మాన్ని ఏర్పరచుకుంటుంది. పాము ఆహారం లేకుండా 1 సం ॥ వరకు జీవిస్తుంది.

పాము కాటు మంత్రం కేవలం సంతృప్తికోసమే. పాము విషం తగినంత నరాల్లోకి వెళ్ళితే మనిషి ఒక గంటకన్నా ఎక్కువ బ్రతకలేడు. బ్రతికాడు అంటే ఆ పాము యింతకు ముందు ఎవరినైనా కరిచి ఉండాలి. అందుకే తిరిగి కరవబడిన మనిషి కి సరైనంత విషం ఎక్కక బ్రతికే అవకాశం ఉంది. పాము పగ పట్టదు. కాని అది తిరిగిన ప్రదేశాల్లోనే ఎక్కువగా తిరుగుతూ ఉంటుంది. అందుకని పాము పగపడుతుందన్న అపోహ వుంది. రెండు తలల పాము లేదు. తోక మొండిగా ఉండడంతో, రెండు తలలు అని అనుకుంటూ ఉంటారు.

ఒక పరిశోధనలో డా ॥ మిత్రగారు 20 కుక్కలకు రెండు పాములను కరిపించి

**ఇతరులకి చెందినవాటిని తమ స్వంతం చేసుకోవాలని ఉబలాటపడేవారు, తమ స్వంత వస్తువులని పరులకి కట్టబెడతారు.**

అందులో పది కుక్కలకు మంత్రం వేయించాడు. అయితే రెండు గంటల తరువాత మంత్రం వేసిన వాటిల్లోను, మంత్రం వేయని వాటిల్లోను చనిపోయిన కుక్కలు చనిపోయినాయి. అలాగే బ్రతికిన కుక్కలూ ఉన్నాయి. దానిని బట్టి పాము కరచిన వ్యక్తులు బ్రతకడం, బ్రతకపోవడం విషాన్ని బట్టిగాని మంత్రాన్ని బట్టి కాదు అని తేలింది.

ప్రపంచంలో ఆరు రకాల పాములు మనుషులను, జంతువులను తినేవి ఉన్నాయి. వాటిల్లో మనదేశంలోని కొండ చిలువ ఒకటి.

' అనకొండ ' అనే పాము దక్షిణ అమెరికాలోనే అతి పెద్దది. 40 అడుగుల పొడవు వుండి 1000 పౌన్ల బరువు వుంటుంది.

మలబారు ప్రాంతంలో కింగ్ కోబ్రా అనే పాము 20 అడుగులు ఉండి, ఏడు అడుగుల ఎత్తు వరకు పైకి లేస్తుంది. ఇది మనుషుల్ని తరిమి, తరిమి కాటువేస్తుంది.

పాము విషం మందుల పరిశ్రమకు ప్రధానమైంది. దీనితో కీళ్లవాతం, ఉబ్బసం నయం చేస్తారు.

నాగస్వరం ఊదితే పాము తల అటు, ఇటు తిప్పి నాట్యం చేస్తుందనుకోవడం తప్పు. నాగస్వరం ఎటు కదిలితే అటు తల తిప్పుతుందే తప్ప అది నాట్యం కాదు. దానికి, ఆ స్వరం వినే శక్తి కూడా లేదు. అని పరిశోధకులు తేల్చి చెప్పారు.

పాము కరచినప్పుడే కరచిన భాగానికి పైన గట్టిగా కట్టు కట్టాలి. కరచినచోట మంచి బ్లేడుతో గాట్లు పెట్టి రక్తం బాగా వచ్చేలా వత్తాలి. లేదా రక్తం పీల్చి వేసినా ఏం కాదు. అయితే, పీల్చేవ్యక్తి నోటిలో పుండ్లు ఉండరాదు. అనంతరం డాక్టరును సంప్రదించాలి. కరచినవెంటనే పరుగెత్తరాదు.

## వింత జంతువులు

**ముళ్ళపంది :**



నిజానికి దీని శరీరం నిండా ఉండేవి ముళ్ళు కావు. అవన్నీ వెంట్రుకలే. ముళ్ళపంది పుట్టినప్పుడు చాల మృదువుగా వుండే వెంట్రుకలు పుట్టిన అరగంటలోనే దృఢంగా తయారవుతాయి.

దీని మీదికి ఏ జంతువు పోదు. కారణం ఆ వాడియైన ముళ్ళలాంటి వెంట్రుకలతో అది చీల్చిపెడుతుంది కాబట్టి. పోతే ఇది శాకా హారి కానీ ఎముకలు తింటుంది. సాధారణంగా సింహం, పులి లాంటి జంతువుల కళ్ళలోకి లైట్ ఫోకస్ చేస్తే అవి ఆగిపోతాయి. కానీ, ఈ జంతువు ఆగిపోదు. ఎంత శక్తివంతమైన లైట్ వేసినా ఇది మాత్రం ఎదురుగా వున్న వస్తువుల్ని చూస్తుంది.

ఈ జంతువు భూమి మీద ఎంతగా పరుగెత్తుతుందో నీటిలోనూ అంతేవేగంగా ఈదగలుగుతుంది. మరో విశేషమేమిటంటే దీనికి ఉప్పువాసన అంటే చాలా ఇష్టం. అందుకే వేటగాళ్ళు ఉప్పు ఎరగా పెట్టి ఈ జంతువును పట్టుకుంటారు.

**నైట్‌మంకీ :**



కేవలం అడుగు - అడుగున్నర ఎత్తు, ఒక కిలో బరువు వుండే ఈ జంతువు అలవాట్లతోపాటు ఆకారం కూడా 'గుడ్లగూబ' ను పోలి ఉండడంతో దీనిని ' గుడ్లగూబ కోతి ' అని కూడా అంటారు.

అర్జెంటీనా, బ్రెజిల్, పనామా అరణ్యాలలో ఇవి అధికంగా కనిపిస్తాయి. ఇవి పగటిపూట బయటికి రావు. రాత్రిపూట మాత్రమే తిరుగుతుంటాయి. మాంసాహారంతో పాటు, ఆకులు, పండ్లు కూడా తింటాయి. పోతే ఉడుతల్ని, బల్లుల్ని, పక్షుల్ని కూడా ఆహారంగా వేటాడుతాయి.

**చిన్న కుక్కలు :**



సాధారణంగా కుక్కలు ప్రతి ఇంట్లోను కనపడుతుంటాయి. సరదాకో ఇంటి కాపలాకో కుక్కలను పెంచుకోవడం మనకు అలవాటుగా మారింది. అయితే, సరదాకోసం పెంచే కుక్కల్లో చాలా చిన్నవి అధిక ధరలకు అమెరికా, కెనడా, ఇంగ్లాడ్ దేశాలలో అమ్మబడుతున్నాయి.

ఈ చిన్నకుక్కలు చక్కగా, అందంగా వుండి 3 అంగుళాల నుండి 6 అంగుళాల వరకు ఎత్తు ఉంటాయి. అయితే, కొన్నింటిని మన అగ్గిపెట్టెల్లోను

ఎంత పోటీ వున్నా విలువ తగ్గనిదీ, ఎంతమంది పోటీదారులు వున్నా నశించనిది, అన్నిటినీ మించిన ఏకైక ఆస్తి - యీ ప్రపంచంలో సద్భావన ఒక్కటే.

మరికొన్నింటిని కాఫీ కప్పుల్లోను పెట్టవచ్చునని పరిశోధకులు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తున్నారు. మామూలుగా పెద్దకుక్కలు మల్లే ఆహారం తీసుకొని విశ్వాసం కూడా కలిగి వుంటాయి ఈ చిన్న కుక్కలు.

**జెర్బోవా :**

ఆఫ్రికాలోని ఒక రకమైన ఎలుకజాతికి చెందిన జెర్బోవా తల తిప్పకుండా వెనకా ముందు చూడగలదు. అనగా దీనికి 360 డిగ్రీల దృష్టి కలిగి వుందన్నమాట. కాబట్టి ఇది వెనక్కి చూడగలుగుతుంది.

**చెట్లను నరికే జంతువు :**

కెనడా దేశంలో జీవించే బీవర్ అనే జంతువు 30 నుండి 45 అంగుళాల పొడవు వుంటుంది. 5 అంగుళాల వ్యాసం గల చెట్లను గొడ్డలితో నరికినట్లు తన పండ్లతో కొరికి క్రిందపడవేస్తుంది. చెట్ల కొమ్మలతో కాలువలకు అడ్డంగా ఆనకట్టలను కూడా కడుతుంది. అయితే ఇది నీటి జంతువు.

**కస్తూరి ఎలుక :**

ఎలుక ఆకారంలో వుంటూ కస్తూరి పరిమళాన్ని విరజిమ్ముతుండటం వలన కస్తూరి ఎలుక అని పేరు వచ్చింది. బలమైన తోక, తేలికైన అవయవాలున్న ఈ కస్తూరి ఎలుక నీటిలో కూడా హాయిగా తిరుగగలదు. ఇది ఏటా 4,5 సార్లు పిల్లల్ని కంటుంది. నెల రోజుల వయస్సు వచ్చే సరికి పిల్లలు తమ ఆహారాన్ని సంపాదించు కుంటాయి. ఆరు నెలలు నిండితే తమ ఇళ్ళను తామే నిర్మించుకొంటాయి. ఇవి రెండు అంగుళాలకంటే తక్కువలోతు ఉన్న జలాశయంలో ఇళ్ళు కట్టుకుంటాయి. ఇవి ఇంటిని ఎప్పుడూ శుభ్రంగా ఉంచుకొంటాయి. పోతే రక రకాల మొక్కలు, వేళ్ళు, దుంపలు, నీటి ప్రధానమైన ఆహారం. నక్కలు, గుడ్లగూబలు మొదలగునవి వీటికి ప్రధాన శత్రువులు. కస్తూరి ఎలుక జీవిత కాలం 10 సంవత్సరాలు.

**మొసలి :**



ప్రాకే జంతువులలో ఇది పెద్దది. మొసలి సంఘజీవి. ఇవి గుంపులు గుంపులుగా జీవిస్తాయి. ఒంటరిగా ఆహారాన్ని తినవు. వేటకు కూడా ఒంటరిగా వెళ్లవు. మొసళ్ళు రక రకాల కంఠ స్వరాలతో మాట్లాడుకుంటాయి.

చిన్న మొసళ్ళు సన్నగా అరిస్తే పెద్దవి గట్టిగా అరుస్తాయి. ఫిలిప్పైన్స్, ఉత్తర ఆస్ట్రేలియా, సాలెమన్ దీవులలో పెద్దరకం మొసళ్ళు జీవిస్తున్నాయి. న్యూగినీ దీవిలో 20 అడుగుల మొసళ్ళు ఉంటాయి.

మొసళ్ళు గుడ్లు పెడతాయి. అయితే వీటి గుడ్లలోంచి వచ్చిన పిల్లలు గుడ్లకన్నా మూడు రెట్లు పొడవు కలిగి ఉంటాయి. తమాషా ఏమిటంటే మొసలి కళ్ళు తెరుచుకొనే నిద్రపోతుంది. మొసలి అంటే మనకందరికి నీటిలోనే జీవిస్తుందని తెలుసు. ఇది నిజమే అయినా ఆఫ్రికాలో కొన్ని మొసళ్ళు పెద్ద పెద్ద చెట్లు వున్నఅడవులల్లో జీవిస్తాయి. ఇవి నీట్ని అసలు చూడవు.

**కోయ్‌లా :** ఇది ఆస్ట్రేలియాకు చెందిన జంతువు. అసలు నీటిని ముట్టుకోదు. దీనికి అవసరమైన నీరు అది తినే ఆకులలోనే లభిస్తుంది.



**కంగారు :** కడుపునకు సంచి కలిగివున్న జంతువు కంగారు ఒక్కటేకాదు. ఆస్ట్రేలియాలో ఇలాంటి జంతువులు చాలా ఉన్నాయి. వీటిని మార్సు పియల్స్ అంటారు. లాటిన్ భాషలో దానికి సంచి అని అర్థం.

కంగారుకు ఈ సంచి కాళ్ళమధ్య ఉంటుంది. ఇది బిడ్డని అదిమిపట్టే గది లాంటిది. అందులో పాలు తాగడానికి పాలిండ్లు ఉంటాయి. పూర్తిగా పెరగని బిడ్డ పుట్టాక బొచ్చు అసలు లేక మాంసం ముద్దలా ఉంటుంది. అది అతి కష్టం మీద ప్రాకి ఆ సంచిలోకి వెళ్లుతుంది. అక్కడ పాలు తాగుతూ వృద్ధి చెందుతుంది. కాబట్టి ఆ సంచి మరో గర్భసంచిలా పనిచేస్తుంది.

కంగారులలో 120 జాతులున్నాయి. అన్నిటికన్నా చిన్నది 'వల్లభీ' అనేది. ఇది 2 అడుగులు మాత్రమే ఉంటుంది. అయితే, 40 అడుగుల దూరం దూక గలదు. కంగారు ఇతర జంతువులతో పోట్లాటకు దిగినప్పుడు తన బలమైన తోకపై మొత్తం శరీరాన్ని నిలిపి కాళ్లతో శత్రువును తన్నుతుంది.

మనకి , ఖచ్చితంగానూ తెలి కూ మనం ఇతరుల గురించి చెడుగా మాట్లాడగూడదు.

# జంతువులు - జీవితకాలాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొసలి | - | 65 సంవత్సరాలు | సింహం | - | 30 సంవత్సరాలు |
| ఏనుగు | - | 100 సంవత్సరాలు | పెద్దపులి | - | 25 సంవత్సరాలు |
| గుర్రం | - | 50 సంవత్సరాలు | తోడేలు | - | 16 సంవత్సరాలు |
| చింపాంజి | - | 60 సంవత్సరాలు | ఎలుక | - | 16 సంవత్సరాలు |
| గేదె | - | 30 సంవత్సరాలు | ఇంటి ఎలుక | - | 4 సంవత్సరాలు |

# కనిపించని స్నేహితులు

ఎక్కడ చూసినా తమ జాతిని అభివృద్ధి చేసుకుంటూ మన కంటికి కనిపించకుండా కోట్లాది సూక్ష్మజీవులు మనమధ్య జీవిస్తున్నాయి. చెట్లపైన, శరీరాల మీద, వస్తువుల మీద, ఆహార పదార్థాల మీద అసంఖ్యాకంగా ఉండి, గాలి, నీరు, ఆహారం అనుకూలంగా ఉన్నప్పుడు ఒకటి రెండుగా, రెండు నాలుగ్గా చీలిపోతూ ఉన్న సూక్ష్మ జీవులలో మేలు చేసే సూక్ష్మజీవుల గురించి మనం తెలుసుకుందాం !

సాధారణంగా చనిపోయిన జంతువులు, కుళ్ళిపోయిన చెట్లు మనం విడిచిపెట్టిన మలినపదార్థాలు కొద్ది రోజులలో మట్టిలో కలిసిపోతాయి. ఈవిధంగా మట్టిగా మార్చేవి సూక్ష్మజీవులే. ఇవే మృత కళేబరాలను, చెట్ల ఆకులను కుళ్ళించి నైట్రేటులుగా మార్చివేస్తాయి. అలా మారిన మట్టి, పొలాలకు ఎరువుగా ఎంతగానో ఉపయోగపడుతుంది. సూక్ష్మ జీవులు కనుక ఈ పనులు చేయకపోతే భూమండలమంతా వ్యర్థ పదార్థాలతో మృత కళేబరాలతో, చెట్ల ఆకులతో నిండి ఉండేది. అంతే కాదు, భూమికన్న హెచ్చుస్థాయిలో ఉన్న సముద్రంలో చనిపోయిన జల చరాలన్నీ ఏ మార్పు చెందకున్నట్లయితే చెడువాసనతో ప్రపంచం ఉడికి పోయేది.

ఈనాడు సూక్ష్మజీవులను కర్ర నుండి జనపనారను వేరుచేయుటకు, పొగాకునకు వాసన కలిగించుటకు పరిశ్రమలలో ఉపయోగిస్తున్నారు. పాలను పెరుగుగా

**సేదతీర్చే సెలయేటి నిర్మల జలాన్ని త్రాగేముందు, అంత స్వచ్ఛమైన నీటిని అందించిన ఊటని గుర్తుచేసుకోవాలి.**

మార్చునవి, పెరుగు నుండి వెన్న వచ్చునట్లు చేయునవి, ఆహార పదార్థాలకు రుచిని, వాసనను కలిగించునవి కూడా ఈ సూక్ష్మజీవులే.

# కనిపించని శత్రువులు

ప్రపంచంలో ఉన్న కోట్లాది సూక్ష్మజీవుల్లో నూటికి 5 % మాత్రమే మానవులకు కీడు చేసే సూక్ష్మజీవులు ఉన్నాయి. ఇవి వీలు దొరికితే ఎవరి శరీరాన్నయినా అంటుకుని అనారోగ్యం పాలుచేసి తమ జాతిని పెంపొందించుకుంటాయి.

మామూలుగా శరీరానికి దెబ్బతగిలినపుడు బ్లేడు తదితర వస్తువులతో గాయాలు అయినపుడు ఇవి శరీరంలోకి ప్రవేశిస్తుంటాయి. అంతేకాదు, ముఖ్యంగా ఇవి దుమ్ము, చెడుగాలి, చీకటి ప్రదేశాలలో ఉండి మనిషిని క్రుంగ దీస్తున్నాయి. ఆహార పదార్థాల ద్వారా నీటిద్వారా శరీరంలోనికి ప్రవేశిస్తున్నాయి. తద్వారా మనకు కలరా, క్షయ, మలేరియా, దగ్గు, జలుబు లాంటి అనేక రకాలైన వ్యాధులు వస్తున్నాయి.

కాబట్టి ఈ కనిపించని శత్రువులు మనపై దాడిచేయకుండా ఎల్లప్పుడు మనల్ని మనం రక్షించుకోవాలి. ముఖ్యంగా శుభ్రత కలిగి ఉండటం అన్ని గదుల్లోకి సూర్యరశ్మి పడేలా చూడటం, మంచిగాలి పీల్చడం, మంచి ఆహారం తీసుకోవడం చేయాలి. పోతే బట్టలు, ఇళ్ళు, వీధులు శుభ్రంగా ఉంచుకునేట్లు ప్రయత్నించాలి. ఇంటికి దగ్గరగా కుళ్ళిపోయిన చెత్తా చెదారం ఉండకూడదు. మరియు తినే పదార్థాల మీద, తాగే పానీయాల మీద మూతలు పెట్టుకోవాలి. ఈగలు పడిన ద్రవ పదార్థాలు అవి ఏవైనా తీసుకోరాదు. రోడ్ల ప్రక్క లభించే పదార్థాలను ఎట్టి పరిస్థితులలోను కొని తినకూడదు. వాటిపై అనేక లక్షల సూక్ష్మజీవులు ఉంటాయి.

# మహానగరాలు

**ఢిల్లీ :** ఇది భారతదేశ రాజధాని. యమునా నదీ తీరాన ఉన్న చారిత్రాత్మక మహానగరం. 1639లో ఢిల్లీ నగరం షాజహాన్ చక్రవర్తి పాలనలో నిర్మితమైంది. చాందినీ చౌక్, ఎర్రకోట, దర్బారు మండపం, కుతుబ్‌మినార్, ఖగోళ వేధశాల, జంతర్ మంతర్ ప్రాంగణం దర్శనీయ స్థలాలు.

ఇండియా గేట్ (మృత వీరుల స్మారక చిహ్నం) ఇక్కడే వుంది. జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియం, ఇంద్ర ప్రస్థ ఇండోర్ స్టేడియం, టాల్కటోర ఈతకొలను నూతనంగా నిర్మించినవి. దీని విస్తీర్ణం 1483 చ. కిమీ. అధికార భాష హిందీ.

**కలకత్తా :** ఇది పశ్చిమ బెంగాల్ రాష్ట్ర రాజధాని. పెద్ద రేవు పట్టణం. కలకత్తా శివార్లతో కలుపుకొని 1036 చ. కి.మీ విస్తీర్ణం కలిగి ఉంటుంది. హుగ్లీ వద్ద ఊగే రైలువంతెన గంగానదిపై పట్టణ శివార్లలో కలదు. డండం అంతర్జాతీయ విమానాశ్రయం ఇచ్చట కలదు.

**ముంబాయి :** పశ్చిమ భారతదేశంలో అరేబియా సముద్రాన్ని ఆనుకొని వున్న మహానగరం. ఇది మహారాష్ట్ర రాజధాని. భారతదేశపు అంతర్జాతీయ వ్యాపారంలో సగానికి పైగా ముంబాయి మీదుగా జరుగుతుంది. అత్యధిక పారిశ్రామికాభ్యుదయం కలిగింది కూడా ముంబాయి నగరమే. భారీ యంత్ర సామాగ్రితో, భారీ మధ్య తరహా పరిశ్రమలతో భారతీయ ఆర్థిక వ్యవస్థను పెంపొందిస్తుంది. మొట్టమొదటి రైలు జంక్షన్ విక్టోరియా టర్మినస్ ఇక్కడే కలదు.

బాబా ఆటమిక్ రీసెర్చ్ సెంటర్, వేల్స్ మ్యూజియమ్, ఆర్ట్ గ్యాలరీలు, క్రీడా ప్రాంగణాలు ఇచ్చట చాలా కలవు. శాంటాక్రూజ్ గొప్ప అంతర్జాతీయ విమానాశ్రయం.

**చెన్నై :** ఇది తమిళనాడు రాష్ట్రానికి రాజధాని. ప్రసిద్ధరేవు పట్టణం. ప్రముఖ విద్యాకేంద్రం. నృత్యకళలకు ప్రాముఖ్యమైన ప్రదేశం. గొప్ప రైలు జంక్షన్, అంతర్జాతీయ విమాన కేంద్రం (మీనంబాకం) కలిగి వుంది. తిరువాన్మియూరు లోని కళాక్షేత్రం భరతనాట్య సంప్రదాయానికి జాతీయ కేంద్రం , పారిశ్రామిక కేంద్రం, గోల్డన్ బీచ్, వళ్ళువరకొట్టం మొదలగునవి చూడదగిన స్థలాలు.

# మహావ్యక్తులు - మరణాలు

1. **హుమాయూన్ :** (మొగల్ చక్రవర్తి) మేడమెట్లు దిగుతూ జారి క్రిందపడి ప్రాణాలు కోల్పోయాడు.
2. **క్లియోపాత్ర :** ప్రపంచంలో అందాల రాణిగా ఖ్యాతి చెందిన క్లియోపాత్ర "ఆల్ప్ " అనబడే అతి చిన్న భయంకరమైన పాముతో తన గుండెలమీద కాటువేయించుకొని మరణించింది.
3. **హిట్లర్ :** చరిత్రపుటల్లో రక్తదాహిగా పేరు పొందిన పరమ క్రూరుడు హిట్లర్ రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఆత్మహత్య చేసుకొన్నాడు.

**మనం ప్రేమించగలిగితే, హాయిగా యజమానులం అవవచ్చు, అలాకాక ద్వేషించడం మొదలెడితే, బానిసలం కాక తప్పదు.**

4. **సోక్రటీస్ :** గ్రీకు దేశంలో పుట్టి గొప్ప తాత్వికుడుగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సోక్రటీస్ గ్రీకు రాజు విధించిన మరణశిక్షనంగీకరించి నిర్భయంగా విషం త్రాగి మరణించాడు.
5. **షెల్లీ :** ఆంగ్ల రచయితలలో ప్రఖ్యాతి చెందిన షెల్లీ ఒక పడవ ప్రమాదంలో మరణించాడు.
6. **అలెగ్జాండర్ :** ప్రపంచాన్నే పాదాక్రాంతం చేసుకోవాలనుకున్న అలెగ్జాండర్ సాధారణ మలేరియా జ్వరం కారణంగా మరణించాడు.
7. **రాబర్ట్ క్లైవ్ :** మన భారత దేశంలో ఆంగ్ల సామ్రాజ్య స్థాపనకు పునాది వేసిన రాబర్ట్ క్లైవ్ ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు.
8. **ఆర్కిమెడీస్ :** ప్రఖ్యాత ఆర్కిమెడీస్ సూత్రకర్త గా పేరొందిన ఇతను ఒక తాగుబోతు అయిన రోమన్ సైనికుడి చేతిలో అన్యాయంగా చనిపోయాడు.
9. **నెపోలియన్ :** సేంట్ హెలీనా దీవిలో ఆరు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించి 56వ యేట విషప్రయోగం వలన వ్యాధిగ్రస్థుడై మరణించాడు.
10. **మేడం క్యూరీ :** రేడియం కనుగొని వివిధ వ్యాధుల నివారణకు రేడియం పాత్రను ఎరుకపరచి నోబెల్ బహుమతిని అందుకొన్న మేడం క్యూరి తన జీవిత కాలంలో ఎక్కువ రేడియేషన్‌కు గురై అవయవాలన్ని దెబ్బతిని పోవడంతో మరణించారు.
11. **జేమ్స్ కుక్ :** ప్రపంచ ప్రఖ్యాత నావికుడు కెప్టెన్ జేమ్స్ కుక్ అడవి మనుషుల చేతిలో పడి నరికి చంపబడ్డాడు.
12. మహాత్మా గాంధీ, ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధీ, నాసర్, కెనడీ, భుట్టో, ఈదిఆమిన్‌లు కిరాతుల తుపాకీ కాల్పులతో మరణించారు.

# మనపరిశ్రమలు

పరిశ్రమలు మూడు రకాలు (1) భారీ పరిశ్రమలు (2) మధ్యతరగతి పరిశ్రమలు, (3) చిన్న తరహా పరిశ్రమలు . నడిపించే వారినిబట్టి ప్రభుత్వరంగం, ప్రైవేట్ రంగం, ఉమ్మడిరంగం (సహకారరంగం) పరిశ్రమలని కూడా పిలుస్తుంటారు. వీటిలో ముఖ్యమైన పరిశ్రమలను గూర్చిన కొన్ని వివరాలు తెలుసుకుందాం.

**వస్త్ర పరిశ్రమలు**

1. **ప్రత్తివస్త్ర పరిశ్రమ :** ఈ పరిశ్రమ అహ్మదాబాదు, ముంబాయి, షోలాపూర్,

అకోలా, నాసిక్, సూరత్, వాడొదార్, కాలోల్, రాజకోట్, గుజరాత్‌లోని భావనగర్, మధు, కోయంబత్తూరు, సేలం, చెన్నై, రామనాథపురం, కలకత్తా, ఆగ్రా, రాంపూర్, ఉత్తర ప్రదేశ్‌లోని మొరాదాబాద్, పంజాబ్‌లోని అమృతసర్, కేరళ, ఆంధ్రప్రదేశ్‌లలో వుంది.

**2. ఉన్ని వస్త్ర పరిశ్రమ :** పంజాబ్‌లోని అమృతసర్, కాశ్మీర్ లోని శ్రీనగర్ మహారాష్ట్రలోని ముంబాయిలో మరియు ఆగ్రా, మీర్జాపూర్, గ్వాలియర్, గుజరాత్‌లోని జామ్‌నగర్‌లలో ఈ పరిశ్రమ వుంది.

**3. సిల్కు వస్త్ర పరిశ్రమ :** భారతదేశం సిల్కుకు ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది. మైసూర్, కాంచీపురం, తంజావూర్, వారణాశి, శ్రీనగర్, ముర్షిదాబాద్, అమృత్‌సర్ మహాదేవపురం ఈ పరిశ్రమకు ముఖ్య ఉత్పత్తి కేంద్రాలు.

**4. కృత్రిమ నూలు వస్త్ర పరిశ్రమ :** రేయాన్, నైలాన్, టెరిన్, డెక్రాన్ వంటి కృత్రిమ నూలు దారాలతో వస్త్రాలు తయారవుతాయి. ముంబాయి, అహ్మదాబాదు, సూరత్, కలకత్తా, అమృతసర్, గ్వాలియర్, ఢిల్లీ దీని ముఖ్య ఉత్పత్తి కేంద్రాలు.

**5. జనపనార పరిశ్రమ :** ఈ పరిశ్రమ భారతదేశంలో అతి పురాతనమైనది. కలకత్తాలో 100కు పైగా ఈ మిల్లులు ఉన్నాయి. పోతే బీహార్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లు ముఖ్య ఉత్పత్తి రాష్ట్రాలు.

## రవాణా పరిశ్రమలు

**1. రైల్వేలు :**

బీహార్‌లో టాటానగర్, పశ్చిమ బెంగాల్ చిత్తరంజన్ వద్ద రైలు ఇంజన్లు తయారగుచున్నవి. ఉత్తర ప్రదేశ్‌లో వారణాసిలో డీసిల్ ఇంజన్లు, చెన్నై దగ్గరలో మున్న పెరుంబుదూర్‌లో రైలు పెట్టెలు తయారవుతున్నాయి.



**2. ఓడల నిర్మాణం :**

పశ్చిమ బెంగాల్ లోని కలకత్తావద్ద, ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్టణం వద్ద ముంబాయి వద్ద నున్న 'మాజాగాం' లోను కేరళలోని కొచ్చిన్‌వద్ద ఓడల నిర్మాణ పరిశ్రమ ఉంది.



మన వ్యవహారాల విషయంలో మనం ... అదే ... వ్యవహారాల విషయంలోనైతే, హృ... స్పందించాలి.

3. మోటార్ల పరిశ్రమ :

లక్నోలో స్కూటర్లు, కలకత్తా, ముంబాయి, చెన్నైలలో కార్లు తయారు చేయబడుతున్నాయి.

4. విమాన పరిశ్రమ :

బెంగుళూరు, కాన్పూర్, నాసిక్, కోరాపుట్, హైదరాబాద్, లక్నోలలో విమాన నిర్మాణం జరుగుతున్నది.

## ఖనిజాధార పరిశ్రమలు

1. ఇనుము ఉక్కు పరిశ్రమ :



భిలాయ్ (మధ్యప్రదేశ్) బొకారో (బీహార్) కర్మాగారాలను రష్యా సహకారంతోను, దుర్గాపూర్ కర్మాగారాన్ని బ్రిటిష్ వారి సహకారంతోను, రూర్కెలా (ఒరిస్సా) కర్మాగారాన్ని జర్మనుల సహకారంతోను స్థాపించుకున్నాం. ప్రైవేట్ రంగంలో 'జంషెడ్ పూర్ (బీహార్) బరంపూర్ (ప॥ బెంగాల్) భద్రావతి (కర్ణాటక) వైజాగ్ (ఆంధ్రప్రదేశ్) లలో కర్మాగారాలున్నాయి. మరెన్నో కర్మాగారాలు నిర్మాణ దశలో వున్నవి.

2. పంచదార పరిశ్రమ :

ఉత్తర ప్రదేశ్‌లో ఈ మిల్లులు ఎక్కువగా వున్నాయి. బీహార్, తమిళనాడు, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, హర్యానా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో కూడా కలవు.

3 తేయాకు, కాఫీ పరిశ్రమలు :

అస్సాం, పశ్చిమ బెంగాల్, నీలగిరులు, హిమాచలప్రదేశ్‌లలో ఈ పరిశ్రమలు వున్నాయి.

4. కాగితం పరిశ్రమ :

మధ్య ప్రదేశ్‌లోని నాపా నగర్‌లో వార్తాపత్రికలకు ఉపయోగపడు కాగితం తయారవుతుంది. కలకత్తా, మహారాష్ట్ర, హర్యానా, ఉత్తర్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, గుజరాత్, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లలో ఈ పరిశ్రమలున్నాయి.

5. రసాయన, మందుల పరిశ్రమ :

పూనావద్ద పింప్రిలో పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్‌లు, సింద్రీలో సల్ఫ్యూరిక్ ఆమ్లమును తయారు చేయుచున్నారు. మరియు హిందూస్థాన్ డ్రగ్స్ అండ్ ఫార్మాస్యూటికల్స్

గుడ్లు పెడుతుంది.

లిమిటెడ్‌కు సంబంధించిన ఫ్యాక్టరీలు ఢిల్లీ కేరళలోని అల్వాయ్‌లోను ఉన్నాయి. ఇండియన్ డ్రగ్స్ అండ్ ఫార్మాస్యూటికల్స్ లిమిటెడ్ హైదరాబాదులో ఉన్నది.

**5. తోళ్ళ పరిశ్రమ :**

చెన్నైలో ఎక్కువగా ఈ పరిశ్రమలు వున్నాయి. ఇంకా ఆగ్రా, కలకత్తా, కాన్పూర్, ముంబాయి, బెంగుళూరు వీటి ఉత్పత్తి కేంద్రాలు.

## ఇతర పరిశ్రమలు

**1 భారత ఇంజనీరింగ్ యంత్రపరికరాల పరిశ్రమ :**

భారతదేశం ఈ రంగంలో దాదాపు పూర్తిగా స్వయం సమృద్ధిని సాధించింది. ఇంజనీరింగ్ వస్తువులను ఇతర దేశాలకు ఎగుమతికూడా చేస్తుంది. రకరకాల యంత్ర పరికరాలను తయారు చేసే హిందుస్థాన్ మెషిన్‌టూల్స్ యొక్క విభాగాలు బెంగుళూరు (కర్ణాటక) పిన్‌జోర్,(హర్యానా) కలామిశ్శరి (కేరళ) హైదరాబాదులలో కూడా నెలకొల్పబడి వున్నాయి.

**2. పెట్రోలియం రసాయనాల పరిశ్రమ :**

గుజరాత్‌లోని బరోడా వద్ద, ముంబాయి వద్ద ఈ పరిశ్రమకు మూలాధారమైన ఖనిజ తైలాలు ఉత్పత్తి అవుతున్నాయి. కృత్రిమ రబ్బరు, కృత్రిమ నార, రసాయనిక జిగుర్లు ప్లాస్టిక్ గ్రీజ్ ఇచ్చట ఉత్పత్తి అవుతున్నాయి.

**3. గాజు పరిశ్రమ :**

పశ్చిమబెంగాల్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, బీహార్‌లలో గాజు సామాన్లు ఉత్పత్తి అవు తున్నాయి.

**4. సిమెంటు పరిశ్రమ :**

దాల్మియా నగర్, సింద్రి, రాంచి, కల్యాణ్‌పూర్,(బీహర్), కటావి (మధ్యప్రదేశ్) కాకేరి, సవాయ్ మధోల్‌పూరే, (రాజస్థాన్) పోరుబందరు, సివాలియా, గుజరాత్‌లో చుర్క్, ఉత్తర ప్రదేశ్‌లో భూపేంద్రనగర్, సూరజ్ పూర్ (పంజాబు) బెంగుళూరు మరియు ఆంధ్రప్రదేశ్‌లో కూడా సిమెంటు పరిశ్రమ ఉంది.

**5. ఎరువుల పరిశ్రమ :**

సింద్రి (బీహార్), నంగల్ (పంజాబు), నైవేరి (తమిళనాడు), రూర్కెలా (ఒరిస్సా), ట్రాంబే (మహారాష్ట్ర), నహార్‌కట్యా (గుజరాత్), గోరక్‌పూర్, కాన్పూర్ (ఉత్తర ప్రదేశ్) నామరూప్ (అస్సాం), విశాఖపట్టణం (ఆంధ్రప్రదేశ్) లోను ఈ పరిశ్రమలు ఉన్నాయి. వీటిల్లో కాన్పూర్, విశాఖపట్టణం ఫ్యాక్టరీలు ప్రైవేటు రంగానివి.

**మనిషి వయసు ఎంత పెరిగినా, తను మానవాళిలో అందరిలాంటివాడని కావాలి భావిస్తూ వుండేంతవరకూ, అతనికి మనోవికాసం వుండదు.**

# బాల మేధావులు

ప్రతిభ అనేది అటు పెద్దలలోను, ఇటు పిన్నలలోను నెలకొని ఉంటుంది అనే దానికి నిదర్శనంగా ఈనాడు ఎందరో బాల మేధావులు ప్రఖ్యాతి గాంచారు.

**రాజశ్రీరామచంద్రన్ :** అమెరికాలో చదువుతున్న ఈ అబ్బాయి 1988లో స్పెల్లింగ్ పోటీలో అపూర్వ విజయం సాధించి బాల మేధావిగా గుర్తించబడ్డాడు. ఈ అబ్బాయి మన భారతదేశం నుండి వలస వెళ్ళిన కుటుంబంలోని వాడు.

**చేతనా షాయర్ :** 13 సం ॥ ల ఈ అబ్బాయి పైమ్స్ పోటీలో విజయం సాధించి 3 లక్షల రూపాయలు బహుమతిగా పొందాడు.

**క్రిష్టియన్ బెనర్జీ :** ఆరు సంవత్సరాల వయస్సులోనే ఈ అమ్మాయి హైస్కూల్ ఎడ్యుకేషన్ పూర్తిచేసింది. ఈమె కాలేజీలో చేరి చరిత్ర సృష్టించడంతో ఇంత వరకు ఇంత చిన్న వయస్సులో అమెరికాలో మెడికల్ కాలేజీలో అర్హత సంపాదించినవారు లేరని అక్కడి రికార్డ్స్ పేర్కొన్నాయి.

తమాషా ఏమిటంటే ' టెక్సాస్ ' లోని మెడికల్ కాలేజీలో ఈ పాప తల్లికూడా బెనర్జీతో పాటు ఎంట్రెన్స్ పరీక్ష వ్రాసి అదే క్లాసులో చేరింది. అలా తల్లీ బిడ్డలు క్లాస్‌మేట్స్‌గా మారి ఉచితంగా మెడికల్ కోర్సు చదువుతున్నారు.

**స్కేటింగ్ హీరో :** పదేళ్ల వయసున్న "అనూప్ కుమార్" స్కేటింగ్‌లో అద్భుతమైన విన్యాసాలు చేసి జాతీయ స్థాయిలో ఆంధ్రప్రదేశ్ ఖ్యాతిని నిలిపాడు. నాలుగేళ్ళ వయస్సులో స్కేటింగ్‌లోకి అడుగిడిన అనూప్ తల్లిదండ్రుల గొప్ప శిక్షణతో ఎదిగి స్కేటింగ్ హీరోగా జాతీయ స్థాయికి చేరాడు.

హైదరాబాద్‌లోని బేగంపేట గీతాంజలి పబ్లిక్ స్కూల్ లో ఈ బాబు ప్రాథమిక విద్య పూర్తి చేస్తున్నాడు. అయితే చదువులోనూ ఈ అబ్బాయి ప్రథమ శ్రేణిలోనే ఉన్నాడు.

**తొమ్మిదేళ్ల పైలట్ :** అమెరికాకు చెందిన 'రాబెల్ కార్టర్ ' 8,859 కిలో మీటర్ల దూరం విమానాన్ని నడిపించి సంచలనం సృష్టించింది. వృత్తిరీత్యా ఈ పాప తండ్రి పైలట్ కావడంతో రాబెల్‌కు 7వ సంవత్సరం నుంచే విమానం శిక్షణ ఇచ్చాడు. రాబెల్‌లె పైపర్ ఏర్ విమానాన్ని నడుపుతుండగా తండ్రి అందులో కో పైలట్‌గా వ్యవహరించాడు.

మానిషికి సాధ్యం కాని ... చెప్పడం చాలా కష్టం. ఎందుకంటే నిన్నటి కల నేడు ఆశగా మారి రేపటి వాస్తవంగా, పూపిరి పోసుకుంటున్నది.

**కరాటే కింగ్ :** కలకత్తాకు చెందిన 'సన్నీ ఘోష్" అనే అబ్బాయి నాలుగేళ్ళ వయస్సు కలిగి కరాటేలో గొప్పగా పేరు పొందాడు. మూడేళ్ళ నుండే ఈ బాబు కరాటే ప్రాక్టీస్ చేశాడు. ఆ మధ్య పూనాలో జరిగిన ఇంటర్నేషనల్ పోటీలో పాల్గొన్న వారిలో చాలా చిన్నవాడు సన్నిఘోష్ ఒక్కడే. 3 అడుగుల 2 అంగుళాల ఎత్తులో బాల భీముడిలా ఉన్న ఈ అబ్బాయి శక్తిని, యుక్తిని చూసి అనేక కరాటే పండితులు ఎంతగానో అభినందించారు.

**తబలా వాద్య విపుణుడు :** మహారాష్ట్ర అకోలా జిల్లాలోని 'అకోట్'కు చెందిన ఈ బాలుడు ఒక వైద్యుని కుమారుడు. అయిదు సంవత్సరాల వయస్సులోనే తబలా వాయించడంలో చక్కని నైపుణ్యం సాధించాడు. తండ్రి ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో తబలా వాయిస్తుండగా చూసి, నాలుగేళ్ళ వయస్సులోనే తండ్రికి వచ్చిన విద్యనంతా నేర్చుకొన్నాడు. ఆ తర్వాత కొడుకు ఏకాగ్రతను గ్రహించి ఒక సంగీత విద్వాంసునికి అప్పగించగా అక్కడ ఒక నెల రోజులు శిక్షణ పొందాడు. స్వయంగా గురువే " ఇంక నావద్ద విద్య ఏమీ దాగిలేదు అంతా నేర్చేశాడు " అనడంతో ఆ బాబు స్టేజీ మీద రెండు గంటలు అద్భుతంగా ప్రదర్శన ఇచ్చి పలు ప్రశంసలు పొందాడు.

**నాలుగేళ్ళ దర్శకుడు :** 'గ్రేట్ స్కాట్' అనే అమెరికాకు చెందిన ఈ బాబు చిన్నప్పటి నుండే సంగీతమన్నా, సాహిత్యమన్నా ఎక్కువగా ఆకర్షితుడయ్యేవాడు. అలా నాలుగేళ్ళ వయస్సు వచ్చే సరికి "హాలివుడ్ స్థాయిలో చిత్ర దర్శకుడి స్థాయికి చేరుకొన్నాడు.

ఇప్పుడు అమెరికాకు చెందిన యూనివర్సల్ స్టూడియో వారు నిర్మించే చిత్రాలకు దర్శకత్వం వహించడానికి ఈ చిన్నారి దర్శకునితో కంట్రాక్టు కుదుర్చుకుని పెద్ద జీతం కూడా ఏర్పాటు చేశారు. త్వరలోనే ఎన్నో చిత్రాలు ఇతని దర్శకత్వంలో వెలుగుచూడనున్నాయి.

**అంతర్జాతీయ చదరంగంలో గుర్తింపు పొందిన తొలి భారతీయ బాలిక :**

కొత్త ఢిల్లీలోని మోడర్న్ స్కూల్ విద్యార్థి అయిన తాన్యాసచ్‌దేవ్ అయిదున్నర ఏళ్ళ వయస్సులోనే చదరంగంలోకి అడుగుపెట్టి రెండేళ్ళలోపలే భారతదేశానికి అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిపెట్టింది.

జాతీయ స్థాయిలో ఎనిమిది ఏళ్ళలోపు బాలల విభాగంలో అంతర్జాతీయ స్థాయిలో వ్యక్తిగత విజయం సాధించింది. గత సంవత్సరం బ్రిటన్ దేశానికి చెందిన 8 ఏళ్ళలోపు బాలికల చదరంగ టైటిల్‌ను గెల్చుకొని 1994లో నార్విచ్‌లో జరిగిన 81వ ఛాంపియన్ షిప్ పోటీల్లో 8 ఏళ్ళ నుంచి 10 ఏళ్ళ లోపు బాలికలు, బాలుర

**ప్రపంచంలో ప్రతి మనిషి ఏదో ఒక విధంగా పనికివస్తాడు. ప్రతి జీవితానికి ఓ అర్థం, ఓ ప్రయోజనం వుండితీరతాయి.**

విభాగాల్లో కూడా టైటిల్ సాధించింది. ఈ పోటీల్లో తాను ఆడిన 27 గేములకు 20 గెలుచుకొని తన ప్రతిభను ప్రదర్శించింది. 226 మంది పోటీ దారులున్న ఈ మ్యాచ్‌లో ఆరు మ్యాచ్‌లు గెలిచి అంతర్జాతీయ చెస్ టోర్నమెంట్ గెలుచుకొన్న తొలిభారతీయ బాలికగా తాన్యా సచ్‌దేవ్ మంచి గుర్తింపు పొందింది.

**సంగీత ద్రష్టగా సంగీత :** ఢిల్లీకి చెందిన 'సంగీత' అనే ఒక పాప 7 ఏళ్ళ వయసులోనే గొప్ప సంగీత విద్వాంసురాలిగా పేరు తెచ్చుకుంది. ఇప్పటి వరకు 70 కచేరీలు చేసిన ఈ పాప త్యాగరాజ ఆరాధన సభల్లో సంగీత విద్వాంసులతో కలిసి కచేరీ చేసి అందర్నీ ఆకట్టుకుంది. తనకున్న చక్కని స్వరాన్ని కాపాడుకోవడానికి ఆ పాప ఆహార విషయంలో ఎంతో శ్రద్ధ వహిస్తూ ముందడుగు వేస్తోంది.

# సాహస బాలురు - బాల కార్మికులు

బాల్యంలో హాయిగా అందంగా ఆడుకుంటూ కాలం గడపాల్సిన బాలురు నేడు దేశంలో కఠినమైన ప్రమాదకరమైన పనులు చేస్తూ భారతీయ చట్టాన్ని ప్రభుత్వాల్ని ప్రశ్నిస్తున్నారు.

1881లో ప్రథమంగా భారతదేశంలో బాల కార్మికులకు సంబంధించిన నిబంధనలు ఏర్పడ్డాయి. అందులో 7 నుండి 12 సంవత్సరాల మధ్య వయస్సు గల పిల్లలు ఫ్యాక్టరీలలో కార్మికులుగా పనిచేయరాదని పేర్కొన్నారు. ఆ తరువాత 1922, 1934, 1948లో ఫ్యాక్టరీల చట్టాలలో బాల కార్మికులకు సంబంధించిన అనేక అంశాలను సవరించి శాసనాలు చేశారు.

అయితే ఆ చట్టాలేవీ పిల్లల విషయంలో పనిచేయకపోవడం ఎంతో బాధనీ, ఆశ్చర్యాన్నీ కలిగిస్తుంది. తమిళనాడు , శివకాశి జిల్లాలో బాల కార్మికులు శక్తికి మించి పనిచేయడంలో ఇది ఎంతో ప్రసిద్ధిపొందినది. ఇక్కడ అగ్గిపెట్టెల పరిశ్రమలో ఐదు సంవత్సరాల వయస్సు గల పిల్లలు వేల కొద్ది పనిచేస్తున్నారు. ఒక్కొక్కరు రోజుకు 10 గంటలు కూడా పనిచేస్తారు. దాదాపు 40 వేల మంది పిల్లలు శివకాశిలో బాణాసంచా పరిశ్రమలోను, కాలెండర్లు తయారు చేసే ఇతర సంస్థల్లోను పనిచేస్తున్నారు.

ఉత్తర ప్రదేశ్ " బాదొహిల్ " లోని తివాసీ నేత పరిశ్రమలోని 50 వేల మంది కూలీలలో 1 శాతం పసిపిల్లలే. మిర్జాపూర్ లోని కార్మికులలో 8వేల మంది

చిన్నారులు పనిచేస్తున్నారు. కాశ్మీరు తివాసీ నేత పరిశ్రమలోనూ పసిపిల్లలే పనిచేస్తున్నారు.

గుజరాత్‌లో సూరత్ దాని చుట్టుప్రక్కల 13 నుండి 14 సం ॥ వయస్సు గల పిల్లలు కండ్లకు మిక్కిలి అపాయకరమైన వజ్రాల కోత పనులలో పనిచేస్తున్నారు.

ఒరిస్సాలో ఒక విధంగా అప్పుతీర్చుకోవాలంటే 8 నుండి 10 సంవత్సరాల వయస్సు గల ఆడపిల్లలను అప్పు ఇచ్చిన వారికి పని పిల్లలుగా అమ్ముతున్నారు. ఖనిజ పరిశ్రమలో పెద్దవాళ్ళు గనులు త్రవ్వుతుంటే బాలురు బొగ్గును పైకి మోసుకుపోతారు. పెద్ద పెద్ద సొరంగాలలో వంగనవసరం లేకుండా నడవగలుగుతారు కాబట్టి 12 సంవత్సరాల వయస్సు గల పిల్లలను ఈ పనికి ఉపయోగిస్తున్నారు.

40 % కటిక దరిద్రంతో నిండిన మనదేశంలో పిల్లలు తప్పనిసరిగా పనిచేయాల్సి వస్తుంది. అయితే ఇది ఆరోగ్యకరమైన వాతవరణం కాదు. ఎందరు మేధావులు, కళాకారులు ఆ చిన్నారులలో దాగున్నారో తెలియదు. అలాంటి వారిని యంత్రాల మధ్య నలిపివేయడం దారుణం. ఏదేమైనా బాలల జీవితాన్ని యంత్రాల మధ్య, కఠినమైన పనులమధ్య వారిని అమానుషంగా నలిపివేయకుండా సంస్కారంతో అనేక సంస్థలు, సంఘాలు ప్రభుత్వం దృష్టికి తెచ్చి బాల కార్మికుల చట్టాలను అమలు చేయించాల్సి ఉంది. ఎన్ని చట్టాలు చేసినా పసి హృదయం గాయపడకుండా అమలు పరచినప్పుడే భవిష్యత్‌లో భారతం అందంగా సుందరంగా వెలుగులీనుతుంది.

# సాహస బాలురు

**నయన :** మహారాష్ట్రలోని ఠానే జిల్లాలో వున్న 'నయన' అనే బాలిక పదవ తరగతి చదువుతున్నది. ఈ బాలిక ఇంగ్లీష్ ఛానల్‌ను 15 గంటలలో ఈది ప్రపంచ రికార్డు సాధించింది. ఇంగ్లీష్ ఛానల్ ను ఈదిన మొదటి భారతీయ బాలికగా ఈమె ప్రఖ్యాతి పొందింది.

**పిమ్మ :** జపాన్‌కు చెందిన "పిమ్మ" అనే 15 సం ॥ రాల కుర్రాడు ఒంటి చక్రం సైకిల్ మీద 5,400 కి.మీల దూరాన్ని ఏకధాటిగా 43 రోజులు ప్రయాణం చేసి న్యూయార్కు నుండి అమెరికాలోని వైట్ హౌస్ చేరుకున్నాడు.

**స్కేటింగ్‌లో రికార్డు :** 15 సం ॥ల లోపు వయస్సున్న బాల బాలికలు అహ్మదాబాదు నుండి న్యూఢిల్లీ వరకు స్కేటింగ్ చేసుకొంటూ 1200 కిలో మీటర్ల దూరం ప్రయాణం చేశారు.

**కార్ల్ కూపర్ :** బ్రిటన్‌కు చెందిన ఈ బాలుని వయస్సు 7 సంవత్సరాలు 'స్కైయింగ్' ప్రాక్టీస్ చేసి మూడేళ్ళ వయస్సులోనే మంచు పర్వతాల నుండి గంటకు 60 కిలో మీటర్ల వేగంతో స్కైయింగ్ చేసాడు. ఏ మాత్రం పట్టుదప్పినా ప్రాణాలు పోయే ఈ సాహస క్రీడ పలువురిని ఆకర్షించింది.

# వికలాంగులు - ప్రతిభా పాటవాలు

అన్ని అవయువాలు వుండికూడా అనేక మంది నేనేమి సాధించలేను నాకు శక్తి లేదు అని తమను తాము అశక్తులుగా ఊహించుకొని ఏ పనీ సాధించలేకపోతున్నారు. కానీ మనిషి తలుచుకొంటే అనుకున్నది సాధించవచ్చు అందుకు ఏ శక్తి అడ్డురాదని అనేక మంది వికలాంగులు తమ ప్రతిభను ప్రపంచానికి చాటిచెప్పారు.
**హెలెన్ కీలర్:** అమెరికాకు చెందిన "హెలన్ కీలర్"కు తన 19 ఏళ్ళ వయస్సులో జబ్బు చేసి చెవిటి, మూగ, గుడ్డితనం వచ్చి దుర్భర జీవితాన్ని అనుభవిస్తూ తనకంటూ ఒక ప్రత్యేకతను సృష్టించుకోవాలనీ బ్రెయిలీ విద్య (స్పర్శద్వారా నేర్చుకొనేటువంటిది) ను నేర్చుకొని ఎన్నో గ్రంథాలు వ్రాసింది. అనేక అంధుల పాఠశాలలు నెలకొల్పి వారికి సహకరించింది. ఆ విధంగా ఆమెను వెక్కిరించిన మూడు రకాల అవిటితనం ఆమె ప్రయత్నం ముందు ఏమీ చేయలేక అంతరించిపోయింది. ఆవిధంగా ఆమె నిత్యం ఎంతో ఉత్సాహంతో బ్రతికింది.
**జేమ్స్ థర్బర్ :** ఇతడు అమెరికా దేశస్థుడు . చిన్న తనంలో ఒక కన్నుపోయింది. వయస్సులో రెండవ కన్ను కూడా పనిచేయడం మానివేసింది. అయినా అతడు కృషిచేసి "న్యూయార్కర్" అనే పత్రికలో పనిచేస్తూ వ్యాసాలు రాస్తూ ప్రముఖ కార్టునిస్టుగా వెలుగొందాడు.
**వార్మన్ :** లండన్‌కు చెందిన వార్మన్ కాళ్ళు తెగిపోయినా, 1981లో చంక కర్రలు ధరించి అర్జెంటీనాలోని 17వేల అడుగుల ఎత్తైన పర్వతాన్ని ఎక్కి వచ్చాడు.
**గెల్‌బిల్ :** భారత దేశానికి చెందిన గెల్‌బిల్ అనే విద్యార్థి కొల్హాపూర్ ప్రాంతీయుడు. చేతులు పోయినా ఇతడు సైకిల్ తొక్కగలడు. ఈదగలడు.
**భరత్‌రాజ్:** ఇండియాకు చెందిన ఈ బాబు రెండు చేతులు పోయినా అన్ని పనులు తన రెండు కాళ్లతో చేసుకుంటాడు. తన ముసలి తల్లికి పొయ్యి వెలిగించి, వంట చేసి పెట్టేవాడు. తన మిత్రులకు లేఖలు కూడా వ్రాస్తాడు.
**హరిరాం :** పూణేకు చెందిన హరిరాం మిలిటరీలో ఉండగా జరిగిన ప్రమాదంలో అతని రెండు కాళ్ళు , రెండు చేతులు పోయాయి. ఎలాగూ ఇంట్లోనే వుండాలి కాబట్టి వంటరిగా ఉంటూ, ఏ పనీ లేక ఏదో చేయాలన్న ఆలోచనతో ఉండేవాడు.

**గొప్ప [illegible] తన [illegible] తమపట్ల తాము విశ్వాసాన్ని పెంపొందించుకునేలా ప్రేరణ కలిగిస్తాడు.**

ఆ విధంగా ఒక ఆర్టిస్టుతో పరిచయం పెంచుకొని అపారంగా కృషిచేసి నోటితో బ్రష్ (కుంచె) పట్టుకొని బొమ్మలు గీయడం అభ్యాసం చేసి విజయం సాధించాడు.

సుమారు 15వేలకు పైగా గ్రీటింగ్ కార్డులకు డిజైన్ చేసాడు. ప్రస్తుతం ఇంగ్లాండు, ఫ్రాన్స్, డెన్మార్క్, ఇటలీ, నార్వే, సింగపూర్, కెనాడా జర్మనీ దేశాలలోని అనేక సంస్థలకు డిజైనర్‌గా పనిచేస్తూ విశ్వఖ్యాతిని పొందాడు.

**జిమ్ :** పుట్టుకతోనే రెండు చేతులు లేకుండా పుట్టినాకూడా ఏ మాత్రం బాధపడకుండా మనం చేతులతో ఎన్ని పనులు చేస్తామో అతడు అన్ని పనులు కాళ్లతో చేసుకొంటాడు.

అమెరికా లోని ఇల్లినాయిస్ నగరానికి చెందిన జిమ్ రెండు కాళ్లతోనే అత్యద్భుతంగా రైఫిల్ కాలుస్తాడు. అంతేకాదు, కాలితో బ్యాట్ పట్టుకొని బేస్‌బాల్ గొప్పగా ఆడగలడు.

**వెంకటేశ్ :** సికింద్రాబాదుకు చెందిన ఈతనికి 1991లో ఎలక్ట్రిక్ షాక్ వల్ల కుడిచెయ్యి మణికట్టు వరకు పోయింది. ఆ చేతితో కాంగో, డ్రమ్ము, జార్జ్, గిటార్, వాయిద్యాలు వాయించేవాడు. చెయ్యి పోవడం వల్ల మానసికంగా ఎంతగానో క్రుంగిపోయి సంగీతంలో తన అభిరుచిని చంపుకోలేక ఆ కళను ఎడమచేతికి రప్పించడానికి ఎంతో సాధన చేసి ప్రస్తుతం "క్యాషియో" వాయించగలుగుతున్నాడు. అయితే ఆ చేతికి కూడా చిటికిన వేలు తప్ప మిగతా వేళ్లు పని చేయవు. అయినా కూడా ఆ ఒక్క వేలితో అనేక రాగాలు అందంగా శ్రావ్యంగా వాయించగలుగు తున్నాడు. జీవనోపాధికి ప్రభుత్వం కల్పించిన పబ్లిక్ కాల్ బూత్‌ను నడుపుకుంటూ ఒక వైపు ఈ సంగీత సాధనలో తన జీవితాన్ని ఉద్యమింప చేస్తున్నాడు యం. వెంకటేశ్. ఈవిధంగా ఎందరో వికలాంగులు తమ ప్రతిభను చాటుతున్నారు.

# వార్తా పత్రికలు

**" అజ్ఞానానికీ అణిచివేతకూ వ్యతిరేకంగా పోరాడే అతి శక్తివంతమైన ఆయుధం పత్రికా రచన "** అన్నాడు జేమ్స్ గార్ఫెల్డ్.

ఈరోజు అనేక వార్తలతో పాటు దేశ విదేశాలలోని విశేషాలను ఎప్పటికప్పుడు మనకు తెలియజేయడంలో వార్తా పత్రికలు మనిషి ప్రయోజనానికై ఎంతో కృషి చేస్తున్నాయి.

మనదేశంలో మొట్టమొదట 1880లో ఆంగ్లంలో ఆంగ్లేయులు ' ఇండియా గెజిట్ ' అనే పత్రికను ప్రారంభించారు. పిదప భారతీయుడు గంగాధర భట్టాచార్య 1816లో ' బెంగాల్ గెజిట్ ' అను పత్రికను స్థాపించాడు. తరువాత మన దేశ భాషలో " సమాచార దర్పణం " అనే పత్రిక వెలసింది.

**జీవితంలో చిన్న చిన్న విషయాలకి తమ శక్తియుక్తులని వెచ్చించేవారు, పెద్ద పెద్ద విషయాలకొచ్చేసరికి తరచుగా ఏమీ చెయ్యలేకపోతుంటారు.**

1821లో రాజారామ మోహన్ రాయ్ " సంవాద కౌముది (బెంగాలీ) అను వార్తా పత్రికను ప్రారంభించాడు. తెలుగులో ' సత్యదూత ' పత్రిక 1835లో మాస పత్రికగా వెలువడి తెలుగులో పత్రికా రచనకు మూలమైందని చరిత్ర పరిశోధకులు వెల్లడిచేసారు. అనంతరం 1874లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు "వివేక వర్ధిని" అను మాస పత్రికను ప్రారంభించారు. "కాశీనాథుని నాగేశ్వర రావు' పంతులు ఆంధ్రపత్రికను 1908లో ప్రారంభించారు. 1925లో సురవరం ప్రతాప రెడ్డి హైదరాబాదులో "గోల్కొండ " పత్రికను నెలకొల్పారు. వార్తాపత్రికలందు దిన పత్రికలు, వార పత్రికలు, పక్ష పత్రికలు , మాస పత్రికలు, త్రైమాసిక పత్రికలు కూడా కలవు. పోతే విషయాన్నిబట్టి రాజకీయ పత్రికలు, క్రీడారంగ పత్రికలు, సినిమా పత్రికలు, జ్యోతిష పత్రికలు వంటి వివిధ రకాలైన పత్రికలు కూడా వెలువడుతున్నాయి. మనదేశంలో వివిధ భాషలలో పత్రికలు వస్తున్నాయి. హిందూ , స్టేట్స్‌మేన్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, దక్కన్ క్రానికల్ మొ॥ నవి ఆంగ్ల పత్రికలు. తెలుగులో ఈనాడు, వార్త, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, ఆంధ్రపత్రిక, ప్రజాశక్తి పత్రికలు ప్రజాదరణను పొందినవి.

వార పత్రికలు, కథలకు, సినిమా, రాజకీయ వార్తలకు ప్రాముఖ్యత నిస్తాయి. వీటికి దేశ విదేశాల వార్తా సంస్థల వారు తమ తమ వార్తలను అందిస్తారు. వార పత్రికలు ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, వనితాజ్యోతి, స్వాతి ముఖ్యమైనవి. పక్షపత్రికలలో ఇండియా టుడే, సుప్రభాతం, ఎంతో ప్రజాకర్షణను చూరగొన్నాయి.

మాస పత్రికలలో అనేక రకాలున్నాయి. ఆరోగ్యానికి సంబంధించినవి. రాజకీయ ప్రాముఖ్యం కలిగినవి. విజ్ఞాన పత్రికలు విస్డమ్, వండర్ వరల్డ్, మరియు కథల పత్రికలు అయిన చందమామ, బొమ్మరిల్లు, బాలజ్యోతి, మొదలగునవి ఈనాడు ప్రజల చేతుల్లో ఉన్నవి. ఇవే గాక 'ఈనాడు' వారి విపుల, చతుర, అన్నదాత పత్రికలు కూడా ప్రాచుర్యం పొందినవి.

## గడియారములు

ఈనాడు ప్రతిపని సమయంతో ముడిపడి వుంది. సమయం అనగానే గడియారం జ్ఞాపకమొస్తుంది. ప్రాచీన కాలంలో ఈ గడియారాలు సన్‌డయల్ గడియారాలు (ఎండగడియారాలు), నీటి గడియారాలు, ఇసుక గడియారాలు, మైనపువత్తి గడియారాలు అని వుండేవి.



**ప్రేమ అనేది ఒకరసాయనిక చర్యలాంటిది మాత్రమే. అయితే దాని సూత్రమేమిటో కనుక్కోవడంలోనే వుంటుంది.**

14వ శతాబ్దంలో గడియారం కనిపెట్టబడింది. 1665లో గంటలు కొట్టే గడియారం కనుగొన్నారు. 1690లో గడియారంలో నిమిషాల ముల్లును ఏర్పరచారు. 1790లో రిస్టువాచ్ (చేతికి కట్టే గడియారం) స్విడ్జర్లాండు వాళ్ళు కనుగొన్నారు.

నేడు ప్రపంచంలో తయారయ్యే గడియారాల్లో 40 % గడియారాలు స్విడ్జర్లాండులోనే తయారవుతున్నాయి. ఇక్కడే అగ్గిపుల్లలంత గడియారాలు కూడా తయారవుతున్నాయి. జపాన్‌లో రింగులాంటి ఆకారంలో టైమ్ చెప్పే గడియారాలు తయారు చేసారు. వీటిని చెవులకు వేసుకుంటారు. చేయితో తట్టగానే అవి టైమ్ చెపుతాయి.

మొట్టమొదట గడియారాలలో హెయిర్ స్ప్రింగ్ ను పంది వెంట్రుకలతో తయారు చేసినట్టు పరిశోధనలో తేలింది. ఇప్పుడు సెంకండులో 10 లక్షల వంతు సమయం చెప్పే గడియారాలు కూడా తయారవుతున్నాయి. ప్రపంచంలో పెద్ద గడియారం బిగ్‌బెన్‌ను 1856తో బ్రిటిష్ పార్లమెంట్ భవనం పైన ఏర్పరచారు. దాని భాగాలు తీసుకెళ్లడానికి ఆనాడు డజన్ల కొద్ది గుర్రపు బండ్లు పనిచేయాల్సి వచ్చిందట.

జర్మన్ జి.డి.ఆర్. అనే శాస్త్రవేత్త ప్రపంచంలోని అన్ని దేశాల సమయాలను తెలిపే గడియారాన్ని తయారు చేశాడు.

## అచ్చుయంత్రం

విద్యాభ్యాసానికి, విజ్ఞానానికి పుస్తకాలు ఎంతగానో సహకరిస్తున్నట్లు మనకు తెలుసు. పుస్తకాలలో కనిపించే అక్షరాల ముద్రణ గురించి ఒక్కసారి ఆలోచిస్తే, మనకు 'గూటెన్ బర్గ్' జ్ఞాపకానికి వస్తాడు. ఎందుకంటే జర్మనీకి చెందిన ఇతడు 1456లో అచ్చుయంత్రాన్ని కనుగొన్నాడు.

మొదట తాటిఆకులపైన ఇనుప గంటములతో ముఖ్య విషయాలను వ్రాసి భద్రపరిచేవారు. బట్టలపై పక్షి ఈకలతో లేఖలు వ్రాసేవారు. కానీ, ఒకేవిషయంలో అనేక ప్రతులు కావాల్సివచ్చినప్పుడు ఎంతో ఇబ్బంది ఎదురయ్యేది. అందుకే నాలి సారి 9వ శతాబ్దంలో చైనాలో చెక్కతో చేసిన అక్షరాలపైన సిరాపూసి కాగితం, లేదా బట్టను అదిమి అక్షరాలను ముద్రించేవారు. ఆ తరువాత 'గూటెన్ బర్గ్' లోహంతో తయారు చేసిన అక్షరాలు ఒక చట్రంలో బిగించి దానిపై సిరా పూసి కాగితాలను

ఆదిమి అక్షరాలను ముద్రించాడు. ఈ యంత్రాన్ని చేతితో తిప్పేవారు. ఆవిధంగా 5 సంవత్సరాలు శ్రమించి 96 బైబిల్ ప్రతులు ప్రింట్ చేసినట్లు చరిత్రలో వెల్లడైంది. ఆ తరువాత 1810లో ఆవిరి యంత్రంతో అచ్చుయంత్రం పనిచేసే టట్లుగా రూపొందించారు. ఇప్పుడు విద్యుత్తుతో అచ్చుయంత్రాల్ని నడిపిస్తున్నారు.

తెలుగులో మొదటిది వంకాయ ప్రెస్ చెన్నైలో. అచ్చైన గ్రంథం బైబిల్.

1914 'రుబెల్ ' కనుగొన్న ఆఫ్‌సెట్ ప్రింటింగ్ విధానం ఇప్పుడు అధిక ప్రాచుర్యం పొందినది. దీనిద్వారా కలర్ లో ప్రింటింగ్ చెయ్యడం ఎంతో అందంగా పేజీలను ముద్రించడం ఈనాడు మనమందరం చూస్తున్నాం.

## టెలివిజన్



చిన్నా, పెద్దా అనకుండా అన్ని తరాలవాళ్ళను, అన్ని వర్గాల వాళ్ళను విశేషంగా ఆకర్షిస్తున్న టీ.వి (దూరదర్శన్ )ని 1926లో బ్రిటన్‌కు చెందిన "బియర్డ్ " కనుగొన్నాడు. ఎన్నో వేల, లక్షల కిలో మీటర్ల దూరంలో జరిగే దృశ్యాలను మనం ఇంట్లో కూర్చొని చూస్తున్నామంటే అదంతా " బియర్డ్ " కృషి ఫలితమే.

టీ.వి. కెమరాతో తీసిన ఫిల్మ్ టీ.వి కేంద్రం నుండి ట్రాన్సుమీటరు ద్వారా ప్రసారమవుతుంది. ఇది విద్యుత్ తరంగాల రూపంలో ఉంటుంది. ఈ తరంగాలు గాలి ద్వారా మన టీవి సెట్‌లోని పరికరాల ఆకర్షణతో గ్రహించబడి వెంటనే మాటలు వినబడి దృశ్యాలు కనబడతాయి.

ఈనాడు కలర్ టీ.విలు ఎంతో వృద్ధిలోకి వచ్చాయి. అయితే మొట్ట మొదటగా కలర్ టీ.వి విధానాన్ని ప్రవేశపెట్టింది ఫ్రాన్స్. పోతే కృత్రిమ ఉపగ్రహాల ద్వారా ప్రపంచంలోని ఏ మారుమూల ప్రాంతంలో జరిగే దృశ్యాన్నైనా ప్రపంచ ప్రజలంతా చూడగలిగే స్థితికి టీ.వి ఎదిగింది. దీనినే మనం స్టార్ టీ.వి అంటున్నాం.

అంతేకాదు అతి చిన్న సైజు టీ.వీలు కూడా తయారు చేయబడ్డాయి. జేబులో పట్టే చిన్న టీవీని అమెరికా శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఇది నాలుగు అంగుళాల పొడవుండి రెండంగుళాల వెడల్పుతో ఉంటుంది. పోతే చేతి గడియారాలలో కూడా టీ.వీ.నిఅమర్చి జపాన్ వారు రికార్డు సృష్టించారు. ఈవిధంగా టీ.వి అత్యాధునిక రూపాన్ని సంతరించుకొన్నది.

# రేడియో (ఆకాశవాణి)



ధనిక, పేద తేడా లేకుండా గృహంలోనూ, గుడిశెలోనూ ఆనందంగా గీతాలను వినిపించే రేడియో మనందరికీ తెలుసు. ఏవిధమైన తీగలు లేకుండా దీని ద్వారా దూర ప్రాంతముల నుండి విషయాలన్నీ వినగలుగుతున్నాం.

ఈ రేడియోను 1895లో ఇటలీ దేశస్థుడు " మార్కోని " కనిపెట్టాడు. ప్రపంచంలో రేడియో ప్రసారాలు 1921లో ప్రారంభమైనాయి. ఆకాశవాణి కేంద్రంలో 'మైక్రోఫోను ' ముందు చేయబడిన శబ్ద తరంగాలను యంత్రాల ద్వారా విద్యుత్ తరంగాలుగా మారుస్తారు. ఈ రేడియో విద్యుత్ తరంగాలు సెకండ్‌కు 86,000 మైళ్ల దూరం ప్రయాణం చేస్తాయి. ఆవిధంగా అవి మన ఇళ్ళ లోని రేడియోల చేత గ్రహించబడి ధ్వనితరంగాలుగా మారి మనకు శబ్దాలుగా వినబడతాయి. ఇలా రేడియో పనిచేస్తుంది.

భారత దేశంలో మొదట 1924లో చెన్నైలో రేడియో క్లబ్ స్థాపించబడింది. అనంతరం అది ఆగిపోగా 1932 నుండి రేడియో ప్రసారాల కార్యక్రమాన్ని ప్రభుత్వమే నిర్వహించడం ప్రారంభించింది.

# దీపాలు



నిత్యం చీకటితో పోరాటం చేసిన మనిషికి ఒక ఆలోచనవచ్చింది. ఈచీకటిని తొలగించే వెలుగును రాత్రి పూట బంధించి పెట్టాలని . అలా నిప్పును కనుగొన్న తరవాత ఆ నిప్పునే ఎల్లప్పుడు నిలుపుకోవాలనీ అనుకున్నాడు మానవుడు. ఆ విధంగా మంటలు మండిస్తూ, ఆ మంటల కాంతిలో తన పనులు చేసుకొనేవాడు. ఆ మంటలే మానవుడి తొలిదీపాలు అయినాయి.

ఆ తరువాత రాతి ప్రమిదలు, దివిటీలు, నూనెతో వెలిగే కాగడాలు, కని పెట్టబడ్డాయి. తూర్పు తీర ప్రాచీన జాతుల వారు ఆలు చిప్పలను, లోహంతో తయారు చేసిన పాత్రలను ప్రమిదలుగా ఉపయోగించేవారు. మధ్య యుగాల్లో చెట్ల గింజల నుండి తీసిన నూనె ఉపయోగించి దీపాలు వెలి గించేవారు.

**ఒక యంత్రం యాభైమంది మామూలు మనుషులు చేసే పనిని చేయగలదు. కాని, ఒక అసాధారణ వ్యక్తి చేసే పనిని ప్రపంచంలో ఏ యంత్రమూ చేయలేదు.**

కొన్నాళ్ళకు దీపాలు అనేక పరిణామాలు చెంది వాటి స్థానంలో కొవ్వొత్తులు, గ్యాస్ దీపాలు ఈనాడు వాడుకలోకి వచ్చాయి. గ్లాస్‌తో కూడుకున్న చిమ్నీలు అమర్చిన బర్నర్ ల్యాంప్స్ దీపాలు 18వ శతాబ్దంలో వెలుగులోకి వచ్చాయి.

ఈనాడు ప్రతి నగరంలోను, పల్లెలలోను వెలిగే వీధి దీపాలు మొట్ట మొదటిసారిగా 17వ శతాబ్దంలో పారిస్ నగరంలో వెలిగించబడ్డాయి.

ప్రాచీన ఈజిప్షియన్లు, క్రీట్ దీప వాసులు మైనం, జంతు క్రొవ్వుతో దీపాలు తయారు చేసేవారు. 19వ శతాబ్దంలో కిరోసిన్ దీపాలు వాడుకలోకి వచ్చాయి. ఈ శతాబ్దంలోనే పెట్రోలు నుండి లభ్యమయ్యే " పెర్‌ఫెన్ " మైనంతో యంత్రాల ద్వారా క్రొవ్వత్తులు తయారు చేస్తున్నారు. ఈ విధంగా ఎన్నో రకాల దీపాలు నేడు మనం చూస్తున్నాం. " థామస్ ఆల్వా ఎడిసెన్ " ప్రపంచానికి బల్బ్‌ను అందించ టంతో పాత పరంపరకు తెరబడి విద్యుత్ దీపాలు విశ్వవ్యాపితమైనాయి

# ఆసనాలు - ఉపయోగాలు

ఆరోగ్యమే మహాభాగ్యం. ఆరోగ్యం శరీరంను, మనసును ప్రశాంతంగా నుంచును. శరీర సౌష్ఠవం కలుగును. దాని వలన ధర్మ, అర్థ, కామములను సాధించవచ్చును.

వ్యాయామంతోపాటు ఆసనాదులు శరీరారోగ్యమును బాగుచేయును. ఉదయం వేగుచుక్కతో లేచి కాలకృత్యముల నిర్వహించి ఎనిమిది గంటలలోగా ఆసనములు పూర్తి చేయవలెను. ఇందుకు ముందు, వెనకా మూడుగంటల వరకు ఏమీ తినకూడదు. చెమట పట్టిన పిదప అరగంటకుగాని స్నానాదికములు చేయరాదు.

ఆసనములు వేయునపుడు తొందరపడరాదు. నిదానంగా, ప్రశాంతంగా, విశాల స్థలంలో, ఆరుబయట, గాలి పుష్కలంగా ఆడుచోట, ఎగుడు దిగుడు కాని సమతల ప్రదేశమున ఆసనములు వేయవలెను. ఒకే వరుసగా ఆసనములు వేయకూడదు. మధ్యలో కొంత విశ్రాంతి అవసరం గురువు లేక, అనుభవజ్ఞుల సహాయం. సలహా తీసికొనిన మంచిది. అనారోగ్యంగా నున్నపుడు కఠినమైన ఆసనములు వేయకూడదు.

సాహసమే ఊపిరిగా సాగిపోయే ఒక్క వ్యక్తి, తనని అసంఖ్యాకంగా అనుచరులెందరో ఆదర్శప్రాయంగా అనుసరించే మహాశక్తిగా అవతరిస్తాడు.

# సూర్య నమస్కారం

అష్టాంగ్ దండ్ : ఇది నిలబడి చేసే నమస్కారం. భక్తి ముక్తి ప్రదాయిని.
క్రమం

1. చక్కగా రొమ్ము విరిచి చేతులు ప్రక్కకు ఉంచి నిలబడి శ్వాస తీసుకొనుచు, ప్రక్క చేతులను వక్షమున నమస్కార రూపమున బధించుము. మునివేళ్ళపై నిలువుము.
2. శ్వాస విడుస్తూ రెండు చేతులను ప్రక్కలనుండి పైకి, అటనుండి క్రిందికి త్రిప్పుతూ తెచ్చి, పాదాలు భూమి కానించి, ఇరుప్రక్కల అరచేతులు భూమి కానించుము.
3. శ్వాస తీసికొనుచు, కుడికాలు వెనకకు చాచి వేయుము. రొమ్ము విరిచి ముందు చూపుంచుము.
4. శ్వాస విడుస్తూ ఎడమ కాలు కుడికాలుతో సమావంగా చాచుము మోకాలు వంచక, ముందు చూస్తూ శరీరమంతా ఒక రేఖలో నిల్పుము.
5. శ్వాస పీల్చుచు, శరీరమును భూమి కానించుము. నొసలు, గవద, వక్షం, నాభి, మోకాళ్ళు, పాదముల వేళ్లు భూమికి తాకవలెను. ఇవే అష్టాంగములు,
6. శ్వాస విడుచుచు పైకి లేచి 4వ స్థాయికి రమ్ము
7. శ్వాప పీల్చుచు, 3వ స్థాయికి రమ్ము ఎడమ కాలులోనికి తీసికొనుము.
8. శ్వాస విడుచుచు 2వ స్థితికి రమ్ము.
9. శ్వాస తీసికొనుచు పైకి లేచి చక్కగా నిలువుము.

ఇదే క్రమంలో సూర్య నమస్కారములు లెక్కతో 10/15 పార్లు అనగా నమస్కారములు చేసిన చాలును.

**ఉపయోగము** = శరీరములోని అన్ని అవయవములు, కండరములు, బాగుపడును రక్తప్రసరణం బాగగును. ఏలాంటి గుండెనొప్పులు, బీపీ, డయాబిటీ జబ్బులు దరికిరావు. ఒక విధంగా సర్వరోగ నివారిణి. దీర్ఘాయువు నిచ్చును.

## పరివృత త్రికోణాసనం



క్రమం : పరివృత త్రికోణాసనం : 1. రెండు కాళ్ళ మధ్య మూరల ఎడము చేసి నిలిచి, చేతులు ప్రక్కకు చక్కగా చాచుము.

2. గాలి వదలుతూ, కుడిచేయుని, ఎడమ పాదమువైపున్న భూమిపైనుంచుము. ఎడమ చేయిపైకి చాచి పెద్ద వేలు చివరను చూడుము. మోకాళ్ళను బిగించుము.
3,4 ఇదే పద్ధతి కుడికాలి వైపు చేయుము.ఇటుల 10, 15 సార్లు చేయుము.
**ఉపయోగము :** దీనివలన తొడలు, పిక్కలు, వీపులోని కండరాలకు బలం కలుగుతుంది మెడ దృఢమౌతుంది, మెడ నొప్పిరాదు.

## ధనురాసనం (ఉష్ట్రాసన్)



క్రమం : 1. బోర్లా పడుకొని, కాళ్ళు మోకాళ్ళవద్ద వంచుము. 2. చేతులతో చీలమండలు పట్టుకొనుము. 3. కాళ్ళు వెన్నుదన్నుతూ, వక్షం విరుస్తూ, నాభిపై లెమ్ము. చూపు సూటిగా ముందు నిలుపుము. ధనుష్సు ఆకారమగును.
నాభిపై బాణం వలె ముందు వెనుకలు బాగా 10, 15 సార్లు ఆడించుము.
4 . మోకాళ్ళు వంచి 2వ స్థాయికి రమ్ము. చేతులు విడిచి బోర్లా స్థితికి రమ్ము.
**ఉపయోగం :** వెన్ను, వెన్నెముక దోషాలన్నీ దూరమగును. గూనిపోవుటకు చాలా ఉపయోగపడును. బొజ్జరాదు.

## పశ్చిమోత్థానాసనం

క్రమం : 1. కాళ్ళు రెండు చక్కగా చాచి కూర్చుని, రెండు చేతులు చాచి అరికాళ్ళను అదిమి పట్టుకొనుము.
2. చేతి పెద్ద వేళ్ళతో కాలి బొటన వ్రేళ్ళను పట్టుకొని మోచేతులు భూమికి ఆనించుము.
3. నొసలు మోకాళ్ళ మధ్య చేర్చుము. మోకాళ్ళు వంచకూడదు. ఒకటి, రెండు నిమిషములు అట్టే ఉండుము.
4. తలలేపి, 1వస్థాయికి రమ్ము. పిదప చేతులు ప్రక్కలకు భూమిని ఆనిస్తూ ఉంచుము. ఇటుల 5/6 సార్లు చేయుము.

సరైన వాడకం లేని పనిముట్లకి తుప్పు పట్టినట్లే, సక్రమంగా మనసుకైనా తుప్పు తప్పదు. — మనిషి

**ఉపయోగములు :** పొత్తి కడుపు బాగుపడుతుంది. జీర్ణశక్తి పెరుగుతుంది. మలబద్ధకముండదు. గుండె జబ్బులు రావు. చేతి, కాళ్ళ, ప్రక్కల కండరాలు శక్తివంతమౌతవి. ఊపిరితిత్తులు బాగుపడును. డయాబెటీస్‌కి మంచి మందు.

## అర్ధ మత్స్యేంద్రాసనం



**క్రమం :** 1. ఎడమ కాలు వంచి మడిమపై కూర్చుని, కుడి పాదం ఎడమవైపు భూమిపై నుంచుము.

2. కుడిచేయితో కుడికాలి బొటన్రవేలిని పట్టుకొనుము కుడి మోకాలు, కుడి చంకలో ఇముడునట్లుంచుము.

3. ఎడమ చేయి వేళ్ళను నడుం వెనుకగా కుడిప్రక్కగా డొక్కలోనికి జొప్పించుము.

4. చక్కగా రొమ్ము విరిచి ముందుకు చూస్తూ కూర్చుండుము (10 లేక 15 సెకండ్ల పాటు) ఇదే పద్ధతి కుడికాలిపై కూర్చుండి చేయుము. ఇలా 8, 10 సార్లు చేసిన చాలును.

**ఉపయోగము :** మూత్రపిండములు, నడుము, పొత్తికడుపు, కడుపు, చక్కగా పనిచేయునట్లు చేయును. తొడలు వెన్ను మరియు ప్రక్కటెముకలు గట్టిపడును. ఊపిరితిత్తులు బాగగును. - కఫము ఉండదు. రక్తపు పోటు ఉండదు.

## గోముఖాసనం



**క్రమం :** 1. ఎడమ కాలి మడమపై కూర్చుని, కుడికాలు మడిచి రెండు మోకాళ్ళు ఏకమగునట్లుంచుము. కుడిపాదం ఎడమ తొడపై ఉంచుము.

2. ఎడమ చేయి వీపు వెనకగా పెట్టి, కుడిచేయి భుజము పైనుంచి పోనిచ్చి వెన్నున ఉన్న ఎడమ చేయిని పట్టుకొనుము. రొమ్ము విరిచి చక్కగా ముందుకు చూడుము. ఒక అర నిమిషం అట్లే ఉండుము.

దురదృష్టం కోరలల్లో చిక్కుకున్నప్పుడే, మన మిత్రులు పరీక్షలకి గురవుతారు: మన అసలు శత్రువులు బయట పడతారు.

3. చేతులు విడిచి మొదటి స్థాయికి రమ్ము. ఇట్లే కుడి కాలితో మొదలుపెట్టి చేయుము. 8 లేక 10 సార్లు చేసిన చాలును.

**ఉపయోగము :** పొత్తి కడుపు, కడుపు, కాళ్ళ కండరాలు బాగు పడును. వక్షం విశాల మగును. శ్వాస మరియు జీర్ణకోశ రోగములు రావు. రక్త సంబంధమైన రోగములను దరిరానీయదు.



## సర్వాంగాసనం

**క్రమం :** 1. వెల్లకిలా పడుకొని, కాళ్ళు చేతులు చక్కగా చాచుము.

2. రెండు కాళ్ళు చక్కగా పైకి లేపుము. నడుమును లేపుచు అరచేతులతో నడుమువదిమి పట్టుము. మోచేతులు భూమికి ఆనించుము. మోకాళ్ళు వంచరాదు. మెడలేపరాదు. పూర్తి భారం భుజాలపై మోచేతులపై నిలుపుము. పాదాలు చక్కగా పైకి చాచి బొటనవేళ్ళపై చూపు నిలుపుము. 10, 20 సెకన్లు నిల్పుము.

3. వెన్ను మెడలు లేపకుండ, నడుమును భూమి కానించుము.

4. కాళ్ళు చాచి నడుం నుండి క్రిందికి భూమి కానించుము. మోకాళ్ళు వంచరాదు. ఇలా 10, 16 సార్లు చేయుము. ఇది ఒక పాదంతోనూ చేయవచ్చును.

**ఉపయోగం :** పాదాలు బలిష్ఠమౌతాయి గుండె, శ్వాసకోశాలు బాగుపడును. రక్తప్రసరణ వృద్ధి చెందును. బి.పి రాదు. మెడ బాగుపడును. మెడనొప్పి రాదు. మెదడుకు చక్కగా రక్తప్రసారం జరుగును. శరీరమంతటికి ఉపయోగపడును.

## హలాసనం



**క్రమం :** 1-4 మొదట సర్వాంగాసనం వేయుము. 5 పాదముల వ్రేళ్లు నెత్తి వెనక భాగమున భూమికి ఆనించుము. అరచేతులు భూమి కాన్చుము. అటులనే 10, 15 సెకండ్లు ఉంచుము. పిదప క్రమంగా సర్వాంగాసనంలో 1వ స్థితికి రమ్ము.

అసలు తప్పులే చేయని మనిషి, తన ఎన్నెన్నో అద్భుత విషయాలు
నేర్చుకునే లేనివాడవుతాడు.

ఇది రెండు పాదాలతో, మార్చి మార్చి ఒక్కొక పాదంతోనూ చేయవచ్చును. 5,6 సార్లు చేసిన చాలు.

**ఉపయోగం :** సర్వాంగాసనం ఫలితాలతో పాటు జీర్ణ కోశ సంబంధి రోగాలను రానీయదు. గుండె జబ్బు రానీయదు. మూత్రపిండాల రోగాలూ నయమగును.

## భుజంగాసనం



క్రమం : 1. బోర్లా పడుకొని, గవద భూమికాన్చుము.

2. రెండు చేతులు రెండు ప్రక్కల వక్షం వద్ద ఉంచుము.

3. మోకాళ్ళు, కాలివేళ్ళతో భూమినదిమి పట్టి నాభిపై లేస్తూ వక్షం విరిచి ముందుకు సాగుము.

4. మెడ 10 సెకండ్లపాటు వెనక్కు వంచి పైకి చూడుము.

5. మెడ చక్కజేసి, వక్షము భూమి కాన్చుము.

6. బోర్లా స్థితికి రమ్ము. ఇట్లు 8, 10 సార్లు చేయుము.

**ఉపయోగం :** వెన్ను, మెడనొప్పి (స్పాండలోసిస్) ఉండదు. ఛాతీ పెరుగుతుంది. గట్టి పడుతుంది.

## శలభాసనం



క్రమం : 1. బోర్లా పడుకుని, గవద, నోసలు భూమికి కాన్చుము.

2. చేతులు పిడికిలి బిగించి గట్టిగా చాచి మట్టలతో భూమిని తాకించుము.

3. రెండు కాళ్ళను నడుం నుండి మోకాళ్ళు వంచకుండ వీలైనంత పైకెత్తుము. 10సెకండ్లుంచుము.

4. కాళ్ళు భూమి కానించి, పిడికిళ్ళు విడువుము.

ఇది విడివిడిగా ఒక కాలితో లేదా రెండు కాళ్ళొకేసారిగానూ చేయవచ్చు. 10 సార్లు చేసిన చాలును.

ఉపయోగం : నడుం, తొడలు, కాళ్ళు బలపడతాయి. నడుం నొప్పి రాదు. పొత్తి కడుపు బాగుపడుతుంది.

## మయూరాసన్



క్రమం : 1. మోకాళ్ళు వంచి మోకాళ్ళపై కూర్చుండుము.

2. రెండు చేతులు వెనుకకు వేళ్ళు త్రిప్పి భూమికానించుము.

3. మోచేతులపై పొట్టనుంచి కాళ్ళు వెనకకు చాచుము.

4. వక్షమును ముందుకు చాచి లేపుచు, వెనకకాళ్ళు లేపుచు పూర్తి బరువు మోచేతులపై వేసి ఉంచుము. అట్లు ఒక పది సెకన్లు ఉండుము. ముందుకు చూడుము.

5. కాళ్ళు క్రిందికి దించి, మోచేతులపై నుండి బరువు తొలగించుము.

6. యథా స్థితికి వచ్చి మోకాళ్ళపై కూర్చొనుము. ఇదొక 12సార్లు చేసిన చాలును.

ఉపయోగం : కడుపునకు సంబంధించిన రోగములు రావు. పిక్కలు గట్టి పడును. మెడలు, రొమ్ము బలపడును

## ఊర్ధ్వ ధనురాసనం



క్రమం : 1. వెల్లకిలా పడుకుని చేతులు వెనుకనుంచి భుజాలు క్రిందికి తెచ్చి, వేళ్ళు లోపలికి త్రిప్పి అరచేతులు భూమిపైనుంచుము.

2. పాదాలను వెనుకకు లాగి, నడుము బాణంలా వంచుము. మెడ వంచి భూమిని చూడుము. బొజ్జపైకి లేపుము. ఇట్లు 10 సెకన్లుండుము.

3. మెడ, కాళ్ళు చాచి 1వస్థితికి రమ్ము

4. చక్కగా వెల్లకిలా పరుండుము. ఇది 5.6 సార్లు చేసిన చాలును.

భవిష్యత్తు తల్లుల మీద ఆధారపడి వుంది. చెదిరిపోయే సమాజాన్ని రక్షించడం తల్లులకే సాధ్యం.

ఉపయోగం : నడుము నొప్పిరాదు. బొజ్జ పెరగదు. వెన్ను బాగుపడును. తొడలు, నడుం బలపడును. శ్వాస రోగములు, ఉదరరోగములు రావు. నడుంలో జవుకు, సున్నితత్వం వచ్చును. ఆడవాళ్ళకు సౌష్ఠవ వృద్ధి చేయును. ఆకారం పోతపోసినట్లగును.



## శీర్షాసనం

క్రమం : 1. మోకాళ్ళపై కూర్చుని, చేతులు రెండొక్కచో కలిపి నిలిపి ముందుంచి కపాలమానించుము.

2. మోకాళ్ళు చక్కజేసి నడుం లేపుము. నడుం మెడ చక్కగా ఉండునట్లు చేయుము.

3. మెల్లగా మెడపైకి, శిరసుపైకి భారమును మార్చుతూ కాళ్ళను వెనుక నుండి పైకి లేపుము. నడుం, మోకాళ్ళు గట్టి పరుచుము. ఉచ్ఛ్వాసం, నిశ్వాసం యథారీతి జరుపుము. ఒక 15 సెకండ్లు నిలుపుము.

4. మెల్లగా పాదాలు భూమికానించుము.

5. మోకాళ్ళు భూమి కాన్చి తలపైకి లేపుము. ఇట్లు 5, 6 సార్లు చేసిన చాలును.

**ఉపయోగం :** రక్త ప్రసరణం చక్కనై హృదయం బలపడును. రక్తపు పోటు రాదు. కాని ముసలివారు, రక్తపు పోటున్నవారు ఇది చేయకూడదు. మెడ వెన్ను, నడుం, తొడలు, పిక్కలు బలపడును. సర్వాంగములను చక్కబరుచును. ఇందు ఉపాసవ పద్ధతి సాధారణులు చేయకూడదు.



## పద్మాసనం

**క్రమం :** 1. చక్కగా కుదురుగా కూర్చుని, కుడిపాదము ఎత్తి మోకాలు వద్ద వంచి ఎడమ తొడపైనుంచుము. 2. ఎడమ కాలి పాదమును కుడితొడపై నుంచుము. 3. మోకాళ్ళను భూమి కానించి వక్షమును విరిచి, వెన్ను చక్కజేసి, చేతులు చక్కజేసి రెండు అరచేతి మట్టలను రెండు మోకాళ్ళపై నుంచి బొటన వ్రేలితో చూపుడు వేలు మడిచిపట్టి, మిగిలిన వేళ్ళను చక్కగా చాచుము. ఊపిరి దీర్ఘంగా తీసి విడువుము. ఇట్లొక 30 సెకన్లుండుము. 5. పాదములు తీసి పీఠంవేసి కూర్చుండుము. ఇట్లే ఎడమ పాదంతో ఆరంభించి చేయుము. ఇట్లు 5. 10 నిమిషములు చేసిన చాలును.

**ఉపయోగం :** నడుం, కడుపు, ఊపిరితిత్తులు, హృదయ సంబంధ రోగములు రావు. ప్రశాంతత కలుగును. తొడలు, పిక్కలు బలిష్ఠమగును. ఇందు ఉపాసవ పద్ధతి సాధారణులు చేయకూడదు.

# శవాసనం (అచేతనాసనం)



క్రమం : 1. వెల్లకిలా పడుకుని, తలను ఎడమకు త్రిప్పి, కాళ్ళు చేతులు చాచుము.

2. అన్ని అంగములను క్రమంగా సడలించుము కాళ్ళు, చేతులు పూర్తిగా ఒదులు కావలెను. క్రమంగా శరీరమంతా తేలికైపోవును. శవంలా మారును. అట్లు ఒకటి రెండు నిమిషాలుండుము. నిద్ర వచ్చిన ఫరవాలేదు. గాలిని నిదానంగా మెల్లగా పీల్చుము.

3. క్రమంగా అన్ని అంగాలను సంధించుము.

4. కుడికి తిరిగి లేచి కూర్చుండుము. హఠాత్తుగా లేవకూడదు. పిదప లేచి ఇటునటు నడువుము.

**ఉపయోగం :** శరీరం మొత్తంగా తేలికపడి నిరోగియగును. బడలిక ఉండదు. ఒళ్ళు చురుకుగా పనిచేయును. మెదడుకు ప్రశాంతి కలుగును. ఇవియేగాక ఏకపాదగోముఖాసనం, సింహాసనం, వృశ్చికాసనం, అర్ధనాననాసనం అని ఎంకెన్నో ఆసనములున్నవి. సాధారణ ఆరోగ్యము పొందుటకు, చురుకుగా నుండుటకు సులభమైన ఏ నాలుగైదు ఆసనములైనా చాలును. ఒక్క సూర్య నమస్కారం వేయి ఆసనములపెట్టు.

ఆత్ర పడక, నిదానంగా, క్రమంగా, సంపూర్ణంగా ఆసన నియమాలు పాటించినచో నిరోగియై చక్కని సార్థక జీవనము గడపవచ్చును.

# పిల్లలు - జాగ్రత్తలు

సాధారణంగా పిల్లలు పాకే వయస్సు నుంచే వివిధ రకాల వస్తువులతో ఆడుకోవడానికి ఇష్టపడుతుంటారు. పెద్దవాళ్ళు కూడా తొందర వల్లనో, పనివత్తిడి వల్లనో, పిల్లలను ఓదార్చే ఓపిక లేకనో, పెన్నులు, పెన్సిళ్లు, చెంచాలు వాళ్ళముందు పడవేసి వెళ్ళుతుంటారు. పిల్లలు వాటితో ఆడుతూ నోట్లో పెట్టుకుంటూ చేతులతో అటు, ఇటూ ఊపుతూ తమకు తెలియకుండానే తమ ఒంటి మీద గాయాలు చేసుకుంటారు. పెన్సిల్లు, ఇనుప చువ్వలు మొదలైనవి కళ్ళల్లో గ్రుచ్చుకుంటూ వుంటాయి. కాబట్టి చిన్న పిల్లలకు పొడవాటి వస్తువులను గోలికాయలను, పైసలను, గుచ్చుకునే, కోసుకునే వస్తువులను ఆడుకోవడానికి ఇవ్వకూడదు.

పిల్లలు నిరంతరం కదులుతూ ఉంటారు. కళ్ళకు కనిపించిన ప్రతి వస్తువును తరచి, తరచి చూస్తుంటారు. ఆ విధంగా నేల మీద పడేసిన గాజు వస్తువుల్ని కూడా

పట్టుకుని ఆడుతారు. అవి వారి చేతులల్లో పగిలి గాయాలయ్యే ప్రమాదం వుంది. పోతే కుర్చీలు, బల్లలు, గోడలు పట్టుకొని నడిచే వయస్సు గల పిల్లలు తప్పట డుగులు వేస్తూ బల్లలపైన, టేబుల్ పైన, క్రిందికి వ్రేలాడే పేపర్లు, టేబుల్ క్లాత్‌లు తదితర వస్తువులను పట్టి లాగుతుంటారు. అటువంటప్పుడు వాటిపైన వుండే ఇనుప వస్తువులు గాని, గాజు వస్తువులుగాని పిల్లల తలలపై పడే ప్రమాదం వుంది. కాబట్టి పిల్లల్ని గదులల్లో ఒంటరిగా వదలరాదు.

**వంటగదిలో ఇంటి ప్రమాదాలు :**

ఇళ్ళల్లో ఆడవాళ్లు వంటగదిలో కూర్చుని కూరగాయలు తరుగుతూ పిల్లలకు పాలు ఇస్తూ వుంటారు. ఇంట్లోకి ఎవరైనా వచ్చినా, ఎవరైనా పిలిచినా గబుక్కున పిలల్ని దించి బయటకు వెళ్ళుతుంటారు. ఈ లోపల పాదరసంలాగ పాకే ఆ పిల్లవాడు ఎదురుగా ఉన్న కత్తి పీటను గాని, ఎర్రగా మండుతున్న పొయ్యిలోని కట్టెల్ని గాని, స్టౌవ్‌ని గాని పట్టుకొని లాగిగాని అపాయం పాలవుతాడు. అపాయాన్ని సృష్టిస్తాడు. కాబట్టి ఎంత పనిఒత్తిడిలో వున్నా పిల్లల్ని ఒంటరిగా వదిలి వెళ్ళరాదు. బజార్లలో చిన్న పిల్లలకు అప్పజెప్పి ఆడించమనటం కాదుగాని కొంత మంది చిన్న పిల్లల్ని పైకి ఎగిరేసి అందుకుంటుంటారు. కొందరు పిల్లల్ని చేతులు పట్టి పైకి లేపి చుట్టూ గిర గిరా తిప్పడంగాని తలపై కూర్చొపెట్టుకొని పైన ఫ్యాన్‌లు తిరుగుతున్నా గమనించకుండా ఇళ్ళల్లో అటు, ఇటూ తిరుగుతూ వుంటారు. ఇవన్నీ ఏ మాత్రం సహించరాని పనులు. కొందరు ఆడవాళ్ళు, మగవాళ్ళు కూడా చిన్న పిల్లల పెదవులపైన మరీ ఎక్కువగా ముద్దులు పెట్టుకుంటూ వుంటారు. అలా ఎప్పుడూ చేయకూడదు. చిన్న పిల్లలు అప్పుడప్పుడే వికసిస్తున్న పువ్వుల్లాంటి వారు. కలుషితమైన మన నోళ్ళతో వాళ్ళని హింసించకూడదు.

**లేనిపోని భయాలు :**

పిల్లలు నేల మీద పడిపోయి ఏడుస్తున్నప్పుడు వాళ్ళను ఓదార్చడానికి నేలను కొట్టడం, కుర్చీలను, బల్లలను తిట్టడం, అదిగో బూచి, ఇదిగో దయ్యం, పిల్లి, అంటూ వాళ్ళకు లేనిపోని భయాలను, నిర్జీవులైన వాటికి ప్రాణం వుందన్న అపోహను కలిగిస్తూ ముఖ్యంగా తనను బాధకు గురిచేసిన వాటిని తిరిగి కొట్టాలన్న ఆలోచన కల్పించడం మంచిది కాదు. పిల్లలు అనుకరిస్తూ, మనల్ని అనుసరిస్తూ వుంటారు. కాబట్టి వాళ్ళ ఎదుట జాగ్రత్తగా మెదలుకోవాల్సిన అవసరం ఉంది. వాళ్ళకు లేనిపోని భయాలు పెట్టకూడదు.

**తరగతి గదిలో ప్రమాదాలు :**

3 నుంచి 5, 6 ఏళ్ళ వయస్సుగల పిల్లలు పాఠశాలకు వెళుతుంటారు. వాళ్ళు

ఉపయోగించే చిన్న చిన్న బలపాలు, రబ్బరు ముక్కలు, చెవుల్లోను, ముక్కుల్లోను పెట్టుకుంటూ ఉంటారు. అప్పుడు పెద్దవారు కంగారు పడుతూ, పిల్లల్ని కంగారు పెట్టకూడదు. వీలైతే మనము తియ్యాలి లేదా డాక్టరు వద్దకు తీసుకు వెళ్ళాలి. అంతేగాని కొట్టడం, తిట్టడం లాంటివి చేయకూడదు. ఇంట్లో ఈ విధమైన ప్రమాదాలకు సంబంధించిన అవగాహనను ముందే కలిగించాలి. పెద్దలు పిల్లలతో స్నేహితులుగా మెదులుకుంటే వారికి చాలా మంచి అలవాట్లు అలవడతాయి.

**పిల్లలకు సూచనలు :**

పిల్లలూ ! మీరు కూడా అపరిచితులు ఇచ్చిన వస్తువులుగాని, పదార్థాలుగాని, తీసుకోకూడదు. దారి పక్కన పడివున్న ఎలాంటి వస్తువుల్ని గాని వెంట తెచ్చుకో కూడదు. అప్పుడప్పుడూ అవి పేలుతుంటాయి. పరిచయంలేని వాళ్ళు రమ్మని పిలిచినా, ఏదైనా ఇబ్బంది కలిగించినా వెంటనే స్కూలు టీచర్‌కు చెప్పాలి. రోడ్డు దాటేటప్పుడు, ఇష్టం వచ్చినట్లు పరుగెత్తకుండా, వీలైతే గుంపుగా లేదా ఒకరుగానే వచ్చిపోయే వాహనాలు గమనిస్తూ జాగ్రత్తగా దాటాలి. మరీ ఇబ్బందిగా ఉంటే ఎవరినైనా దాటించమని సహాయం తీసుకోవాలి. పట్టణాలు, తదితర ప్రాంతాలలో తప్పిపోయినప్పుడు, భయపడుతూ ఏడుస్తూ రోడ్ల వెంట తిరగకుండా దగ్గరలోవున్న ట్రాఫిక్ పోలీస్‌కు గాని, పోలీస్ స్టేషన్‌కు గాని వెళ్ళి, మీ పేరు, మీనాన్న పేరు, ఉండే ప్రదేశం భయపడకుండా చెప్పి ఇళ్ళకు చేరుకోవాలి. రోడ్ల వెంబడి వరుసలో నడవాలి. గుంపుగా, రోడ్డు కడ్డంగా దడిగా నడువరాదు.

**భోజనం వేళల్లో :**

భోజనం నిదానంగా చేయాలి. ఆదరా బాదరా నమలకుండా తినరాదు. అవసరమైనంతగానే వడ్డించుకోవాలి. అన్నం పారవేయకూడదు.

ఇళ్ళల్లో అనేక కార్యక్రమాల్లో భోజనాలు చేసిన తరువాత చేతులు కడుక్కొని దులుపుతూ వుంటారు. అప్పుడు చేతికున్న నీళ్ళు పక్కనున్న వారి ప్లేట్లల్లోను కళ్ళల్లోనూ పడే అవకాశం ఉంది. కాబట్టి చేతుల్ని దులపకూడదు. వెంటనే కర్చీఫ్‌తోను, టవల్‌తోను తుడుచుకోవాలి. అంతేగాని, ఇంట్లో గుమ్మాలకు వ్రేలాడే పరదాలకు, దుప్పట్లకు, ఒంటిమీద ఉండే డ్రస్సులకు, చేతుల్ని మూతుల్ని తుడువకూడదు.

**సెలవు దినాలల్లో :**

సాయంత్రాలు, సెలవుదినాలు టీవి చూసేటప్పుడు, మరీ దగ్గరగా ఉండి చూడకూడదు. కనీసం పది అడుగులు దూరం ఉండాలి. పడుకొని కూడా టీ.వి చూడరాదు. రాత్రిల్లో లైటు వేసికొని టీ.వి చూడాలి. టీ.వీ చూసేటప్పుడు, మరీ తీక్షణంగా చూడకుండా వీలైనన్ని సార్లు కంటి రెప్పలు కొడుతూ, అప్పుడప్పుడూ పక్కలకు చూస్తూ టి.వీ చూడాలి. దినమంతా టి.వీని అంటిపెట్టుకొని ఉండక

ముఖ్యమైన కార్యక్రమాలు మాత్రమే చూస్తే మంచిది. సమయం కూడా విలువైనదే కదా ! కొంతమంది పిల్లలు టీ.వీ చూస్తూ నోట్సు రాస్తూవుంటారు. అది మంచి పద్ధతి కాదు. హోంవర్కు పూర్తిచేసిన తరువాతే చూసే కార్యక్రమం ప్రారంభించాలి. రోజుకు రెండు లేదా మూడు గంటలు మించి టి.వీ చూడడం మంచిది కాదు. చదువుకొనే సమయంలో ఆటలాడుతూ పక్కవాళ్ళతో తగాదా పడుతూ చదువడం రాయడం చేయకూడదు. ఏ రోజు హోం వర్కు ఆ రోజే పూర్తిచేసుకోవాలి. వ్రాత పని ముగిసిన తరువాత పుస్తకాలు, పెన్నులు వగైరా తమ తమ వస్తువుల్ని చక్కగా సర్దిపెట్టుకోవాలి. క్లాస్ పుస్తకాలతోపాటు, ఇతర మంచి కథల పుస్తకాలు, పెద్దవాళ్ళ జీవిత చరిత్రలు చదువడం, అమ్మ, నాన్న, నానమ్మ, తాతయ్యలని అడిగి తెలుసుకోవాలి. తరగతి గదిలో ఎప్పుడు కూడా సిగ్గుపడకుండా భయపడకుండా ఉండాలి. తెలియని విషయాల్ని టీచర్స్‌ని అడిగి తెలుసుకోవాలి. పాఠం అర్థం కానప్పుడు తిరగి చెప్పించుకోవాలి. అవసరమైతే తోటి మిత్రులను కూడా అడగి తెలుసుకోవడం మంచిది. లెక్కలు, తదితర క్లాస్ వర్క్, హోంవర్క్ సొంతంగా చేయడం మంచి అలవాటు. కాపీ చేయటం తప్పు.

**ఇంట్లో :**

మన ఇళ్ళల్లోకి నాన్నను గూర్చి, అమ్మను గూర్చి ఎవరైనా పెద్దవాళ్ళు వచ్చినప్పుడు వారిని లోనికి ఆహ్వానించి, కూర్చోమని విషయం తెలుసుకోవాలి. మర్యాదగా సంభాషించాలి. అలాగే ఎవరైనా ఫోన్ చేసినా నిర్లక్ష్యంగా సమధానం చెప్పకుండా చక్కగా మాట్లాడాలి.

ఇంట్లోని గడియారాలు, రేడియోలు, టీ.వీలు ఆగిపోయినప్పుడు వాటిని విప్పి రిపేరు చేయడానికి సాహసించకూడదు. కరెంట్ విషయంలో ముఖ్యంగా ఏ పనీ సొంతంగా చేయకూడదు. తగిన వారితోనే రిపేర్లు చేయించాలి.

మనం అందరం కూడా మన తలల్లో ఉండే మెదడు ద్వారా ప్రతి పనిచేయగలుగుతున్నాం. అందరూ తెలివితేటలు కలవారే, తెలివి తక్కువ వాళ్ళు, తెలివి లేని వాళ్ళు అంటూ ఎవరూ ఉండరు. నిరంతరం చదువుతూ నిత్యం కొత్త కొత్త విషయాలు తెలుసుకుంటూ, జ్ఞాపకంలో వుంచుకుంటూ మెదడుకు ఎంత ఎక్కువగా పని చెప్పితే అంత గొప్పవాళ్ళుగా మనం తయారవుతాం. ప్రపంచంలోని మేధావులందరూ చిన్నప్పుడు తమ మెదళ్ళకు ఎక్కువగా పనిచెపుతూ కష్టపడి పైకి వచ్చినవాళ్ళే.

## వృద్ధాప్యాన్ని జయించడమెలా ?

ముసలితనం అనేది తప్పకుండా వచ్చే చుట్టం లాంటిది. "(అతిథి దేవోభవ) వచ్చే ముసలితనాన్ని అసహ్యించుకోవడం మంచిది కాదు. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం అనేవి సూర్యుడికి తప్పవు. చెట్టు మొగ్గతొడగడం, కాయడం, పండుగా మారడం,

రాలిపోవడం మనం చూస్తూనే వుంటాం. అలాగే మనిషికి పసితనం, బాల్యం, యౌవనం, వృద్ధాప్యం ఇవి తప్పని పరిణామాలు. అయితే, ముసలితనం బాధాకరమే. అలా ఊహించుకుంటే భయంకలిగించేదే. కాని మనల్ని మనం ఒక క్రమరూపానికి మలుచుకుంటే ఆనందంగా వృద్ధాప్యాన్ని ఆహ్వానించవచ్చు, అనుభవించవచ్చు. 'అయ్యో నేను ముసలివాడినయ్యానే ' అనుకోవడంలోనే సగం ముసలితనపు వైకల్యం వస్తుంది. 'వృద్ధాప్యం ఒక సహజమైన శారీరక మార్పు ' అనుకొంటే సగం ముసలితనాన్ని జయించినట్టవుతుంది.'మారిన శరీర పరిస్థితులకు అనుకూలంగా మన దైనందిన కార్య క్రమాలను ఇలా ఏర్పరచుకోవాలి' .

1) తప్పనిసరి నడక
2) తగిన విశ్రాంతి
3) తలకు మించిన లేక అనవసరంగా ఆలోచన చేయకపోడం,
4) ఎదుగుతున్న పిల్లల పెద్దరికాన్ని, మనస్ఫూర్తిగా గుర్తించి అంగీకరించి మెదులుకోవడం.
5) తమ అధికారాన్ని స్వచ్ఛందంగా వదులుకోవడం.
6) పిల్లలతో తమ అనుభవాల్ని పంచుకోవడం.
7) గ్రంథాలయాల్లో, ఆలయాలలోనూ కొంత సమయం గడపడం.
8) సృజనాత్మక కార్యక్రమాలు చేపట్టడం.
9) సమాజసేవా కార్యక్రమాలలో శరీరం సహకరించినంతమేరకు పాలుపంచుకోవడం.
10) క్రమం తప్పకుండా ఆరోగ్య పరీక్షలు చేయించుకోవడం.
11) ఆరోగ్య వాతావరణంలో ఆలోచనలు కొనసాగించడం.
12) తన భార్యతో గత జీవిత సుమధుర జ్ఞాపకాల్ని పంచుకోవడం.
13) మనుమలు, మనుమరాళ్ళకు తన జీవితంలోని అనుభవాలద్వారా తెల్సుకున్న విషయాలను, విజయాలను తెలుపడం.
14) తమ బాల్య మిత్రులను కలుసుకోవడం.
15) ఉద్రేకాలకు, ఉద్వేగాలకు, నిరాశలకు లోనుగాకపోవడం. చెదరని మానసిక స్థితిని అలవరచుకోవడం.
16) ఏకాగ్రత, మౌనం, ధ్యానం మొదలైన ఆచరణలతో సమస్థితి సాధించడం.

ప్రైవసీ పాటిస్తూ ఉండాలి. అయితే మనస్సును నిత్యనూతనంగా ఉంచుకోవడమొక్కటే వృద్ధాప్యాన్ని జయించే అహింసాత్మకమైన ఆయుధం.

# ఆంధ్రప్రదేశ్ - జిల్లాలు - వివరాలు

**అనంతపురం :** **వైశాల్యం :** 19,130 చ. కి.మీ.
**నదులు :** పెన్నా, చిత్రావతి, వేదవతి.
**పంటలు :** కొర్రలు, జొన్న, వరి, రాగులు, ఉలవలు, కందులు, వేరుశనగ, నువ్వులు, ప్రత్తి, చెఱుకు, నీరుల్లి.
**మండలములు. 59:** ఆత్మకూరు, అనంతపురం, రాప్తాడు, గార్లదిన్నె, కూడేరు, సింగన మల, బుక్కరాయ సముద్రం, నార్పల, తాడిపత్రి, యాడికి, పుట్లూరు, పెద్దవడుగూరు, ఉరవకొండ, వజ్రకరూరు, విడపనకల్లు, ధర్మవరం, తాడిమర్రి, బాతలపల్లి, చెన్నేకొత్తపల్లి, కనగానపల్లి, రామగిరి, కల్యాణదుర్గం, బెళగుప్ప, కంబదూరు, కుందుర్పి, బ్రహ్మసముద్రం, పెట్టూరు, రాయ దుర్గం, బి. హరెహల్లి, గుమ్మగట్ట, కణేకల్లు, బొమ్మనకల్లు, పెనుకొండ, సోమందిపల్లి, రొద్దం, పుట్టపర్తి, కొత్త చెరువు, బుక్కపట్నం, మడకశిర, అమరాపురం, గుడిబండ, రొళ్ళ, అగలి, హిందూపురం, పరిగి, లేపాక్షి, గోరంట్ల, చిలమత్తూరు, కదిరి, ముదిగుబ్బ, వల్లమడ, నంబులిపులికుంట, తలుపుల, నల్లచెరువు, ఓబుల, దేవర చెరువు, తనకల్లు, ఆమడగూరు, గాండ్లపెంట.

**కడప:** వైశాల్యం 15, 359 చ. కి.మీ. **నదులు :** పెన్న, పాపఘ్ని, సగిలేరు, కుందు, చెయ్యేరు, చిత్రావతి. **పంటలు :** జొన్న, వరి, సజ్జ, కొర్రలు, ఉలవలు, వేరుశనగ, నీరుల్లి, పసుపు, ప్రత్తి, మిరప, నువ్వులు. **మండలములు** 50 . కడప, చెన్నూరు, ఖాజీపేట, వల్లూరు, పెండ్లిమర్రి, చింతకొమ్మదిన్నె, రాయచోటి, చిన్నమండెయం, సుండుపల్లి, సంబేపల్లి, వీరబల్లి, లక్కిరెడ్డిపల్లి, చక్రాయపేట, గాలివీడు, రామాపురం, కమలాపురం, ఎర్రగుంట్ల వీరపునాయునిపల్లి, కోడూరు, చిట్వేలు, ఓబులవారిపల్లి, పుల్లంపేట, రాజంపేట, నందలూరు, పెనగలూరు, సిద్దవటం, ఒంటిమిట్ట, అట్లూరు, బద్వేలు, గోపవరం, పోరుమామిళ్ళ, కలసపాడు, బి. కోడూరు, బ్రహ్మంగారిమఠం, జమ్మలమడుగు, ముద్దనూరు, కొండాపురం, పులివెందల, సింహాద్రిపురం, లింగాల,

ఆశావాదికి ప్రతిచోటా ఆకుపచ్చ దీపం కనిపిస్తుంటుంది. మరి, నిరాశావాదికేమో ఎక్కడ చూసినా ఎర్ర దీపమే ఎదురవుతుంటుంది.

తొండూరు, వేంపల్లి, వేముల, ప్రొద్దుటూరు, రాజుపాలెం, చాపాడు. యస్. మైదుకూరు, దువ్వూరు, పెద్ద ముడియం, మైలవరం.

కర్నూలు : **వైశాల్యం** 12,658 చ. కీ.మీ. **నదులు :** తుంగభద్ర, కృష్ణా, హంద్రి, కుందు, భవనాశి, హగరి. **పంటలు:** జొన్న, సజ్జ, కొర్రలు, వరి ఉలవలు, కందులు, వేరుశనగ, ప్రత్తి, మిరప, వాము, రాగులు. **మండలములు :** 54. కర్నూలు, నంద్యాల, మహానంది (తిమ్మాపురం), బండి ఆత్మకూరు, పాణ్యం, గడివేముల, ఆళ్లగడ్డ, రుద్రవరం, సిరివెళ్ళ, చాగలమర్రి, గోస్పాడు, కోయిలకుంట్ల, దొర్నిపాడు, ఉయ్యాలవాడ, సంజామల, కొలిమిగుండ్ల బనగానిపల్లి, ఔకు, ఆత్మకూరు, వెలుగోడు, పాములపాడు, కొత్తపల్లి, శ్రీశైలం (సుందిపెంట,) నందికొట్కూరు, మిడుతూరు, పగిడాల, జూపాడుబంగ్లా, గూడూరు, కోడుమూరు, సి. బెలగల్లు, ద్రోణాచలం, బేతంచెర్ల, వెల్దుర్తి, కృష్ణగిరి, ప్యాపిలి, కల్లూరు, ఓర్వకల్లు, ఆదోని, కోసిగి, కౌతాలం, పెద్ద కడుబూరు, ఎమ్మిగనూరు, నందవరం, మంత్రాలయం, ఆలూరు, చిప్పగిరి, అస్పరి, హొలగుండ, హాలహార్వి, పత్తికొండ, దేవరకొండ, తుగ్గలి, మద్దికెర, గోనెగండ్ల.

చిత్తూరు : **వైశాల్యం** 15,152 చ. కి.మీ. **నదులు :** స్వర్ణముఖి, పాపఘ్ని, పింఛా, బాహుదా, అరణి. **పంటలు :** వరి, రాగులు, సజ్జలు, జొన్న, వేరుశనగ, చెఱుకు, మామిడి. **మండలములు** 66 : చిత్తూరు, గుడిపాల, యాదమర్రి, గంగాధర, నెల్లూరు, పూతలపట్టు, పెనుమూరు, బంగారుపాలెం, తవనంపల్లి, ఐరాల, శ్రీరంగరాజపురం, పాచికపాలెం, కమ్మపల్లి, వడమాలపేట, పాల సముద్రం, పుత్తూరు, కార్వేటినగరం, నారాయణ వరం, నగరి, విండ్ర, విజయపురం, చంద్రగిరి, పాకాల, పులిచెర్ల, తిరుపతి,

రేణిగుంట, శ్రీకాళహస్తి, ఏర్పేడు, తొట్టంబేడు, బుచ్చినాయుడికండ్రిగ, కోవనూరు, నత్యవేడు, వరదయ్యపాలెం, నాగలాపురం, పిచ్చాటూరు, మదనపల్లి, నిమ్మనపల్లె, కురబలకోట, బి. కొత్తకోట పెద్దమాండ్యం, తంబళ్ళపల్లె, పెద్దతిప్ప సముద్రం, ములకలచెరువు, వాయల్పాడు, గుర్రంకొండ, కలకడ, కలికిరి, పీలేరు, ఎర్రవారిపాలెం, చిన్నగొట్టిగల్లు, రొంపిచెర్ల, కంబంవారి పల్లె, పుంగనూరు, చౌడేపల్లి, రామసముద్రం, సాదం, సోమాల, పెద్దపంజాని, పలమనేరు, గంగవరం, బైరెడ్డిపల్లె, వెంకటగిరికోట, రామకుప్పం, గూడుపల్లి, శాంతిపురం, కుప్పం.

**నెల్లూరు :** **వైశాల్యం 13,076 చ.కి.మీ. నదులు :** పెన్న, కందలేరు, మన్నేరు, స్వర్ణముఖి. **పంటలు:** వరి, జొన్న, సజ్జ, ఉలవలు, ఆముదాలు, ప్రత్తి, మిరప, రాగులు. **మండలములు 46:** నెల్లూరు, సీతారాంపురం, ఉదయగిరి, వరికుంటపాడు, దుత్తలూరు, మర్రిపాడు, వింజమూరు, కలిగిరి, కొండాపురం, కావలి, జలదంకి, విడవలూరు, బోగోలు, కోవూరు, దగదర్తి, అల్లూరు బుచ్చిరెడ్డిపాలెం, దొరవారి సత్రము, సంగం, ఆత్మకూరు, ఆమనుద్రంపేట, కొడవలూరు, డక్కిలి, అనంతసాగరం, కందుకూరుపేట, తోటపల్లి గూడూరు, వెంకటాచలం, ముతుకూరు, పొదలకూరు, చేజెర్ల, కలువాయి, రాపూరు, సైదాపురం, గూడూరు, మనబోలు, చిల్లకూర్రు, వాకాడు, కోట, చిట్టమూరు, నాయుడుపేట, పెళ్ళకూరు, ఓజిలి, సూళ్ళూరుపేట, తడ, వెంకటగిరి, బాలయపల్లి.

**శ్రీకాకుళం :** **వైశాల్యం 5,837 చ. కి.మీ** నదులు వంశధార, నాగావళి, బాహుదా. **పంటలు :** వరి, రాగులు, పెసలు, ఉలవలు, చెఱుకు, జనుము, వేరుశనగ, నువ్వులు, మిరప, పసుపు,

**ఓర్పు ఎంత చేదుగా వుంటుందో, దానివల్ల లభించే ఫలం అంతకంత తీయగా వుంటుంది.**



నీరుల్లి. **మండలములు 37** : శ్రీకాకుళం, ఇచ్ఛాపురం, కవిటి, కంచిలి, సోంపేట, పలాస, వజ్రపుకొత్తూరు, నందిగామ, టెక్కలి, సంతబొమ్మాళి, కోటబొమ్మాళి, జలుమూరు, సారవకోట, పాతపట్నం, మెలియ పుట్టి, హిరమండలం, కొత్తూరు, భమిని, సీతంపేట, వీరఘట్టం, బూర్జ, పాలకొండ, వంగర, రేగడి, ఆముదాలవలస, సంతకవిటి, రాజాం, నరసన్నపేట, పోలాకి, గార, మందసాల, పరిబుజ్జిలి, ఎట్చర్ల, గంగువారి సిగడం, పొందూరు, రణస్థలం, లావేరు.

**విజయనగరం :** **వైశాల్యం 6,539 చ.కి.మీ. నదులు** : పంపావతి, గోస్తని, శారద, నాగావళి, జంఝావతి, గోముఖి, సువర్ణముఖి, వేదవతి. **పంటలు** : రాగులు, సజ్జ, వరి, వేరుశనగ, చెఱుకు, నువ్వులు, ఉలవలు. జనుము **మండలములు 34** : విజయనగరం, గంట్యాడ, బోగాపురం, డెంకడ, పూసపాటిరేగ, శృంగవరపు కోట, జామి, కొత్తవలస, వేపడ, లక్కవరపుకోట, నెల్లిమర్ల, గుర్ల, చీపురుపల్లి, గరివిడి, మెరక ముడిదం, గజపతినగరం, బొండపల్లి, దత్తిరాజేరు, మెంటాడ, పార్వతీపురం, కొమరాడ, గారుగుబ్బిలి, జియ్యమ్మవలస, కురు పాం, గుమ్మలక్ష్మీపురం, బాదంగి, తెర్లాం, సాలూరు, పాచిపెంట, మక్కువ, రామభద్రాపురం, బొబ్బిలి, సీతానగరం, బలిజిపేట.

**విశాఖపట్టణం :** **వైశాల్యం 11,161 చ. కి.మీ. నదులు** : గోస్తనీ, వరాహ, శారద, తాండవ. పంటలు : వరి, సజ్జ, రాగులు, పెసలు, ఉలవలు, వేరుశనగ, నువ్వులు, చెఱుకు, **జనుము, నీరుల్లి, మండలములు 42** : విశాఖపట్టణం, చింతపల్లి, కొయ్యూరు, గూడెం కొత్తవీధి, పాడేరు, గంగరాజు మాడుగుల, మంచింగిపుట్, పెదబయలు, హుకుంపేట, అరకులోయ, అనంతగిరి, డుమ్బ్రిగూడ, చోడవరం, రావికమతం,

**ఓర్పు లేని మనిషి నూనె లేని దీపం లాంటి వాడు.**

బుచ్చయ్యపేట, చీడికడ, నర్సీపట్నం, గోలుగొండ, రోలుగుంట, కోట ఉరట్ల, నాకవరపాలెం, నాతవరం, నక్కపల్లి, పాయకరావుపేట, ఎలమంచిలి, యస్.రాయవరం, అచ్యుతాపురం, రాంబిల్లి, నకాపల్లి, మునగపాక, కశింకోట, కె. కోటపాడు, దేవరపల్లి, సబ్బవరం, పరవాడ, పెందుర్తి, గాజువాక, పెదగండ్యాడ, భీముని పట్టణం, పద్మనాభం, ఆనందపురం.

**తూర్పుగోదావరి :** **వైశాల్యం** 10,807 చ.కి.మీ **నదులు :** గోదావరి , ఏలేరు, **పంటలు:** వరి, మొక్కజొన్న, సజ్జ, ఉలవలు, పెసలు, మినుములు, మిరప, చెరకు, పసుపు, నువ్వులు, వేరుశెనగ, కొబ్బరి, మామిడి. **మండలములు :** 57 కాకినాడ, తాళ్లరేవు, కాజులూరు, కరప, సామర్లకోట, పెదపూడి, పిఠాపురం, గొల్లప్రోలు, కొత్తపల్లి, ప్రత్తిపాడు, ఏలేశ్వరం, శంఖవరం, పెద్దాపురం, కిర్లంపూడి, జగ్గంపేట, గండేపల్లి, రంగంపేట, తుని, తొండంగి, కోటనందూరు, అడ్డతీగల, రాజవొమ్మంగి, వై. రామవరం, గంగవరం, రంపచోడవరం, మారేడుమిల్లి, రాజమండ్రి, రాజానగరం, కడియం, కోరుకొండ, గోకవరం, సీతానగరం, రాయవరం, బిక్కవోలు, అనపర్తి, రామచంద్రపురం, సామర్లకోట, ఆలమూరు, మండపేట, కపిలేశ్వరపురం, సఖినేటిపల్లి, మల్కిపురం, రాజోలు, మామిడి కుదురు, పి. గన్నవరం, రావులపాలెం, ఆత్రేయపురం, కొత్తపేట, అంబాజీపేట, అమలాపురం, అల్లవరం, ఉప్పలగుప్తం, ఐనవిల్లి, ముమ్మిడివరం, కాట్రేనికోన, తాళ్లరేవు, పోలవరం, దేవీపట్నం.

**పశ్చిమగోదావరి :** **వైశాల్యం** 7,742 చ. కి.మీ. **నదులు :** గోదావరి, ఎర్రకాలువ, తమ్మిలేరు. **పంటలు :** వరి, జొన్న ,ఉలవలు, పొగాకు, మిరప, పసుపు. **మండలాలు :** 46 ఏలూరు, పెదపాడు, పెదవేగి, భీమడోలు, వీరవాసరం, ఆకివీడు, కల్ల, ద్వారకా



తిరుమల, దొందులూరు, చింతలపూడి, లింగపాలెం, కామవరపు కోట, టి. నర్సాపురం, తాడేపల్లిగూడెం, గణపవరం, వల్లజెర్ల, నిడమర్రు, ఉంగుటూరు, పెంటపాడు, కొవ్వూరు, చాగల్లు, నిడుదవోలు, దేవరపల్లి, గోపాలపురం, తాళ్ళపూడి, పోలవరం, కొయ్యలగూడెం, జంగారెడ్డిగూడెం, బుట్టాయ గూడెం, జీలుగుమిల్లి, తణుకు, ఇరగవరం, ఉండ్రాజవరం, అత్తిలి, పెనుమంట్ర, పెనుగొండ, పెరవలి, నర్సాపురం, మొగల్తూరు, యలమంచిలి, పాలకొల్లు, పోడూరు, ఆచంట, భీమవరం, పాలకోడేరు, ఉండి.

కృష్ణా : **వైశాల్యం 8,727 చ. కి.మీ. నదులు :** కృష్ణ, బుడమేరు, మున్నేరు, తమ్మిలేరు. **పంటలు :** వరి, జొన్న, పెసలు, మినుములు, ఉలవలు, వేరుశనగ, పొగాకు, చెఱుకు, పసుపు, **మండలములు : 49** మచిలీపట్నం, గూడూరు, పెడన, కృత్తివెన్ను, బంటుమిల్లి, అవనిగడ్డ, నాగాయలంక, కోడూరు, మొవ్వ, చల్లపల్లి, ఘంటసాల, గుడివాడ, ముదినేపల్లి, నందివాడ, పెదపారుపూడి, గుడ్లవల్లేరు, పామర్రు, మండవల్లి, కైకలూరు, కలిదిండి, విజయవాడ గ్రామీణ, విజయవాడ పట్టణం, పెనమలూరు, కంకిపాడు, మైలవరం, ఇబ్రహీంపట్నం, జి. కొండూరు, కంచికచెర్ల, వీరుల్లపాడు, నందిగామ, పెనుగంచిప్రోలు, చందర్లపాడు, జగ్గయ్యపేట, వత్సవాయి, నూజీవీడు, ఆకిరిపల్లి, ముసునూరు, బాపులపాడు, గన్నవరం, ఉంగుటూరు, వుయ్యూరు, పమిడిముక్కల, తోట్లవల్లూరు, విస్సన్నపేట, చట్రాయి, రెడ్డిగూడెం, కొండూరు, తిరువూరు, గంపలగూడెం.



గుంటూరు : **వైశాల్యం 11, 391 చ.కి.మీ. నదులు :** నాగులూరు, కృష్ణా, గుండ్లకమ్మ. **పంటలు :** వరి, జొన్న, పెసలు, మినుములు, పసుపు, పొగాకు, వేరుశనగ, మిరప, ప్రత్తి, మొక్కజొన్న, జనుము. **మండలములు : 57** గుంటూరు, వెల్దుర్తి,

**ఆత్మ విశ్వాసం మనసులోపలి పొరల్లోంచి వెల్లువలా రావాలి. అది బయటినుంచి అందించబడేది కాదు.**



మాచెర్ల, దుర్గి, రెంటచింతల, చెరుకుపల్లి, భట్టిప్రోలు, కారెంపూడి, గురజాల, దాచేపల్లి, మాచవరం, పిడుగురాళ్ళ, ఈవూరు, బొల్లపల్లి, వినుకొండ, నూజెండ్ల, శావల్యపురం (కనుమర్లపూడి) , రొంపిచెర్ల, నకరికల్లు, నర్సరావుపేట, చిలకలూరిపేట, నాదెండ్ల, ఎడ్లపాడు, బెల్లంకొండ, రాజుపాళెం, క్రోసూరు, ముప్పాళ్ళ, అచ్చంపేట, పెదకూరుపాడు, సత్తెనపల్లి, ఫిరంగిపురం, మేడికొండూరు, పెదకాకాని, ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, మంగళగిరి, తాడేపల్లి, తాళ్ళూరు, తాడికొండ, అమరావతి, దుగ్గిరాల, తెనాలి, వేమూరు, అమృతలూరు, కొల్లివర, నుందూరు, చేబ్రోలు, కొల్లూరు, పొన్నూరు, పెదనందిపాడు, కాకుమాను, బాపట్ల, పిట్లలవాని పాళెం, కర్లపాళెం, నగరం, నిజాంపట్నం, రేపల్లె.

ప్రకాశం: **వైశాల్యం** 17, 626 చ. కిమీ. **నదులు :** గుల్లకమ్మ, పాలేరు, మూసీ, మన్నేరు. **పంటలు :** వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జ, పెసలు, మినుములు, పసుపు, పొగాకు, వేరుశనగ, మిరప, ప్రత్తి, జనుము. **మండలములు : 56.** ఒంగోలు, టంగుటూరు, కొత్తపట్నం, నాగులుప్పలపాడు, చీమకుర్తి, మద్దిపాడు, సంతనూతలపాడు, అద్దంకి, కొరినపాడు, జె. పంగులూరు, బల్లికురవ, సంతమాగులూరు, మార్టూరు, యద్దనపూడి, చీరాల, వేటపాళెం, చినగంజాం, పరుచూరు, ఇంకొల్లు, కారంచేడు, కందుకూరు, గుడ్లూరు, ఓల్తేటివారిపాళెం, పొన్నలూరు, కొండవి, జరుగుమల్లి, సింగరాయకొండ, ఉలవపాడు, లింగసముద్రం, కనిగిరి, తిమ్మారెడ్డిపల్లి(హనుమంతునిపాడు). పామూరు, వెలిగండ్ల, చంద్రశేఖరపురం, పెదచెర్లోపల్లి, పొదిలి, కొనకనమిట్ల, మర్రిపాడు, దర్శి, తాళ్ళూరు, ముండ్లమూరు, దొనకొండ, తర్లుపాడు, మార్కాపురం, డోర్నాల, పెదఅరవీడు, కురిచేడు,



యర్రగొండపాలెం, త్రిపురాంతకం, పుల్లల చెరువు, గిద్దలూరు, రాచెర్ల, కొమరోలు, బెస్తవారిపేట, కంభం, అర్థవీడు.

మహబూబ్‌నగర్ : వైశాల్యం 18,432చ.కి.మీ నదులు : దిండి కృష్ణా, తుంగభద్ర, పెద్దవాగు. **పంటలు :** జొన్న, వరి, సజ్జ, పరిగెలు, రాగులు, ఉలవలు, కందులు, మిరప, వేరుశనగ, ఆముదాలు, కుసుమలు, ప్రత్తి **మండలములు :** 64 మహబూబ్‌నగర్, కొడంగల్, మద్దూరు, దౌలతాబాదు, బొమ్రానుపేట, కోసిగి, దామరగిడ్డ, మఖ్తల్, నారాయణ్‌పేట, ఉట్కూరు, ధన్వాడ, మాగనూరు, కోయిల్కొండ, నవాబ్‌పేట (యన్‌మన్‌గండ్ల), హన్వాడ, జడ్చర్ల, బాలానగర్, బూత్‌పూర్, ఫరూక్‌నగర్ (షాద్‌నగర్), కేశంపేట, కొందుర్గ్, కొత్తూరు, ఆమనగల్లు, కల్వకుర్తి, వెల్దండ, వంగూరు, మాడ్గుల, మిద్దాల, తలకొండపల్లి, నాగర్‌కర్నూలు, తిమ్మాజిపేట, బిజినేపల్లి, గోపాల్‌పేట, తెల్కపల్లి, తాడూర్, కొత్తకోట, వనపర్తి, పెబ్బేరు, ఘనాపూర్, పెద్దమందాడి, అడ్డకల్, ఆత్మకూరు, దేవరకద్ర, చిన్నచింతకుంట, ఈజ్, గద్వాల, ధారూర్, మల్దాకల్లు, ఘట్టు, అలంపూర్, వడ్డేపల్లి ( శాంతినగర్), మానోపాడ్, ఇటిక్యాల్, కొల్లాపూర్, పెద్ద కొత్తపల్లి, కోడేరు, పానగల్లు, వేపనగండ్ల, అచ్చంపేట, అమరాబాదు, లింగాల, బాలమూరు, వార్ప, ఉప్పునూతల.



హైదరాబాదు : వైశాల్యం 217 చ.కి.మీ. నది : మూసీ మండలములు 4. సికింద్రాబాదు, ముషీరాబాదు, గోల్కొండ, చార్మినార్.

రంగారెడ్డి జిల్లా : వైశాల్యం 7,493 చ.కి.మీ. నది : మూసీ **పంటలు:** మొక్కజొన్న, వరి, పప్పుధాన్యములు, నూనెగింజలు, బంగాళాదుంపలు. **మండలములు :** 36 అవి . ఇబ్రహీంపట్నం, మంచల్, మహేశ్వరం, కందుకూరు,

**మనకి ఎదురయ్యే ఇబ్బందులకన్నా వాటిని గురించి నలుగురూ విసిరే వ్యాఖ్యలే మన మీ ఎక్కువగా దెబ్బ తీస్తాయి.**



హయాత్‌నగర్, ఉప్పల్, సరూర్‌నగర్, ఘటకేశ్వర్, మేడ్చల్, షామీర్‌పేట, కుత్‌బుల్లాపూర్, కీసర, మల్కాజ్‌గిరి, బాలానగర్, శేరిలింగంపల్లి, రాజేంద్రనగర్,‌శంషాబాదు, శంకరంపల్లి, చేవెళ్ళ, మొయినాబాదు, షాబాదు, గండీడ్, కుల్క చెర్ల, దోమ, పర్గి, పుదూరు, దారూరు, నవాబ్‌పేట, వికారాబాదు, మోమిన్‌పేట, మార్పల్లి, బంట్వారం, పెద్దమల్క, బషీరాబాదు, యాలాల్, తాండూరు.

మెదక్ : వైశాల్యం 9,699 చ.కిమీ. నదులు : మంజీరా, కుండలియార్, హల్దీ పంటలు : వరి, , జొన్న, మొక్కజొన్న, రాగులు, కుసుములు, బంగాళా దుంపలు మండలములు : 45 సంగారెడ్డి, కాంగ్టీ కల్హేర్, నారాయణ్‌ఖేడ్, మానూర్, రేగోడ్, శంకరంపేట, ఆళ్ళదుర్గ్, పుల్కాల్, ఆందోల్, టేక్మల్, పాపన్నపేట, కుల్చారం, మెదకు, రామాయంపేట, ఎల్దుర్తి, చేగుంట, మిర్దొడ్డి, దుబ్బాక, సిద్దిపేట, చిన్నకోడూరు, సంగునూరు, కొండపాక, జగదేవ్‌పూ ర్, గజ్వేలు, దౌలతాబాదు, వర్గల్, ములుగు, తూప్రాన్, శివంపేట, జిన్నారం, నర్సాపూర్, కౌడిపల్లి, హత్నూరు, రామచంద్రాపురం, పటాన్ చెరువు, కొండాపురం, సదాశివపేట, మున్‌పల్లి, కోహిర్, జహీరాబాదు, ఝరాసంగం, రాయ్‌కోడ్, న్యాల్కల్, శంకరంపేట,

నిజామాబాదు : వైశాల్యం : 7,956 చ.కి.మీ. నదులు : మంజీర, గోదావరి, పంటలు : వరి , చెఱుకు, పప్పు ధాన్యములు, మొక్కజొన్న, మండలములు : 35 అవి. నిజామాబాదు, బాల్కొండ, ఆర్మూరు, బ్రికన్‌పల్లి, మోర్తాడ్, కమ్మరపల్లి, వేల్పూర్, భీమ్‌గల్, సిరికొండ, నందిపేట, నవీపేట, మక్లూర్, డిచ్‌పల్లి, ధర్పల్లి, రంజాల్, బోధన్, కోట్‌గిర్, వార్ని, మద్నూరు, బిచ్కుండ, జుక్కల్, బీర్కూరు, బాన్సువాడ, నిజాంసాగర్,



చక్కటి ఆలోచన, సరైన ముందుచూపు లేని మనిషిని ఆపదలు ముసురుతుంటాయి.

పిట్లాం,గాంధారి, లింగంపేట, ఎల్లారెడ్డి, నాగిరెడ్డిపేట, సదాశివనగర్; తాడ్వాయ్, కామారెడ్డి, మాచారెడ్డి, దోమకొండ, భిక్నూరు.

**అదిలాబాదు :**



**వైశాల్యం :** 16,128 చ.కి.మీ. **నదులు :** ప్రాణహిత, పెన్‌గంగ, వార్ధా, కడెం, పెదవాగు, సిద్ధా, పంటలు : వరి, జొన్న, శనగ, కందులు, పెసలు, ప్రత్తి, నువ్వులు, మొక్కజొన్న. **మండలములు :** 52. అదిలాబాదు, తలమడుగు, తాంశి, జైనాద్, బేలా, బోథ్, బజార్‌హత్నూర్, ఇచ్చోడా, నేరెడికొండ, గుడిహత్నూర్, ఉట్నూరు, ఇందిరవెల్లి, నర్నూరు, జైనూర్, సిర్పూర్, లోహెస్రా, కుంతల, సారంగపూర్, నిర్మల్, దిల్వార్‌పూర్, మమ్డా, లక్ష్మన్‌చాందా, కుబీర్, భైంసా, ముధోల్, టానూర్, ఖానాపూర్; కడెం (పెద్దూరు), జన్నారం, దండేపల్లి, లక్సెట్టిపేట, మంచిర్యాల, మందమర్రి, కాశీపేట, రెబ్బెన, ఆసిఫాబాదు, తాండూరు, బెల్లంపల్లి, తిర్యాని, కేరమేరి, చెన్నూరు, వాంకిడి సిర్పూరు, కౌతల, బిజ్జూర్, దాహేగాం,, భీమిని, కాగజ్‌నగర్, కోటపల్లి, వేమనపల్లి, జయపూర్, నెన్నాల్.

**కరీంనగర్ :**



**వైశాల్యం : 11,823** చ.కి.మీ. **నదులు :** గోదావరి, మానేరు. **పంటలు :** వరి, జొన్న, మొక్కజొన్న, చెఱుకు, వేరుశనగ, పచ్చపెసలు, మిరప, ఉలవలు, నువ్వులు. మండలములు : 56 కరీం నగర్, మానకొండూర్, తిమ్మాపూర్, బెజ్జంకి, గంగాధర, రామడుగు, చొప్పదండి, హుస్నాబాదు, చిగురుమామిడి,కోహెడ, హుజూరాబాదు, జమ్మికుంట, వీణవంక, కమలాపూర్, ఎల్కతుర్తి కేశవపట్నం, సైదాపూర్,

భీమదేవరపల్లి, కొడిమియాల్, జగిత్యాల, రాయ్‌కల్లు, ధర్మపురి, సారంగపురం, మల్యాల, కోరుట్ల, పెగడపల్లి, గొల్లపల్లి, మెట్‌పల్లి, మేడిపల్లి, ఇబ్రహీంపట్నం, సిరిసిల్ల, మల్లాపూర్, కథ్లాపూర్ ఇల్లంతకుంట, గంభీరావుపేట, ముస్తాబాదు, ఎల్లారెడ్డిపేట, వేములవాడ, బోయినపల్లి, కోనరావుపేట, చందుర్తి పెద్దపల్లి, శ్రీరాంపురం, ఓదెల, రామగుండం, కమాన్‌పూర్, సుల్తానాబాదు, వెల్లటూరు, ధర్మారం, జూలపల్లి, మంథని, ముత్తారం, మల్హర్, మహదేవ్‌పూర్, కాటారం మహాముత్తారం.

వరంగల్ : **వైశాల్యం** 12,846 చ.కి.మీ. **నదులు :** కొల్లేరు, గోదావరి, కిన్నెరసాని. **పంటలు :** వరి, సజ్జ, జొన్న, మొక్కజొన్న, పెసలు, వేరుసెనగ ఆముదాలు, **మండలములు :** 50 హనుమకొండ, చిట్యాల, మొగుళ్ళపల్లి, భూపాలపల్లి, పరకాల, శాయంపేట, రేగొండ, ములుగు, ములుగు (ఘనపూర్) వెంకటాపూర్, తాడ్వాయ్, గోవింద రావుపేట, ఏటూరునాగారము, మంగపేట, గూడూరు, ఖానాపూర్, కొత్తగూడెం, నర్సంపేట, నల్లబెల్లి, చెన్నారావుపేట, దుగ్గొండి, నెక్కొండ, హసన్‌పర్తి ఆత్మకూరు, గీసుగొండ, జఫ్ఫర్‌ఘడ్, సంగం, ఘనాపూర్; ధర్మసాగర్, , చేర్యాల, బచ్చన్నపేట, నర్మెట్ట, మద్దూరు, వరదన్న పేట, పర్వతగిరి, రాయపర్తి జనగాం, రఘునాథపల్లి, లింగాల ఘనపూర్, కొడకండ్ల, పాలకుర్తి, కొర్వి, దేవరుప్పల, మురిసేడ, నర్సింహులపేట, తొర్రూర్, మహబూబాబాదు, డోర్నకల్, నెల్లికోడూరు, కేసముద్రం.



ఖమ్మం: **వైశాల్యం** 16, 029 చ.కి.మీ. **నదులు :** మున్నేరు, పాలేరు, కిన్నెరసాని, వైరా, శబరి, సీలేరు. **పంటలు:** జొన్న, వరి, పెసలు, ఉలవలు, వేరుశనగ, నువ్వులు, మిరప, పొగాకు, మొక్కజొన్న. **మండలములు : 46.** ఖమ్మం (పట్టణం), ఖమ్మం (గ్రామీణ), ముదిగొండ, నేలకొండపల్లి,కొనిజెర్ల, చింతకాని, కుసుమంచి, తిరుమలాయపాలెం, ఎర్రపాలెం, మిర, బోనకల్లు, వైరా, కల్లూరు, పెనుబల్లి, వేంసూరు, సత్తుపల్లి, దమ్మపేట, అశ్వారావుపేట, ములకలపల్లి, ఎల్లందు, సింగరేణి, కామేపల్లి, గార్ల, బయ్యారం, గుండాల, టేకులపల్లి, కొత్తగూడెం, పాల్వంచ, జూలూరుపాడు, చంద్రుగొండ, తల్లాడ, వాజీడు, ఏన్కూరు, బూర్గంపాడు, కుకునూరు, వేలేరుపాడు, మంగూరు, అశ్వపురం, పినపాక, దుమ్ముగూడెం, భద్రాచలం, కూనవరం, వరరామచంద్రపురం, చింతూరు, వెంకటాపురం, చెర్ల.



నల్గొండ : **వైశాల్యం** 14,240 చ. కి.మీ. **నదులు** కృష్ణా, మూసీ, ఆలేరు, పల్లేరు. **పంటలు :** వరి, జొన్న, సజ్జ, పప్పుధాన్యములు, మామిడి, మామిడి. **మండలములు : 59** నల్గొండ, యాదగిరిగుట్ట, ఆలేరు, రాజపేట, తుర్కపల్లి, భువనగిరి, గుండాల, ... బొమ్మలరామారం, పోచంపల్లి, బీబీనగర్, రామన్నపేట, వలిగొండ, చౌటుప్పల్, మోతుకూరు, ఆత్మకూరు, తుంగతుర్తి, తిరుమలగిరి, నూతనకల్లు, అర్వపల్లి శాలిగౌరారం, పెన్‌పహాడ్, ఆత్మకూరు, మోతే, చివ్వేముల, నక్రేకల్, కోతేపల్లి, శాలిగౌరారం, కట్టంగూరు, చండూర్, మునుగోడ్,



పూజైనా, ప్రార్థనైనా ప్రపంచంలోని పద్ధతులను మార్చదు. అది మార్చేదల్లా మనుషులని, ఆ మనుషుల పద్ధతులను మార్చెయ్యగలదు.

నారాయణపూర్, నార్కట్ పల్లి, కనగల్, తిప్పర్తి, చిట్యాల,
నాంపల్లి, చింతపల్లి, గుర్రంపోడ్, మర్రిగూడ, దేవరకొండ,
పెద్దఆడి సెర్లపల్లి, చందంపేట, గుండ్లపల్లి, నిడమనూరు,
పెద్దవూర, హాలియా (ఆనమల), త్రిపురారం, మిర్యాలగూడ,
దామర్లచెర్ల, వేములపల్లి, హుజూర్‌నగర్, నేరేడుచెర్ల, గరిడెపల్లి,
మట్టంపల్లి, కోదాడ, మేళ్ళచెరువు, చిలుకూరు, నడిగూడెం,
మునగాల.

## బాల కీర్తనం

భరతమాతను కన్ను లందున
భద్ర పరచిన బాలురం - మేం బాలలం
గుడులలో గల పవిత్రతలు
గుండెలోగల పాపలం - రవి ప్రమిదలం ॥ భ ॥

భావి భరతోద్యానమున - విర
బూయ బోయే మొగ్గలం
భావి పౌరుల చూసి మురిసే
బావుటాలకు నిగ్గులం ॥ ॥ భ ॥

ప్రపంచానికి శాంతిదేవత,
ప్రసాదించిన దూతలం,
బుద్ధదేవుడు జననమొందిన,
భువిని రేపటి నేతలం ॥ ॥ భ ॥

అంతా మంచే జరుగుతుందని ఆశిస్తూ [illegible]
[illegible]

ఎదురువచ్చే శతాబ్దమ్మును,
ఏలబోయే ధీరులం,
ఇలా తలమును స్వర్గముగ - ని
ర్మించబోయే శిల్పులం !! ॥ భ ॥

- సుద్దాల సుధాకర్

## బాల సందేశం

మా దేశం పూలకడలి,
మా హృదయం పాలకడలి,
మా వేదం, మా వాదం,
విశ్వమానవీయ పథం - ॥ మా ॥



ప్రాపంచిక విపంచిపై,
రవళించే గీతాలకు,
పల్లవినందించె నిచట,
విశ్వశాంతి సందేశం ! ॥ మా ॥

పరులని తలచకనే, ఎద
పరచినదీ నేలతల్లి !
పుష్పకమై సహనానికి,
దీపిక నా కన్నతల్లి ! ॥ మా ॥

సుద్దాల అశోక్ తేజ

శాంతి పరిరక్షించడానికి అవసరమైన పటిష్టమైన పద్ధతుల్లో అన్నింటికన్న మిన్న యుద్ధానికి సదా సిద్ధంగా వుండడమే.